" నమో ధర్మాయ మహతే "

శ్రీ గణేశాయ నమః । సద్గురు శ్రీ కౌండిన్యాయ నమో నమః ।

# శ్రీ కౌండిన్య స్తోత్రము

శ్లో॥ శ్రీ కౌండిన్య మహామునిం గుణ నిధిం పూర్ణ ప్రభా భాసురమ్
నిర్ద్వంద్వం నిరపేక్ష కామ మమలం నిస్సంగ మాద్యం విభుమ్ ।
నిత్యానంద మయం నిరీహ మతులం నిర్ముక్త కర్మాదికమ్
శ్రీ కౌండిన్య ఋషిం భజే మమ గురుం శ్రీ చిత్త సంతోషణమ్ ॥

శ్లో॥ నిత్యం సాంద్ర కృపారసం విదిత భావాభావ మత్యున్నతమ్
ద్వంద్వాతీత మమత్వరం పరమ కళ్యాణాత్మ తత్వా కరమ్ ।
బ్రహ్మానంద మయం సుబోధ నిలయం స్వానంద భావం నమః
శ్రీకౌండిన్య సదన్వయాబ్ధి విలసత్ సర్వాత్మనం సద్గురుమ్ ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞాన మూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వ మస్యాది లక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షి భూతం
కౌండిన్యర్షిం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ॥

శ్లో॥ మౌనిస్వాంత నియోగ నిర్మల తనుం తారాపదాంఘ్రిద్వయం
ధీరవ్యాస సువర్ణ భూషణ గణం కాషాయ సుపీతాంబరమ్ ।
భక్త స్తోత్ర కదంబ సూన సురభిం ప్రాఢాహి భుగ్వాహనమ్
వందే వేద లతానికుంజ భవనం కౌండిన్య మౌనిం భజే ॥

శ్లో॥ హృత్పుండరీక, మధ్యస్థం, సకలామ్నాయ సంస్తుతం ।
ధ్యాయామ్యహం సదా భక్త్యా సకలాభీష్ట దాయకమ్ ॥

●●●



సర్దార్ సర్వాయి పాపన్న

చూడు పుట-254

ఓం - శ్రీ లక్ష్మీ గణేశ్వరాయ నమః ।
సద్గురు కౌండిన్యాయ నమః ।

# సమగ్ర గౌడుల చరిత్ర

## తృతీయ భాగము

### కౌండిన్యోత్పత్తి క్రమము

కం॥ చండకర ప్రతిముండగు
కౌండిన్యుఁడు వంశకర్త - గౌడుల కనుచున్
బండితులను చుండుట చే
దండం బొనరింతు ముంద - తనికతి భక్తిన్ ।

సీ॥ అత్రిమానస పుత్రుడైన కౌండిన్యుండు
అసమాన సత్తపో లసితుడగుచు
వనజాక్షియైన దే । వకకు సుమంతుడన్
మునిపుంగవునకును । బుట్టినట్టి
మాయినా జను నింతి । మక్కువ బెండ్లియై
సొగసుల గులుకు న । మ్మగువ యందు
నోరి గౌండిల్య నా । యుర్థమ్మ వామాక్షు
దేవాశ్రయుడు నను । ధీమహితుల

తే॥గీ॥ నలువురం గని కైలాస । నగము నుండి
సలలితం బైన శివలింగ । మెలమి దెచ్చి

---

దాతలైన వారి । తాతలైనను గాని ; శక్తి యుక్తి లేక । భుక్తి కొరకు
తలను వంచరాదు । దాసోహమనుచును; గౌడులార కీర్తి । కలితులార ॥

దాని మైసూరు చెంత ము । క్త్రాపురమున
నిలిపె ద్రి సహస్ర శిష్యులు । గలిసి కొలువ ॥

తే।గీ॥ అచ్చటనె యుండె కౌండిన్యు । నాశ్రమంబు
చెలగి కౌండిన్య మునియె స్ప - ష్టించె సురను
ఆర్యులందరు దీనినే । యమృత సిద్ధి
రస మనుచు గ్రోలుచున్నారు । ప్రమద మెసగ ।

తే।గీ॥ ఇట్టి వనరాని మహిమల । నింపు మీరు
మాన్య వర్తనుడైన కౌండిన్య మునికి
మ్రొక్కి వినిపింతు వినుడు తత్పుణ్యకథల
ఘన యశో దీప్తులార । యో । గౌడులార ।

శ్లో॥ అత్రివంశ సముత్పన్నాన్గోత్ర కారాన్ని బోధమే ।
కర్ధమాయన శాఖేయ స్తతా కౌండిన్యణాశ్చయే ।

## అత్రి మహర్షి వంశము

భద్రాశ్వుడను మహర్షికి ఘృతాచియనే అప్సరస మొదట భార్య కాగా ఆమె యందు - భద్ర, శూద్ర, మద్ర, శలభ, మలద, బలా, హల, గోచలప, తామరస, రత్నకూట యనే పది మంది కుమార్తెలు, ప్రభాకరుడనే కుమారుడు జన్మించారు. యుక్త వయస్కులైన పిదప భద్రాశ్వుడీ పదిమంది కన్యలను నవబ్రహ్మలలో మూడవ వాడైన అత్రిమహర్షి కిచ్చి వివాహం చేశాడు. అత్రిభార్యలందరు సుందరాంగులు, సద్గుణశోభితలు, పతివ్రతలై యుండిరి.

పై వారిలో మద్రయనునామెకు "చంద్రుడు" కుమారుడుగా పుట్టాడు. ఆసుందరాంగుడైన వానిని చూచిన రాహువు తన కాహారము దొరికెనని సంతోసించి మ్రింగడానికి వచ్చింది. రాహువుని చూచిన మద్ర శరీరమంతా

---

కాయకష్టమునను / కండలు కరిగించి ; చేయవలయు పనులు / చిన్నవైన
చిన్న వైన గాని / శ్రేయంబు కలిగించు; భవ్యులార గౌడ / వంశ్యులార ॥

వణుకుచు బాధను భరింపజాలక భయంతో మూర్ఛపోయింది. ఇది చూచిన సూర్యుడు కూడా స్పృహతప్పి ఆకాశం నుండి భూమి మీదకు పడుచుండగా ప్రపంచమంతా గాఢాంధకారం ఆవరించింది. అది చూచిన అత్రిమహర్షి తన శక్తితో క్రిందపడుచున్న సూర్యుని మధ్యలో ఆపుచు – "ఖర కిరణా ! నీకుశుభమగుగాక "! అనగానే ఆ ముని వాక్య పటిమతో క్రిందపడబోయే సూర్యుడు మునుపటి వలె స్వస్థుడై, యథాస్థితిని పొంది, అత్రిముని యందలి గౌరవముతో వాని గోత్రబృందాన్ని ప్రసిద్ధులగునట్లు జేయ సంకల్పించి ఆత్మగుణ భవ్యులైన ఆత్మ జన్ములను సృష్టించాడు.

వారెల్లరు సర్వగుణ వర్థిత కీర్తులు, బ్రహ్మవాదులు, ఉర్వీరమణ ప్రపూజితులు, వేదవిదులు, ఆర్యధర్మ సంభార సమగ్రులు, ఉత్తములు, భాసురతేజులు, యోగనిష్ఠాగరిష్ఠులైన వరిష్ఠులయ్యారు. క్రీ.శ. 357లో థాయిలేండులో ప్రాంతీయంగా వాడబడు సంస్కృత భాషలో కౌండిన్యుని చరిత్ర వ్రాయబడింది.

ఈ భూమ్మీద బ్రహ్మ వంశోద్భవుడైన అత్రిమహర్షికి శాంతమూర్తి, పరిశుభ్ర యశశ్శరదిందు చంద్రికా పరివృత దిగ్వధూమకుట భవ్యతలుండు, అఖిలార్థవేది, సుందర తనురాజితుడు, కరుణానిధి, పుణ్య సముద్రుడైన కౌండిన్య డుద్భవించిన క్రమ మెట్టిదనిన –

ఈశ్వరుడు త్రిపురాసురుని సంహరించడానికి పూర్వం, రాక్షసులంతా లోక కంటకులై దేవతల నేవిధంగా నైనా జయించి అమృత పానంతో అమరత్వాన్ని పొందవలెనన్న కోరికతో దేవతలపై దండెత్తి వారిని చెరబట్టి హింసించు చుండగా వారి ధాటికోర్వలేని ఇంద్రుడు భయపడి మునులందరితో కలిసి హిమాలయంలో చిరకాలం వుండిపోవడం వల్ల దిక్పాలకులు తమ పనులను సక్రమంగా నిర్వహించని కారణంగా భూలోకంలో వర్షాభావమేర్పడింది. కరవు కాటకాలతో పంట పొలాలన్నీ బీడువారి నెఱలు దీరియుండగా మానవులంతా ఆకలితో అలమటిస్తూ ఆహాకారాలు చేస్తున్నారు. అప్పుడు

మూడు పూట్ల కూడ / ముద్దైన లేనట్టి ; బీద బిక్కి గలరు / పేదలగుచు
అట్టి వారి మేలు / అందరుకోరుడీ ; కలిత సుగుణులార / గౌడులార ॥

లోక కళ్యాణం కాంక్షించిన మహర్షులందరు కలిసి బ్రహ్మయైన అత్రిమహర్షిని దర్శించి భూలోక వాసులను రక్షించి క్షుద్బాధా నివారణ చేయుడని ప్రార్థించారు. వారి ప్రార్థన మాలించిన అత్రి మహర్షి దయార్ద్రహృదయుడై తన ఆత్మ తేజస్సుతో "ఓమ్ గౌడశ్యా శ్శివాయ స్వాహా" అనే దివ్య మంత్రోచ్ఛారణతో ఆయుధ ధరుడైన ఒక దివ్య పురుషుణ్ణి ఉద్భవింపజేసి ఆ మానసపుత్రునకు "కౌండిన్యు"డని నామకరణ చేసి "కుమారా! నా తపః శక్తితో నీ కనేక దివ్య శక్తు లనుగ్రహింపబడ్డాయి. భూలోకంలో వర్షాలు కురవనందున మానవులాహారపానీయాల్లేక అల్లాడిపోతున్నారు. గనుక నీవు వెంటనే భూలోకం వెళ్ళి నీ దివ్య మహిమతో దేవలోక-భూలోక వాసులకు ఆహార పానీయాలు గల్పించి రక్షింపు"మని ఆజ్ఞాపించాడు.

తండ్రి ఆజ్ఞను శిరసావహించిన కౌండిన్యుడు భూలోకానికి వచ్చి రోగగ్రస్తులై పడి యున్న మానవుల రోగాల్ని పోగొట్టడానికి ఆరోగ్యాన్నిచ్చే అనేక దివ్య మూలికలను, నయానానందకరములైన అనేకానేక లతాపుష్పాదులను సృష్టించి, గౌడమంత్ర ప్రభావంతో మధుర రసాలిచ్చే కల్ప వృక్షాలనబడే ఈత, తాడి, కొబ్బరి మొదలగు ఫల వృక్షాల్ని కల్పించి వాటి సాయంతోను, ధాన్యాదులను సృష్టించి దేవలోక భూలోక వాసుల కాహారాదులను సమకూర్చి రక్షించాడు.

చం॥ ఫలములు మూలికా వితతి । భవ్య సుగంధి లతా విశేషమున్
గలుగగ జేసి మానవుల । గాచె తపస్స్ఫురణ ప్రభూత ది
వ్య లతల నుండి కాఱు మృదు । లామృతముం దమిదీర ద్రాగి స
త్ఫలముల మెక్కి మానవులు । తన్వి(?)జెలంగిరి మౌని చంద్రమా ।

కౌండిన్యునిచే సృష్టింపబడిన ఫలవృక్షముల ఫలములను తిని, మధు సిద్ధ రసాన్ని త్రాగి తమ ఆకటి బాధను బోగొట్టుకొని మానవులు సుఖించారు.

(బ్రాహ్మణ మార్తాండము - హిందీ భాషాటీకా - 112 పుట)

---

కూడులేక యెవడు । కుములు చుండిన గాని; విశ్రమించకుండ । వేగమతని
పైకి తీయువాడె । భవ్యుడీధరలోన ; కలిత విభవులార । గౌడులార ॥

# కౌండిన్యుని వివాహము వాని సంతతి

శ్లో॥ పితా దృష్ట్వా సుమంతోఽపి స్త్రీ చిహ్నం యౌవనే స్థితాం
కస్మై దేయా మయా కన్యేత్య చింతయ దతీవసః ।
మునిః కౌండిన్య నామావై వివాహేచ్ఛారతా గతః
తస్మై ప్రదేయా కన్యేతి సుమంతే నాపి నిశ్చితం ॥

(ఋగ్వేదము – 12వ మండలము)

బ్రహ్మజ్ఞాన సంపన్నుడు, శివపూజా దురంధరుడు, సత్యవాది తపోధనుడైన సుమంతుడను వానికి "ప్రదేవ" యనే భార్యయందు "మయాకన్య" అనే కుమార్తె పుట్టింది. ఆ కన్య క్రమంగా స్త్రీ చిహ్నాలు ధరించి పూర్ణయౌవనవతి కాగా సుమంతుడు వరాన్వేషణ ప్రారంభించాలనుకున్నాడు. అంతలో కౌండిన్యుడు తన తండ్రియైన అత్రిమహర్షి ఆజ్ఞానుసారం వివాహార్థియై సుమంతుని వద్దకు వచ్చాడు. సుమంతుడు తన దివ్యదృష్టితో కౌండిన్యుని వృత్తాంతం తెలిసికొని మిక్కిలి సంతోషించి తన కన్యను చూపించి వివాహమాడుమని కోరాడు. సమాన రూప వయోశోభితులైన ఆ యువతీ యువకులు పరస్పరం దర్శించుకొని వివాహాని కంగీకరించారు. అప్పుడు సుమంతుడు పరమానంద భరితుడై తన బంధు వర్గాన్ని సువాసినులైన మునిపత్నులను రావించి మయాకన్యను కౌండిన్యున కిచ్చి మహావైభవంగా వివాహం చేశాడు. చిరకాలమా అన్యోన్య దంపతులు సంసార సుఖముల ననుభవింపగా తేజోవంతులు, దివ్యజ్ఞాన సంపన్నులైన కౌండిల్యుడు, ఆయుద్ధర్ముడు, వామాక్షుడు, దేవాశ్రయుడనే నలుగురు పుత్రులుదయించారు. వీరే కౌండిన్య గోత్రోద్భవులైన దేవగౌడులు.

**కౌండిన్య పుత్రుల వివాహము :** కుమారులు యుక్తవయస్కులైన పిదప కౌండిల్యునకు -సత్యపాంధుని పుత్రికయైన స్వర్ణరూపితోనూ, ఆయుద్ధర్మునకు విమలాదేవితోను, వామాక్షునకు-నిర్మలాదేవి తోనూ, దేవాశ్రయునకు-కుశలాదేవి తోనూ వివాహాలు జరిపించాడు. తరువాత వీరు

---

ఇహపరములు రెండు / నిచ్చు నాదైవంబు; మంచి పనులు చేయు / మాన్యులకును మానవత్వమనగ / మంచిమనసు గాదె; గళిత గర్వులార / గౌడులార ॥

నలుగురు నాలుగు గోత్ర నామములతో వ్యవహరింపబడ్డారు. వీరు కూడా అమోఘ తపశ్శక్తి సంపన్నులై తమ మహిమలతో కల్పవృక్షము లైన తాటి, ఈత, కొబ్బరిచెట్ల నుండి అమృత సిద్ధ రసములను సృష్టించి దేవ మానవులకిచ్చి వారి మన్నన లందుచుండెడివారు.

## దేవగౌడుల - శివగౌడుల గోత్రములు

(1) అత్రిగోత్రము (2) కౌండిన్య గోత్రము (3) కౌండిల్య గోత్రము (4) ఆయుధామ గోత్రము (5) హేమాక్ష గోత్రము (6) దేవాశ్రయ గోత్రము. ఈ గోత్రీకుల సంతతి వారంతా శివదీక్షాపరాయణులు, శివ పూజా దురంధరులై దేవగౌడులని, శివగౌడులని ఆకాలమున పిలువబడుచుండేవారు. వీరు తమ అద్భుత తపఃశ్శక్తి తోను, గౌడమంత్ర ప్రభావం తోనూ, కల్ప వృక్షముల నుండి అమృత సిద్ధ రసమును కల్పించి దేవలోక వాసులగు గరుడ, గంధర్వ, యక్ష, సిద్ధ,, నాగ, కిన్నర, కింపురు షాదుల కిచ్చి వారి ప్రశంసలకు పాత్రలగు చుండెడివారు. దేవతలా అమృత సిద్ధ రసమును గ్రోలి తత్త్వభావముతో బ్రహ్మజ్ఞాన సంపన్నులై విలసిల్లిరి.

(*ఆదిగౌడ దీపిక - 121-124 పుటలు - హిందీ అనువాదము*)

## కౌండిన్యునకు శంకర సాక్షాత్కారము :

ఈ విధంగా కౌండిన్యుడు భార్యయైన మయాకన్యతో దీర్ఘకాలము సంసార సుఖము లనుభవించి, తన కుమారులందరు దివ్యజ్ఞాన సంపన్నులు, సంతానవంతులయి నందులకెంతగానో సంతోసించి పరచింతా కుతూహలముతో తపస్సుకు పోవ నిశ్చయించి జ్యేష్టుడైన కౌండిల్యుని పిలిచి - "నాయనా! నా ఆశీర్వాద బలంతో నీ సంతతి వారందరును కౌండిల్య గోత్రీకులై యీ భూమి వున్నంతకాలం వారి సంతతి వుంటుందని దీవించి" మిగతా కుమారుల వద్దను భార్య వద్దను అనుమతిని పొంది శివుని గూర్చి తపస్సు చేయడానికి హిమాలయాలకు వెళ్ళిపోయాడు. అక్కడొక దివ్యస్థలాన్నెంచుకొని ఈశ్వరుని

---

*కాలి బాటలేక / కంటక మయమైన; తోట లెల్ల తిరుగు / పాటపాడి*
*పాము, తేలు, జెట్టి / వరలు చెట్లును నెక్కు; గౌడులార కీర్తి / కలితులార "*

గూర్చి ఘోర తపస్సు చేయనారంభించాడు. ఈ విధంగా అనేక దివ్య వర్షాలు గతించాయి. అప్పుడతని తపస్సుకు మెచ్చిన పరమేశ్వరుడు ప్రత్యక్షమై - "నాయనా! కౌండిన్యా! నిన్ను భూలోకమునకు పంపిన పని నెరవేరింది. నీవు నాయంశమున జన్మించావు గనుక నీ కీర్తి యీభూమ్మీద శాశ్వతంగా వుండులాగున అనుగ్రహించాను. ఇక నుండి నీవంశ మీలోకంలో ఆచంద్ర-తారార్కము ప్రఖ్యాతి గాంచగలదు. నీ తపస్సుకు మెచ్చి నీకు శాశ్వత బ్రహ్మలోక సౌఖ్యం కలుగులాగున చేస్తున్నాను" అని వరమిచ్చి శివుడంతర్ధాన మయ్యాడు. పరమేశ్వర సాక్షాత్కారంతో పులకిత గాత్రుడైన కౌండిన్యుడు పరమేశ్వరుని-

శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవ శంభో! నమస్తే నమస్తే ప్రసన్నైకబంధో!
నమస్తే నమస్తే దయాసార సింధో! నమస్తే నమస్తే నమస్తే మహేశా!

అని శతవిధముల స్తుతించి బ్రహ్మలోకమున కరిగెనని సూతులవారు శౌనికాది మహర్షులకు కౌండిన్యోత్పత్తి నెరిఁగించాడు.

(శివనందీశ్వర సంవాదము - శివతత్త్వసారము - 91 పుట)

## కౌండిల్యుని వంశక్రమము :

పూర్వమొకప్పుడు పరమేశ్వరుడు కైలాసంలో ప్రమథ గణములతో గూడి తృప్తిగా సురాపానము చేసి సంతోషంగా నున్న సమయంలో పరమ భక్తాగ్ర గణ్యుడైన నందీశ్వరుడు శివునకు నమస్కరించి - "మహాదేవా! దివ్యపురుషుడైన కౌండిన్య వంశీయులగు దేవగౌడుల వంశక్రమాన్ని తెలుపు"మని ప్రార్థించాడు. దానికి సంతసించిన పరమశివుడు - "వత్సా! కౌండిన్య కుమారుడై దేవగౌడుడని ప్రఖ్యాతి గాంచిన కౌండిల్యునకు - స్వర్ణరూపి యందు నారాయణగౌడను వాడు జన్మించాడు. వానికి తన్వియనే భార్యయందు - "ఉద్దాలక" యనువాడును, అతనికి తేజ ప్రభయను నామె యందు - "శౌణకర్ణి" యనువాడును, అతనికి శ్రౌత ధవ్యుడును, ఇతనికి గౌరవగ్రీవుడును, ఇతనికి వాగై రజితుడనువాడును, యీ వాగై రజితునకు

తాటి ఈత చెట్లు / తండోప తండాలు; గీయవచ్చు చెట్లు / వాయుడిపుడు గీసినట్టి చెట్లు / గీత కార్మికునివే ; తెలిసికొనుడు మీరు / తెలివి గలిగి

ఆహుతియనే కన్యయందు అరణ్యుడనువాడును, యితనికి వామరథ్యుడును, యితనికి గోపనాభ్యుడనువాడును, ఈ గోపనాభ్యునకు కళ్యాణి యనే ధర్మపత్ని యందు పరమధర్మస్వరూపుడు, సత్యసంధుడైన గోపాలుడను వాడు జన్మించాడు. ఇతడే గోపాల గౌడుడను ప్రసిద్ధ నామంతో విలసిల్లి విదేహ కోసల, కాశీరాజ్యాలను పాలించాడు. వీరు భూలోకంలో గౌడ వంశానికి చెందిన గోత్రకారులయ్యారని పరమేశ్వరుడు నందీశ్వరునకు చెప్పాడు.

## కౌండిన్యాశ్రమ స్థల నిరూపణ :

"కదిరి" అనంతపురం జిల్లాలోని కదిరి తాలూకాకు తాలూకా ముఖ్యపట్టణం. ఇది పాకాల-ధర్మవరం రైల్వే లైనులో వుంది. ఇక్కడ ప్రాచీన శ్రీనరసింహస్వామి వారి దేవాలయం వుంది.

ఈ స్టేషనుకు సమీపంలో "ముక్తాపుర' మనే గ్రామముంది. ఇక్కడకు ఒకటిన్నర మైళ్ళదూరంలో నున్నదే మన "కౌండిన్యాశ్రమం". ఈ ఆశ్రమపు పూర్వచరిత్ర తెలిసికోవడానికి ఆధారాలు లభింపలేదు. కాని ఆ ఆశ్రమందలి ఆలయ ప్రాకారమున శిథిలావస్థలో నున్న శిలాశాసనం వలన కొంత విషయం గ్రహింపవచ్చును.

శాసనము : త్రేతాయాం ప్రథమ పాదే, దేవగౌడస్య నామః క్రమ ప్రాప్తానాం, కనిష్ఠానాం కాటమ గౌడశ్యాః, మహిశూర ప్రాంతానాం "ముక్తాపుర గ్రామ నామస్య" ప్రదేశయాం, కౌండిన్యా శ్రమాయాం స్థాపయిత్వా భవతి, శివలింగ ప్రతిష్ఠానాం, సహస్ర శతత్రయః శిష్యోభవతి, శ్రీ నిజ సద్గురుభ్యోన్నమః । నిత్యం పూజానాం వదతిః । మహాభాగో లభతే శాశ్వత కైవల్యాంగశ్చతిః ।

అని వుంది. ఇంకా అక్షరాలు స్పష్టంగా కనిపించని అనేక శిలాఫలకాలున్నాయి. వాటినన్నింటిని సూక్ష్మదర్శినితో గాని, ఫొటోగ్రాఫీ సహాయంతో గాని కనిపెట్టి సేకరిస్తే యింకా యెన్నో అమూల్య ఐతిహాసిక విషయాలు లభిస్తాయి. అట్టి శాసనాలు గల శిలాఫలకాల నన్నింటిని భారత పురాతత్త్వ శాఖ వారు

---

చెట్లు మనకు దఖలు / చేయకుండగజేయు ; రైతులెవరైన / ఘూత తలుప
వెంటనుండి వారి / బంటులకనుగొని ; చెట్లు నరకకుండ / చేయవలయు //

Scanned by CamScanner

Historical Monuments క్రింద సేకరించి యేదైనా వస్తు ప్రదర్శన శాలలో భద్రపరిపించడానికి మన జాతిలోని ఉన్నతాధికారులు పూనికొని కృషి చేసి అట్టి అమూల్య సంపదను భద్రపరుచుటకు తోడ్పడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

పై శాసనాన్ని బట్టి కౌండిన్య వంశోద్భవులైన దేవగౌడులలోని అనేక మంది మహానుభావులు వారి వారి వంశాను క్రమంగా త్రేతాయుగంలో వుద్భవించారని, వారెల్లరు గొప్ప తపః ప్రభావ సంపన్నులని ఈశ్వర సాక్షాత్కారం పొందారని, వారిలోని కడపటి వాడు కాలమగౌడని తెలుస్తుంది. ఈ కాలమగౌడు మహాభారత యుద్ధానంతరం వరకు వున్నాడని, శివపూజా దురంధరుడైన యీ మహనీయుడు తన వంశచరిత్రను, తన వంశానికి మూలపురుషుడైన కౌండిన్యుని స్మారక చిహ్నాన్ని ఆచంద్రతార్కం నిలిచేలా భూలోకంలో స్థాపించాలని సంకల్పించి స్వయంగా తన తపోబలంతో కైలాసానికి వెళ్ళి శివానుగ్రహంచేత ఒక శివలింగాన్ని తెచ్చి ముక్తాపుర గ్రామంలో పదునెనిమిది ప్రాకారాలు గల ఒక బ్రహ్మాండమైన శివాలయాన్ని నిర్మించి అందీ శివలింగాన్ని ప్రతిష్ఠించి ఆ ప్రదేశానికి "కౌండిన్యాశ్రమ"మని నామకరణం చేశాడు. ఈ కాలమ మహేశ్వరుడు తనకు గల మూడు వేల మంది శిష్యులతో కలిసి ఆ కైలాసపతిని నిత్యాభిషేకములతో ధూప-దీప-నైవేద్యాదులతో సేవిస్తూ దివారాత్ర విభాగం లేక భజనాది కార్యక్రములతో తన యిష్టదైవమైన శివుణ్ణి పూజిస్తూ భూలోక కైలాసమో అన్నట్లు ప్రతిదినము భక్తులకు అఖండ ప్రసాద వితరణతో బాటు శివపురాణము, శివలీలా మాహాత్మ్యము, శివగీతములు, శివతత్త్వసారము మొదలైన గ్రంథాల్ని చదివి వినిపిస్తూ అంత్యమందు యీ పాంచభౌతిక దేహం పతనమైన పిదప శాశ్వత కైవల్యాన్ని పొందుట వలన ఆయన కాలమ మహేశ్వరుడనే ప్రసిద్ధ నామంతో విరాజిల్లెనని నందీశ్వరకృతమైన శివపురాణంలో వ్రాయబడింది. ఈ శివాలయంలో గౌడులే అర్చకులుగా వుండి శివారాధన చేస్తూ అత్యంత శ్రద్ధాసక్తులతో శివుని సేవించి కడపట శివసాయుద్యాన్ని పొందారని పై

పడెడు బాధ మనది / ఫలిత మింకొకరిది; మధ్యవారలుండ / మనకు ముప్పు
మధ్య వారిదరిమి / మనముండగావలె ; కలిత సుగుణులార / గౌడులార ॥

పురాణంలో వివరింపబడింది. గనుక అప్పటినుండి గౌడులెల్లరు శైవ మతస్తులనియు, గాణాపత్యులు (గణపతిని పూజించువారు), శాక్తేయులు శక్తిని (పార్వతిని) పూజించువారు శివపూజాగ్రగణ్యులని తెలియుచున్నది.

శివుడు తన ప్రమథ గణాధిపతులైన నందీశ్వర, భృంగీశ్వర, చండీశ్వర, అశ్వముఖాదులతో గూడి సురాపానము చేసి పరమానంద భరితుడైనట్లు శివపురాణాంతర్గత శివలీలా మాహాత్మ్యము, శివరాత్రీ మాహాత్మ్యము, శివతత్త్వ సారమనే గ్రంథాల్లో వర్ణింపబడింది. సురలందరు సురాపానం చేసినట్లు భృంగీశ్వరస్తవమనే గ్రంథంలో వుంది. శివగీతములతో బాటు గౌడ గీతములు, గౌడగేయములు పాడబడు చుండెడివని తెలియుచున్నది.

నన్నెచోడుడను మహాకవి తన "కుమార సంభవ" మనే గ్రంథంలో శివునిపై అలిగిన పార్వతి తపస్సు చేయుటకు అడవికి పోయినప్పుడు అక్కడున్న యెరుకల స్త్రీలు –

"జీలిక కల్లు ద్రావి మద సింధుర గామిను లన్ని కేరియల్
వాఱుచు గౌడ గీతములు పాడుచు బొల్పుగ గ్రాలియాడుచున్ I అని వర్ణించాడు. ఇటువంటి గౌడగీత శతకము లనేకములున్నట్లు, యీ గౌడ గీతములతో గౌడులు గౌరీ శంకరులను స్తుతిస్తూ పరమానంద భరితులై సుఖంగా తమ జీవిత ధర్మాన్ని నిర్వహించే వారని" ఆదిగౌడ దీపిక" అనే గ్రంథంలో వ్రాయబడింది.

## గౌడగీతములు – దశావతారముల పాట

వంగదేశమందలి వీరభూమి పరగణాలోని గౌడ పురమందు గల యజయ నదీతీరమందలి గెంగూలీ గ్రామంలో సుప్రసిద్ధ గీత గోవింద రచయిత "జయదేవ" మహాకవి జన్మించాడు. ఇతడు కృష్ణ చైతన్య మతస్థుడు. ఇతడు గౌడదేశవాసి గనుక సంస్కృతంలో అష్టపదులను వ్రాస్తూ మొట్టమొదటగా, దశావతారములను వర్ణిస్తూ, ఒక గేయం వ్రాశాడు. అందులో

---

పురుగు పట్టి చెట్లు / పోవుచున్నను గాని; పంట శాఖ వారు / పట్టుకొనరు
అట్టి చెట్ల సంఖ్య / అందీయగా రండు; గళిత గర్వులార / గౌడులార ॥

గౌడులు శివపూజా దురంధరులని వ్రాశాడు. దానికనువాదమే యీపాట, కడపలో న్యాయవాదిగా వుండిన కీ॥శే॥ శ్రీ వావిలికొలను రామానుజరావు గారీపాట యొక్క ప్రతినొక దానిని వ్రాసికొని యిది మైసూరు రాష్ట్రంలో ఒక గౌడుని వద్ద తీసికున్నానని వ్రాసుకున్నాడు. ఆపాట యథాతథంగా యీ క్రింది విధంగా వుంది. జయదేవుని సంస్కృత శ్లోకములు చదువలేని పామరుల కొరకిది గౌడులచే అనువదింపబడినది.

కదిరిలో నున్న నర్సింహదేవునకు పాల్గుణ మాసంలోని శుక్లపక్షంలో బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఈ దేవుని పట్ట మహిషి లక్ష్మీదేవి, మరియొక భార్యపేరు "చిన్నాదేవి" ఈ కదిరి నర్సింహునకు గౌడుల మూల పురుషుడైన కాటమ రాయునకు (కాటమ మహేశ్వరుడు) ఈ బ్రహ్మోత్సవాల్లో యీ గౌడ గీతంతో స్వామి వార్ని సేవించే వాడుక ప్రాచీన కాలం నుండి వస్తుంది. అందువల్లనే పాట పల్లవి యందు కాటమ్మ రాయుడా, కదిరి నరసింహుడా యని సంబోధింపబడింది.

## దశావతారముల పాట

బెత్రాయి సామి దేవుడా నా యేల్చినోడా - బెత్రాయి సామి దేవుడా
కాటమ్మ రాయుడా! - కదరి నరసింహుడా !
నీకైన పేరుగాడ - నిన్నే నమ్మితి నోర - బెత్రాయి సామి ·దేవుడా

(1) చేప కడుపున చేరి పుట్టెగా - రాకాసి గాని
కోపముగా చేసి కొట్టెగా - ఓపినన్ని నీళ్ళలోన
వలచీ వేగామె తిరగి - బాపనోళ్ళ చదువులెల్ల
బమ్మదేవర కిచ్చినోడా - -బెత్రాయి సామిదేవుడా

(2) తాబేలై తాను పుట్టగా - ఆనీళ్ళ కాడ
దేవాసురలెల్ల గూడగా - దోవసూచి కొండకింద

---

చెట్లు నాశమైన / చెడును వ్యాపారంబు / పెంచవలయు వాని / పేర్మితోడ
పురుగుమందు చల్ల / పురిగొల్పి ప్రభు తాను ; సాకవలయు చెట్లు / చావకుండ ॥

దూరగానె సిలికినపుడు-చావులేని మందు లెన్న
దేవర్ల కిచ్చినోడ ... ... -బైట్రాయి సామి దేవుడా
(3) అందగాడ వవుదు లేవయా-గోపాల గోవింద
రచ్చించరావయా - పందిలోన సేరికోర
పంటి తోన నెత్తి భూమి - కిందు మీదు సేసినట్టి
సందమామ నీవె గాద... ... - బైట్రాయి సామి దేవుడా
(4) నారసింహ - నిన్నె నమ్మితి నానాటికైన
కోరినీ పాదమే గతి
(5) ఓరి నీవు కంబాన - చేరి ప్రహలాదు గాచి
కోర మీసాల శత్రు - గుండె దొర్ల సేసినోడ
- బైట్రాయి సామి దేవుడా
(6) బుడుత బాపనయ్య వైతివి - ఆ చక్రవర్తి
నడిగి భూమి నేలుకొంటివి
నిడుపు కాళ్ళోడవై - అడుగువాని నెత్తి బెట్టి
తడవులేక లోకమెల్ల
పాడవుతోడ-తొక్కినోడ... - బైట్రాయి సామి దేవుడా
(7) రెండు పదులు ఒక్క మారుతో
ఆదొర్ల నెల్ల సెండాడి తౌర పరసుతో
చండకోల బట్టి కో- దండరామసామిగాడ
బెండుకోలసేసికొని-కొండకప్పుడేగినోడ -బైట్రాయి సామి దేవుడా
(8) రామ దేవ రచ్చించుమా - సీతమ్మ తల్లి
శ్యామ సుందరి నన్ను మెచ్చగా
సామి తండ్రి మాట గాచి - ప్రేమ భక్తుల నాదరించి
ఆమీదాలక నెల్ల-దోదుగాను చేసినోడ - బైట్రాయి సామిదేవుడా
(9) దేవకీ దేవి కొడుకుగా - యీ జగము నెల్ల
దేవుడై నిలిచి నావురా

---

*కన్న బిడ్డవోలె / కరుణించి పెంచిన ; ఫలితమిచ్చువాని / బలము వలన*
*ఆదియెమనకు జీవ / నాధారమైయుండు ; భవ్యులార గౌడ / వంశ్యులార //*

ఆవులా మేపుకొని - ఆడోళ్ళ గూడుకొని
తావులాగ జేసికొని-తక్కిడిబిక్కిడి చేసినోడ
-బైరాయి సామి దేవుడా

వేదాలు నమ్మరాదని - ఆ శాస్త్రాల
వాదాలు బాగలేదని - బోదాల చేసికొని
బుద్దాలు సెప్పుకొని - నాదా వినోదుడైన
నల్లనయ్య నీవెకావ.... - బైరయి సామి దేవుడా

(10) కలికీ నాదారవు నీవెగా - నా తోడ దయతో
పలికీ నీ బాల శిశువుడా - చిల్లగౌడ పురములోన
చిన్న గోపాలు డౌర - పిల్ల గోవి చేత బట్టి
పేట పేట తిరిగినోడ - బైరాయి సామి దేవుడా నన్నేలినోడ ॥

ఈ గీతమందలి పల్లవిలోని "బైరాయి" కదిరికి మారుపేరో లేక బల్లకట్టుకు మారుపేరో, లేక మరియొక యూరిపేరో తెలియరాకున్నది.

## గౌడదేశముదాని స్వరూప స్థల నిరూపణ శాసనములు

ఋగ్వేదమున ఐతరేయారణ్యకంలో భారదేశంలో వంగదేశము, పుండ్రసుమహా తామ్రలిప్తి, దేశములున్నవని వ్రాయబడింది. స్టైయిన్సు Steins అనునతడు వ్రాసిన రాజతరంగిణి 1-163లో బంగళా భాగంలో పంచగౌడ దేశములు చెప్పబడ్డాయి. అవి (1) పుండ్ర వర్ధనము (2) రాడ దేశము (3) మగధ దేశము (4) తిరభుక్త దేశము (5) వరేంద్ర లేక బరేంద్ర దేశము. పుండ్ర దేశపు తూర్పు భాగానికి నివృత్తి దేశమనే మరొక పేరుంది. త్రికాండ శేషమనే గ్రంథంలో గౌడ పురమునకు నివృత్తియని చెప్పబడినది. ఇప్పుడది గౌర్ అనబడుచున్నది. వంగదేశపు తూర్పుభాగానికి హరి కేళమనే పేరుండేదని హేమచంద్రుడు వ్రాసిన అభిదాన చింతామణి యనే గ్రంథంలో వుంది.

అది వరకు పుండ్ర వర్ధన దేశమని చెప్పబడుచు గౌడుల రాజ్యపాలనకు

---

అగ్రజాతివారు / అణగద్రొక్కి మనల ; హెచ్చుపాట పాడి / పెచ్చుపెరిగి
కదల మెదలకుండ / కట్టి వేసె మనల; కలిత సుగుణులా / గౌడులార ॥

లోబడియుండిన వంగదేశము క్రీ.పూ. 648 లో స్వతంత్ర రాజ్యమైనట్లు తేల్తుంది. ఈ దేశమున చెప్పబడిన అజయ అనే నది యిప్పటి కట్వా పట్టణం దగ్గర గంగానదిలో కలుస్తుంది. దీన్ని గురించిన ప్రశంస "గాలవ తంత్రం"లో వుంది.

**థియో పారాశి శిలా శాసనము :** ఎపిగ్రాఫికా ఇండికా 1,3 నందు వివరింపబడిన దాని ననుసరించి, గౌడేశ్వరుడైన సామంత సేనుని కుమారుడు హేమంత సేనుడని, అతని కుమారుడు విజయసేనుడని, యితని కుమారుడు బల్లాలసేనుడని, యితని కుమారుడు లక్ష్మణ సేనుడని, ఈ లక్ష్మణ సేనుని మనుమడు రెండవ లక్ష్మణ సేనుడని యితనికి అశోకుడనే నామాంతర ముండేదని రాజపరంపరలో చెప్పబడింది.

అధిశూర నృపాలుని కాలంలో కర్ణ సువర్ణపురము గౌడులకు రాజధానియని చెప్పబడింది. అది రాను రాను కాన్సోరాయై యిప్పుడు "రంగమతి" యని పిలువబడుతుంది. ఇప్పటి ముర్షాదా బాదు జిల్లాలో బరంపురానికి ఆరుమైళ్ళ దూరంలో వుంది. ఈ పురాన్ని గూర్చిన వివరణ "కుబ్జికా తంత్రం" 7వ అధ్యాయంలో వుంది. ఈ అధిశూరుడే క్రీ.పూ. 732లో వంగదేశాన్ని జయించి గౌడపుర సింహాసన మెక్కెనని మరొక చోట వ్రాయబడింది. ఈ రాజుకు సంతతిలేక తన మిత్రుడైన కమాజి రాజైన వీరసింహగౌడు నర్థించి అచటనుండి ఐదుగురు మంత్రవేత్తలైన విద్వాంసులను రావించి వారి చేత పుత్రకామేష్టి యాగం జరిపించి తత్ప్రభావం వలన ఒక కుమారుని పొంది, అ కుమార జనన శుభసమయంలో వారికైదు గ్రామములు అగ్రహారాలుగా యిచ్చెనట! ఈ విషయం గౌడపుర దుర్గమందలి ఒక శిలాశాసనంలో వ్రాయబడింది.

తిరిగి క్రీ.పూ. 1072లో హేమంత సేనుని కుమారుడు విజయసేనుడు అధిశూరుని. వాని సంతతిని సంహరించి గౌడపుర సింహాసనాన్నధిష్ఠించాడు. ఇతని తరువాత యితని పెద్ద కుమారుడు, తరువాత క్రీ.పూ. 1119లో

---

*జోతియనగ నదియె / చూపించు వెలుగును / వెలుగునందె మీరు / పెరుగవలయు*
*చిన్న పెద్దలంత / చీకట్లు వెకలించి; కలిత విభవులార / గౌడులార //*

రెండవ వాడైన బల్లాల సేనుడు రాజ్యాధిపతులయ్యారు. ఈ బల్లాలసేనుడే గౌడ పుర సింహాసన మెక్కిన వారిలో కడు ప్రసిద్ధుడు. ఈతని పట్టణం లోనున్న విరోధియైన ఒక మహంతి కుట్రపన్ని మాయాయుద్ధం కల్పించి యెన్నెన్నో ప్రవాదాల్ని కల్పింపగా అవి సహింపలేక అభిమాన ధనులైన ఆ గౌడేశ్వరుని కుటుంబము అగ్నికాహుతి అయ్యెనట! యుద్ధంలో ఘనవిజయం సాధించిన స్వార్థపరుడైన ఒకని కుతంత్రం మూలంగా తన కుటుంబాన్ని కోల్పోయిన బల్లాల సేనుడా గౌడపురాన్ని విడిచి విక్రమపురమనే మరొకరాజధానిని నిర్మించుకొని దానిలో నివశించాడు. అది రాను రాను బల్లాలబాదిగా మారింది. ఇప్పుడా పట్టణం ఢక్కా జిల్లాలోని మున్షిగంజి పట్టణానికి పశ్చిమంగా నాలుగుమైళ్ల దూరంలో "విక్రమ్‌పూర్" అని పిలువ బడుచున్నది.

జనరల్ కన్నింగ్హామ్ అనే పండితుడు - పూర్వం అధిశూరుని రాజధాని రామపాల పురమని అతడే యీ గౌడ పురానికి రాజధానిని మార్చెనని వ్రాశాడు.

ఈ గౌడ పురము కలకత్తా నుండి 194 మైళ్ళ దూరంలో వుంది. ఇప్పుడది పాడుపడి పల్లెటూరుగా మారిపోయింది. ఉత్తర బంగాళమున నున్న మాల్డాపట్టణం నుండి తూర్పుగా 14 మైళ్ళు వెళితే అక్కడ నున్న ఇంగ్లీషు బజారనే చోటు నుండి రెండు మార్గాలున్నాయి. ఆ రెండు పియాజ బారి మీదుగా పోవును. ఇది 900 సంవత్సరాలు హిందువులైన గౌడుల కాలం లోను, మహమ్మదీయుల కాలంలో కూడా ప్రధాన ప్రభుత్వ స్థానపు దశ ననుభవించింది. క్రీ.పూ. ఎనిమిదవ శతాబ్దంలో పాలవంశపు రాజైన ధర్మపాల గౌడు మహారాజు 12వ శతాబ్దం మధ్య కాలంలో దీనిని తన రాజధానిగా చేసికొన్నాడు. ఇప్పుడీ స్థలం "బల్లాల్ బారి" అనే దిబ్బలక్రింద పిలువబడుతుంది.

1345లో షంషుద్దీన్ లియాస్ షా అనునతడు గౌడ దేశాన్నాక్రమించి,

---

దీపముండగానె / దిద్దుకోవలయును ; గమ్యమేదొమనకు / గాంచరండు
కష్టపడిన యంత / కడతేరు శ్రమయంత ; గళిత గర్వులార / గౌడులార ॥

'పాండువా" అనే స్థానానికి రాజధానిని మార్చి దానికి "ఫిరోజా బాద"ని పేరు పెట్టాడు. అప్పటి నుంచి 1445 వరకు యిది బంగాళమునకు రాజధానియై యుండెనట. 1446లో తిరిగి గౌడ పురానికే ప్రభుత్వ కార్యాలయాలు మార్చబడి 1550 వరకు రాజధాని గౌరవాన్ని పొందింది.

**గౌడియామిషన్–నవద్వీపధామం–చైతన్య మహాప్రభువు :** ఈ నవద్వీపములలో అంతర్ద్వీపము ప్రధానమైనది. దానినే మాయాపూర్ అంటారు. ఇచ్చటనే శ్రీ చైతన్య మహాప్రభువు క్రీ॥ శ॥ 1489లో ఫిబ్రవరి 18వతేదీ సాయంత్రం జన్మించాడు. ఇది చైతన్య మతస్థులకు గొప్ప యాత్రాస్థలము. వీరు చైతన్యుని శ్రీకృష్ణుని అవతారమంటారు. వీరంతా కృష్ణ భక్తులు. ఈ మతాన్ని కృష్ణ చైతన్య మత మంటారు.

వంగదేశాన్ని పాలించిన సేన వంశపు రాజులలో చివరివాడైన లక్ష్మణ సేనునికిది రాజధానిగా నుండెడిదని 1880 ఇంపీరియల్ గజిటీర్ నందు సర్ విలియం హంటర్ అనునతడు ఈ మాయాపూర్‌ను 1063లో గౌడేశ్వరుడైన లక్ష్మణ సేనుడు నిర్మించి తన రాజధానినిగా చేసి కొన్నాడని మహమ్మదీయ దండయాత్ర యందతడు పరారియై మరణించెనని వ్రాశాడు. ఇంతవరకే ఘట్టము పైన వివరించిన దియో పారాశీ శిలాశాసనానికి సరిపోవుచున్నది. ఇక్కడ నున్న ఒక మైలు పొడవు అరమైలు వెడల్పు గల ఒక పెద్ద సరస్సున కీయన తండ్రి పేరు బల్లాల సేనుని పేరుండెనట. పాడైన లక్ష్మణ సేనుని దుర్గం యిప్పటికి వుంది. గౌడులే యీ, చైతన్య మతానికి ప్రధాన పోషకులు గా వుండుటం బట్టి దీనికి గౌడియా మిషన్ అనియు, చైతన్యునకు గౌరాంగుడనే పేరు వచ్చిందని చెప్తారు.

ఇటీవల ఠాకూర్ బృందా బందా యనే ఒక చైతన్య భక్తుడు చైతన్య దేవుని జీవిత చరిత్ర "చైతన్య భాగవత" మనే పేరున వ్రాశాడు. అందులో వారి కాలమున వంగదేశాన్ని గౌడులు పాలించే వారని తదుపరి అది షుశేన్‌షా అనే పేరుగల నవాబు వశమైనదని, అతడు మౌలానా సిరాజుద్దీన్

---

*గౌడ మాత మనకు / గౌరవంబొన గూర్చు ; కష్ట సుఖములన్ని గాంచు చుండు*
*తెలుపు చుండు డెపుడు / తెలియని విషయాలు; గౌడులార కీర్తి / కలితులార ॥*

సాహెబు పౌజు దారుగా నవద్వీపమున అధికారిగా నుండెనని ఆయనకే చంద్ కాజీ యనే వాడుక నామముండేదని - ఇతడు చైతన్య ప్రభువుకు శిష్యుడయ్యాడని నేటికిని అతని గోరీ గౌడియా మిషన్ వారి ఆధీనమందున్నదని చెప్తారు.

## బోధాయన సూత్రం 64లో వివరింపబడిన గౌడ దేశపు హద్దులు

అయోధ్య కుత్తర దిశయందును సరయూనదికి (సరస్వతి)కి ఉత్తరమున సర్వార్ కొండలకు మధ్యగల దేశమునకు గౌడ దేశమని పేరు ఈ దేశమునకు తూర్పున గంగానది, పశ్చిమమున యమునానది, దక్షిణమున సరస్వతీ నది యుండుట వలన త్రివేణీ సంగమ మగుట వలన నీక్షేత్రానికి ప్రయాగ అనే పేరు వచ్చిందని దీనికే శ్రావస్తీ పురమనే పేరుందనియు, ఉత్తరాన హిమాలయాలు హద్దులుగా గలిగిన ప్రదేశము "గౌడ" దేశమని బోధాయనులు వివరించియున్నారు.

## మత్స్య పురాణంలో (12 శ్లో॥ 30 పుట) శ్రావస్తీ నగర వర్ణన

శ్లో॥ శావస్థస్య మహాతేజ వత్సకస్తత్సుతోఽభవత్ ।
నిర్మితా యేన శ్రావస్తీ గౌడదేశే ద్విజోత్తమా ।

## స్కాంద పురాణంలో గౌడ దేశ వర్ణన

శ్లో॥ వంగదేశం సమారభ్య భువనేశాంతగం శివే ।
గౌడ దేశః సమాఖ్యాతః సర్వ విద్యా విశారదః ।

వంగదేశము మొదలుకొని భువనేశ్వరము (ఒరిస్సా) వరకు గల దేశము గౌడ దేశమని, గౌడులు సర్వ విద్యా విశారదులని అర్థము.

## బృహత్ సంహిత - 14వ అధ్యాయం

బ్రాహ్మణ భేదేషు చ । స్వార్థేక తత్రార్థే । "అథపూర్వస్యామ్" ఇత్యుపక్రమే-ఉదయగిరి, భద్ర, గౌడక, పౌండ్రోత్కల, కాశి,మేఖలాంభష్ఠాః

---

గౌడ మాత నిపుడు / గారవంబున పెంప ; దీక్ష పూను డిక ను / ప్రేక్ష మాని
గౌడ మాత మీకు / కన్న తల్లి యనగ ; సాకలేర యామె / చక్కగాను ॥

గౌడులు బ్రాహ్మణ భేదముల యందును, స్వార్థకమైన "క" ప్రత్యయమచ్చుట (ఆదేశమున) అను అర్థం వలన "అథపూర్వస్యామ్" అను ప్రారంభమున ఉదయగిరి, భద్ర, గౌడక, పౌండ్ర, ఉత్కళ, కాశీ, మేఖ లాంభష్ఠల యందు గౌడులు గలరు.

హితోపదేశం

కూర్మ విభాగే విభాగే పూర్వస్థ దేశోకా ।
అస్తి గౌడ విషయే కౌశాంబీ నామ నగరీ ।

కూర్మ విభాగమున – ఒక భాగమందు తూర్పుగా నున్న గౌడదేశమందు కౌశాంబీ యనే నగరం వుంది.

ప్రబోధ చంద్రోదయం

"గౌడోరాష్ట్ర మనుత్తమం నిరుపమా తత్రాపి రాఢా పురీ "

గౌడ రాష్ట్రము అత్యుత్తమమైనది. అందులో రాఢా పురియనునది నిరూపమానమైనది.

ముహూర్త చింతామణి

సర్వసింహ గురుర్వర్జ్యః కళింగే గౌడ గుర్జరే ।

కళింగ దేశంలోను, గౌడదేశంలోను, గుర్జర దేశంలోను, "గురువు" సింహరాశి గతుడై యుండగా వివాహాది శుభకార్యాలు చేయకూడదు. ఎందుకనగా గురుడు సింహరాశి యందున్నప్పుడు గోదావరి నదికి పుష్కరాలు వస్తాయి. ఇవి పండ్రెండు సంవత్సరాల కొకసారి వస్తాయి.

దీన్ని బట్టి కళింగదేశానికి గర్జుర (గుజరాత్) దేశానికి మధ్య నున్న దేశము గౌడదేశమనియు, అది గోదావరి నదికి తూర్పున నున్న దని, ఆ గౌడ దేశవాసులీ గోదావరీ నదీ తీర వాసుల ఆచార వ్యవహారములకు, ధర్మాలకు నిబంధనము కలవారని తెలుస్తుంది.

---

కనికరంబు లేక – కఠినాత్ము లగుచును ; ఆదరంబు లేక । అండ లేక
అలమటించు నామె । యారాటమెఱుగరో; కలిత విభవులార । గౌడులార ॥

## హరహా శాసనంలోని వర్ణన

క్రీ. శ. 554లో ఈశ్వర వర్మన మౌఖరీ అనునతడు గౌడదేశాన్ని జయించాడని వ్రాయబడింది.

## "మాధాయీ" నగరపు తామ్రశాసనంలోని వర్ణన

గౌడ నరేశుడైన బల్లాల సేనుని కుమారుడు లక్ష్మణ సేనుడు కళింగ. దేశం వరకు తన రాజ్యాన్ని విస్తరింపజేశాడని, బెంగాలుకు రాజధాని కాలక్రమమున కాశీ, వరేంద్ర మరియు లక్ష్మణాపురికి మార్చారు. 13వ శతాబ్దంలో ముసల్మానులు బెంగాలుపై దండెత్తి దానిపై ఆధిపత్యం వహించిన తరువాత బెంగాలు ముఖ్యపట్టణము కొన్నాళ్ళు గౌడదేశమందును, కొన్నాళ్ళు దానికి 20 మైళ్ళ దూరంలో నున్న పాండువా అనే పట్టణంలోను వుంటూ వచ్చింది. ఇది మొదట వర్ణించిన "దియోపారాశి" శిలాశాసనంలో వ్రాసిన దానికి, గౌడియా మిషనుకు సరిపోతుంది. తెలంగాణములో చాల మందికి పాండు, పాండువా అనే పేర్లున్నాయి.

## మహాకవి బాణభట్టుడు వ్రాసిన విషయము

శ్రీ హర్ష చక్రవర్తి ఆస్థాన పండితుడై, హర్ష చరిత్ర, కాదంబరీ మహాకావ్యాలు వ్రాసిన మహాకవి బాణ భట్టుడు గౌడేశ్వరుడైన శశాంకుని గూర్చి వర్ణించాడు. ఈ శశాంకుడే హర్షవర్ధనుని జ్యేష్ఠ సోదరుడైన రాజ్యవర్ధనుని వధించాడు. ఈ విషయం శశాంకుని పాలనలో వ్రాశాను - చూడండి.

## పద్మపురాణం - 189-2లో గౌడ దేశవర్ణన

పద్మ పురాణంలో గౌడ దేశాన్ని పాలించిన మహారాజులలో నరసింహగౌడు డొకడని వ్రాయబడింది.

## పురాణ నామ చంద్రికలో - గౌడపురి

గౌడపురి - నా ॥ లక్ష్మణపతి - వంగదేశమందలి ఒక ముఖ్య పట్టణము. ఇచ్చట ముందు జహ్ను మహర్షి ఆశ్రమముండేదని చెప్తారు.

కులపు గ్రంథమగుట / కొనరెవ్వరితరులు ; సంఘజనులేదీని / సాకవలయు
ఆర్థికంబు లేక / అగచాట్లు పడుచుండ ; కనియు కనని యట్లు / గాంచరాదు ॥

ఇచ్చటి బ్రాహ్మణులు గౌడులనబడుదురు. వీరు అభిమన్యుని పుత్రుడైన పరీక్షిత్తు నరేంద్రుని కాలంలో కురు-కోసలదేశముల నుండి వచ్చిరి.

## మహాభారతంలోని విషయం

పంచ పాండవులు, అజ్ఞాతవాసం గడపడానికి విరాట్ రాజు కొలువులో మారు పేర్లతోను మారువేషాలతోను చేర్తారు.

విరాట్ రాజు - మహారాణి సుథేక్షణాదేవి - ఆమె సోదరుడు కీచకుడు మొదలైన వారంతా గౌడులని వ్యాస భారతంలో వ్రాయబడింది.

ఈ విధంగా గౌడదేశపు పేరు అనేక సంస్కృత కావ్యాలలో కనిపిస్తుంది. ఈ గౌడ దేశపు ఉత్కృష్టకాలమందచ్చటి జనులందరు సర్వ విద్యా విశారదులై సంస్కృత విద్యకు కేంద్రంగా భాసిల్లిన విఖ్యాత దేశమది. ఇది సస్య శ్యామలమై, ధనధాన్య సమృద్ధి తోను, పాడిపంటలతోను తులతూగుచు కవులకు, కళాకారులకు పుట్టినిల్లయి ధర్మనిలయంగా ప్రసిద్ధి చెంది ప్రాచీన లక్ష్మణావతి (లక్ష్మణసేనుడు కట్టిన విక్రమపురం) లేక నేటి లఖనౌతి నగరము మరియు మహాకవి జయదేవుడు, కవిరాజ్ గోవర్ధనాచార్యుడు, వ్యాకరణా చార్యుడైన ఉమాపతి ధర్, శబ్దకోశ్ కర్త యైన హలాయుధుడు మున్నగు మహామహులైన సుప్రసిద్ధ విద్వాంసులకు జన్మస్థానమై వారితో సంబంధ బాంధవ్యములున్న ప్రసిద్ధ నగరమది. ఆమధ్య యుగంలోని భవ్యనగరపు శిధిలాలు బెంగాలుకు మాల్డా పట్టణానికి పదిమైళ్ల దక్షిణంగా వున్నాయి. ఇందలి ధ్వంసావ శేషాల్లో ఆనాటి గౌడ రాజులు నిర్మించిన ప్రాచీన దేవాలయాలు, పఠనమందిరాలు, రాజప్రాసాదాలపై చెక్కబడిన శిల్పకళానైపుణి వర్ణనాతీతము.

## గౌడేశ్వరుడైన శశాంక మహారాజు

మౌర్య సామ్రాజ్యస్థాపకుడగు చంద్రగుప్తుడు నందరాజుల కొలువులోని మంగలస్త్రీయైన "ముర" యను దాసీకి పుట్టుట వలన ఆమె పేరుతోనే

---

*సభ్యులగుచు మీరు / శక్తి వంచన లేక ; కోరి నిలుపకున్న / కుంటుపడును*
*కుంటుపడిన నాడు / కూలును సంఘంబు ; గళిత గర్వులార / గౌడులార ॥*

మౌర్య వంశం పిలువబడిందని ఈతడు క్రీ.పూ. 321-298 లో మగధసింహాసనాన్ని అధిష్ఠించుటయే గాక సుప్రసిద్ధ క్షత్రియులతో సన్నిహిత బంధుత్వం కలిగియుండెనని, క్రీ.పూ.185లో ఆసామ్రాజ్యము విచ్ఛిన్నమై యంతరించిన కాలంలో అన్యదేశీయులైన యవన, శక, పల్లవ, పార్థివ, కుషాణ, యూచీ జాతుల వారు యీ దేశముపైకి క్రీ.పూ. 185-200 ప్రాంతంలో దండెత్తి వచ్చి యిచ్చటి ఆర్యులతో సంబంధ బాంధవ్యములను జరిగించి వారితో కలసిపోయి పురుషపురము (పెషావరు) క్రీ. శ. 78-123లో తమ రాజధానినిగా చేసికొని సింధు మైదాన ప్రాంతము, కాశ్మీర, పారశీకాది దేశాల నేలి నట్టి సుప్రసిద్ధ రాజ్యపాలకుడైనట్టి కుషాణ జాతీయుడైన కనిష్కుడు హర్షవర్ధనుని (క్రీ.శ. 606-647) తరువాత ఉత్తర హిందూ స్థానంలో రాజ్యాన్ని స్థాపించెననియు, హిందూ దేశంలో ప్రముఖములని పేర్కొనబడిన 56 దేశాల్లో ప్రాగ్దక్షిణ హిందూ స్థానమందు సామంత దేశములు గలది, శత్రురాజుల కజేయమైనది, సకల కళాపరిపూర్ణము, సంపత్సమేతంగా విరాజిల్లు చుండిన గౌడము (గౌళము) యనెడు, బలవత్తరమైన రాజ్యమొకటి వుండెడిదని అందులో నిమ్న జాతీయులధిక సంఖ్యాకులుగాను, అగ్రజాతుల వారల్పసంఖ్యలలో నుండెడివారని, ఆగౌడ దేశము జన్మ భూమిగా గలవారందరు గౌడులని మాత్ర దేశనామంతో పిలువబడు చుండెడివారని, ఆంధ్రదేశమందలి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమాది ప్రధాన జాతుల వలె గౌడ దేశంలో కూడా ఆదిమ వాసులలో ప్రధానంగా ఐదు తరగతులుండెడివని వారినే పంచగౌడులని పిలిచే వారని వ్రాయబడింది. కొన్ని ప్రాంతాల్లో గౌడులు, గౌణులు, గౌండరులనియు, మద్రాసు దాని పరిసరములనుండువారు నాడారులని పిలువబడుచుండిరి. కాలక్రమేణ గౌడదేశపు జనసంఖ్య అభివృద్ధి చెంది వారు జీవనోపాధికి యితర ప్రదేశముల కరిగిరనియు, యిప్పటి బీహారు (మిథిల దేశము) రాష్ట్రము, దాని దక్షిణమున నున్న ఒరిస్సా రాష్ట్రము అనగా వైతరణీ నదికి తూర్పు భాగమున వంగ రాష్ట్రము (బెంగాలు) సరిహద్దులు గల్గి పశ్చిమ భాగమున బ్రహ్మణీ నది సరిహద్దుగా

---

ఇంటికొక్క పుష్ప / మీఖన కాక మాల ; ఇంటికొక్క ప్రతిని / యీయుడంటి దాతలయిన వారు / ధనము మెండుగనిచ్చి ; సాకవలయు దీని / శ్రద్ధ గాను //

గలదియు, మహానదికి పశ్చిమోత్తర దిశల నంటియున్న నిమ్నోన్నత భూభాగముల మధ్య నున్న చతురస్త్ర సమతలమే గౌడ దేశమనియు, గోరక్షపురము, కాష్ఠ మందిరముల వద్ద నుండి తుహినాద్రి యందుద్భవించి బీహారు రాష్ట్రంలో ప్రవహించే (గన్‌డక్), కూసీ (కౌశిక ) ఉప నదులకు ప్రాక్పశ్చిమ దిశలను, గంగానదికి వాయువ్యోత్తర దిశలను, నేపాళమునకు దక్షిణాపథమున గల యెల్లలతో నలరారుచుండినదే గౌడదేశమని దాని హద్దులు నిశ్చయింపబడినవి.

ఈ మిథిలానగరాన్ని విదేహ రాజగు జనకుడు పాలించియుండెనని, యిప్పుడు యీశాన్య దేశములని వ్యవహరింపబడుచున్న ఒరిస్సా, వంగ, బీహారు రాష్ట్రములందలి సమధిక ప్రాక్సాగర తీర ప్రాంత ప్రదేశమంతా గౌడ పాలిత దేశములని తెలుస్తుంది. మొదట గౌడులు మిథిలాపుర వాసులగుట వలన నిఘంటుకారులు వారిని మైధులు అని కూడా చెప్పియున్నారు. అందువలన సాక్షాత్తు లక్ష్మీదేవియే సీతగా అవతరించిన ప్రదేశము గౌడులకు నివాసము గనుక అప్పటినుండి గౌడులకు ఈ లక్ష్మీదేవి ఆరాధ్యదేవతయైనది.

## పంచగౌడులకు ప్రమాణము :

ఉత్కళ దేశే – తద్దేశస్థే జనే – బ.బ.

ఉత్కళ దేశమునందును, ఆ దేశమందలి జనము నందును

శ్లో॥ సారస్వతా కన్యాకుబ్జా గౌడ మైథిల కోత్కలాః ।
పంచ గౌడా ఇతిఖ్యాతా వింధ్యాస్యోత్తర వాసినః ।
ఇత్యుక్త్యేషు విన్ద్యా పర్వతోత్తర భాగవాసిషు –

సారస్వతో పాసకులు (సారస్వతులు), కన్యాకుబ్జ (కనౌజా) దేశీయులు, గౌడదేశీయులు, మిథిలా దేశీయులు, ఉత్కళ (ఒరిస్సా) దేశీయులు యీ ఐదు దేశముల వారు పంచ గౌడులను విఖ్యాతి గాంచి యుండిరి వీరంతా వింధ్య పర్వతాని కుత్తర దేశవాసులుగా పరిగణింపబడిరి.

---

నాకు నష్టమైన / నగుబాటు మీకగు / సంఘ పాత్రము నిట్టు / సాక లేక
నష్టపెట్టిరంచు / నలుగురు పలుకంగ / తలను పంచుకొనక / తప్పదపుడు ॥

క్రీ.శ. 500-542 ప్రాంతంలో గౌడ దేశము మీదికి అనాగరికులు, క్రూరులు, నరహంతకులగు హూణులనే ఒక మొరటు తెగవారు దండెత్తి వచ్చారు. హిందూ మత రక్షణయే పరమావధిగా ఎంచిన గౌడ భూపాలురు వారిని చీల్చి చెండాడి సమూలంగా నాశనం చేశారు. గౌడుల ధర్మబద్ధమైన పరిపాలనలో కరవు కాటకాలంటే యేమిటో ఆనాటి ప్రజలకు తెలియవు. పాడిపంటలతో సకలైశ్వర్యములతో తులతూగుచున్నా కులవృత్తిని విడువకుండా సురాకరణ వృత్తితో బంగారు నాణెములను రాశులుగా సంపాదించి ఐశ్వర్యవంతులుగా నుండేవారు.

## శశాంకుని రాజ్య విస్తరణ

క్రీ.శ. 600 సం॥ ప్రాంతములో శౌర్యధనుడు, రణతంత్ర కోవిదుడు, సర్వ విద్యా విశారదుడు, రాజకీయ చతురుడు, మంత్రశక్తి పరుడైన "శశాంకు"డను గౌడేశ్వరుడు శత్రుభీకరుడై రాజ్యాన్ని పాలిస్తున్నాడు. ఆ కాలంలో వర్ధనులనే వైశ్య వంశజులు స్థానేశ్వరాన్ని రాజధానినిగా చేసికొని ఉత్తర హిందూదేశాన్ని పాలించేవారు. మౌఖరులనే మరొక క్షత్రియ తెగ కన్యాకుబ్జమును రాజధానినిగా చేసికొని మధ్య హిందూస్థానాన్ని పాలించేవారు. వర్ధనులకు మూలపురుషుడు "పుష్య భూపతి" మౌఖరులతో ఈశ్వరవర్మ, ఈశావర్మ, అనే వారు ప్రసిద్ధులు, గౌడేశ్వరుడైన శశాంకుడు ఇటు వర్ధన వంశీయులైన రాజ్యవర్ధన, హర్షవర్ధనులకు - అటు మౌఖర వంశీయులైన గ్రహ వర్మాదులకు సమకాలికుడు.

ఈ రాజ్య వర్ధన - హర్ష వర్ధను లిరువురు సోదరులు, వీరికి రాజ్యశ్రీ అనే తోబుట్టువు వుండేది. ఈమెను మౌఖరుల వత్తిడి వలన క్షత్రియ వంశజుడైన గ్రహవర్మకిచ్చి వివాహం చేశారు. క్రీ॥ శ॥ 606-612 మధ్య సమయంలో గౌడ భూపాలుడైన శశాంకుడు రాజ్యవిస్తరణ కాంక్షతో తన దేశ ప్రజలను, గూఢచారులను, మంత్రి, సామంత, మండలేశ్వర, చతురంగ బల దళాధ్యక్షులను సమావేశపరచి తన నిర్ణయం వారికి చెప్పగా వారంత యేకగ్రీవంగా

కొంత ధనము మీరు / కుల పాత్రమునకీయ / తరిగిపోదు కలిమి / దాని వలన వలయు మీకు తెగువ / బలవంత మనరాదు; కలిత విభవులార / గౌడులార ॥

దండయాత్రచేయడానికి అంగీకరించారు. శశాంకునికి మిత్రులైన "మాళవు"లనే మరొతెగ వారు కూడా సహకరిస్తామన్నారు. వీరి నందర్ని కలుపుకొని అసంఖ్యాక సేనావాహిని వెంటరాగా క్రీ.శ. 606 సం॥ శశాంకుడు మొట్టమొదట కన్యాకుబ్జాన్ని ముట్టడించాడు. అక్కడ ఘోర సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో శశాంకుడు - గ్రహవర్మను సంహరించి వాని పట్టమహిషియైన "రాజ్యశ్రీ"ని చెరపట్టాడు. ఈ విషయం తమ దేశపు గూఢచారుల వలన తెలిసికొన్న ఆమె సోదరుడైన రాజ్యవర్ధనుడు చతురంగ బలాలతో తన సోదరిని చెర విడిపించడానికి కన్యా కుబ్జం వచ్చి శశాంకునితో భయంకర యుద్ధం చేసి చివరకు అతనిచే చంపబడ్డాడు. ఇతడే గాక యీ యుద్ధంలో వర్ధనుల సైన్యం లోని ముఖ్యులైన సైన్యాధ్యక్షులంతా చంపబడ్డారు. ఈ వార్త తెలిసిన హర్షవర్ధనుడు రోషావేశపరుడై చతురంగ బలములు గల మహాసైన్యాల్ని కూర్చుకొని శశాంకునిపై పగదీర్చుకోవడానికి వచ్చి అతనితో తలపడ్డాడు. కాని అతన్ని యెదిరించే సాహసం హర్షునికి లేక ఆరుసంవత్సరాలు దివారాత్ర విభాగం లేకుండా యుద్ధం జరిపించాడు. తన భర్త మరణము, అన్న రాజ్యవర్ధునుని మరణము, చిన్నన్న హర్షవర్ధనుని దుస్థితి చూచి దుఃఖించి ప్రయోజనం లేదని ఉపాయంతో అపాయాన్నుండి తప్పించుకోవాలని యెంచిన చతురమతియైన రాజ్యశ్రీ తన వంటి మీద నున్న నగలనన్నింటిని తన అమూల్య రత్నాభరణాలను తాను బంధింపబడి యున్న కారాగృహాధికారికి ఆంతరంగికుడు, దురాశాపరుడైన "నాగంభొట్లు" యను నతన్ని మంచి చేసుకొని వాని కా నగల నిచ్చి తనను తప్పించుమని ప్రార్థించింది. అవి సంగ్రహించి నాగంభొట్లు కారాగృహాధికారివద్దకు వెళ్ళి -" యజమానీ! మన చెరసాలలో చిరకాలం నుండి పడివున్న ఆడకూతురి కీనాడు యిక్కడికి సమీపంలో నున్న దేవాలయాన్ని దర్శించి ఆదేవతకు నైవేద్యం చెల్లించి రావాలనే కోరిక కలిగిందని బ్రతిమాలుతుంది. గనుక ఆమె యందు దయచూపి దైవకార్యం నెరవేరేటట్లు చేయు"దని ప్రాధేయపడ్డాడు. పరమభక్తుడైన ఆకారాగృహాధికారి చక్రధరగౌడు - దైవకార్య మనడంతోనే,

---

*పూని మీరలంతా / పోషకులై యున్న; యేను గంత బలము / నిచ్చినట్లు*
*సంతసమున నేను / సాధింతు పనులన్ని ; కలిత సుగుణులార / గౌడులార ॥*

అదినెరవేర్చడం ధర్మమని తన ఆంతరంగికుడైన నాగంభొట్లనే కాపుండి దగ్గర వుండి దేవతాదర్శనం చేయించి తీసికొనిరమ్మని అనుమతించాడు. దొరికినదే సందు అనుకొని నాగంభొట్లు ఆమెను విడిపించి బయటకు పంపి, తానా ఆభరణాలను తీసికొని తత్కాల రాజకీయ కారాగృహాధ్యక్షుడు, సామంతరాజు, స్వార్థపరుడు, రాజద్రోహియైన హరి హర వర్మ అనువానికి బహూకరింపగా – ఆ అమూల్య ఆభరణాల్ని చూచిన దురాశాపరుడైన వాడు శత్రువును విడువకూడదనే ధర్మాన్ని కూడా మరచి వెంటనే రాజ్యశ్రీని విడుదల చేసి పారిపొమ్మని సలహా యిచ్చాడు.

అప్పుడామె నాగంభొట్లు సాయంతో తన వారున్న స్కందావారానికి వెళ్ళింది. అప్పుడా సమయంలో హర్ష వర్ధనుడు భావికార్యక్రమాన్ని గూర్చి తన మంత్రులతో గూడిపుతానీ సాగిస్తున్నాడు. రాజ్యశ్రీ తన అన్నకు ప్రణమిల్లి తాను విడుదలైవచ్చుటకు పన్నిన పన్నాగం చెప్పి తరువాత శశాంకుని చతురంగ బల రహస్యాల నన్నింటిని వివరించి చెప్పింది. ఆమె మాటలను విన్న హర్షవర్ధనుడు హతాశుడై ఆరు సంవత్సరాలు యేకథాటిగా యుద్ధం చేసినా కూడా శశాంకు నేమీ చేయలేక పోయినందుకు విచారించి, కనీసం తన సోదరియైనా దక్కిందని సంతసించి శత్రువు బలవంతుడై యుండగాయిక వానితో పోరి విజయం సాధించడం దుర్లభమని నిశ్చయించుకొని క్రీ. శ. 612 సం॥లో యుద్ధం విరమించి హతశేషులైన సైన్యాలను, తన సోదరిని తీసికొని తన దేశం వెళ్ళిపోయాడు. యుద్ధం దానంతట అదే పరిసమాప్తమైనందుకు శశాంకుడు సంతసించి రాజ్యశ్రీ కొరకు పట్టుదల చూపక వూరుకున్నాడు.

క్రీ. శ॥ 637లో శశాంకుడు తన మరణానికి ముందు బెంగాల్, బీహార్ ఒరిస్సాలోని గంజాము ప్రాంతము వరకు జయించి "సకలోత్తర పరమేశ్వరు" డయ్యాడు.

---

మూలధనము లేక । ముందుకు నడువదు । యెట్టి పాత్రమైన। యిలను నేడు ప్రోగు చేయవలయు । భూరి విరాళము ; గళిత గర్వులార । గౌడులార ॥

## శ్రీ శ్రీ శ్రీ గోపాల గౌడు మహారాజా వారు :

Early in the eighth Century (AD 730-40) a Chieftain-named Gopala, a Gowda was elected king of Bengal, which had been suffering from amarcly towards the close of his life he extended his power west wards over Magadha or South Bihar, and is said to have reigned 45 years. He suffered defeat at the hands of Vatsaraja the Gurjara king of Rajaputana.

*(Early History of India - Vincent A. Smith)*

గుప్తరాజులు, వర్ధనులైన పుష్యభూపతి, పాలవంశముల వారి పతనానంతరము, గౌడవంశీయుడైన శశాంకుడు కూడా మరణించిన పిదప, గోపనాఖ్యుడు (వీనికి రాజ్యపాలుడనే నామాంతరము గలదు) రాజయ్యేడు. ఇతని కుమారుడు, గోపాలగౌడు తండ్రి మరణానంతరము క్రీ.శ. 948లో గౌడ దేశ సింహాసనాన్నధిష్టించాడు. ఈతని తల్లి పేరు కళ్యాణి (ఈమెకు భాగ్యదేవి అనే పేరు కూడా వున్నది.) ఈమె రాష్ట్రకూట కన్య.

**ఖాలీపురమందలి తామ్రశాసనం :** దీనిని బౌద్ధ ఇతిహాసకారులైన తారానాథ్, ధర్మపాలు డను వారలు పరిశోధించి - యీ క్రింది విధంగా వ్రాశారు.

"ప్రాచీనకాలంలో రాజ వంశాలన్నీ అసహనము,పరస్పర విద్వేషాలతో దండయాత్రలు సాగించి ఘోరయుద్ధాలు చేసి పతనమవగా యెక్కడ చూచినా అరాజకత్వం హింసాకాండ ప్రబలిన తరుణంలో ప్రజలు తమకు తామై సత్యధర్మపరాయణుడు, సాహసియైన గోపాలగౌడును తమ ఏలికగా యెన్నుకొని యీ అరాచకాన్ని అంతమొందింపుమని ప్రార్థించారు. దాని కాయన అంగీకరించాడు. అప్పటినుండి యీయన రాజై తన బుద్ధి కుశలత, బాహుబలము, ధైర్య సాహసములు, అకుంఠిత సేవాతత్పరతలతో, సుగుణ సత్కార్యాలతో ప్రజామన్నన లంది, వారందరకు ఆరాధ్యుడై మహోన్నత

పెరుగు ధరల తోడ / నెరవేర్చ లేనింక ; సాయపడిన గాని / సాధ్యపడదు
పాత్రమాగకుండ / ప్రతివారు నిధి పంపి ; పాలు పంచుకొనుడు / బాధ్యతనుచు ॥

స్థాన మాక్రమించుకొని మహారాజాధిరాజై ప్రజానురంజకంగా రాజ్యపాలన చేశాడు".

సంధ్యాకర్ నంది అనుపండితుడు వ్రాసిన "రామపాల చరిత్ర"లో గోపాల గౌడు మహారాజు తాను ఉత్తర వంగదేశీయుడని ఒక మూలశాసనంలో వ్రాసుకున్నాడని, యితడు దక్షిణపూర్వ బంగాళములను ఏకచ్ఛత్రాదిపత్యము క్రిందకు తెచ్చి ఏలుబడి చేయుచు "గౌడాధిపతి" అనిపించుకున్నాడని, ఈయన రాజ్యము మగధ వరకు వ్యాపించి వుండేదని, ఈయన రాజనీతితో విదేహ, కోసల, కాశీరాజ్యములను పాలించి మహారాజ బిరుదాన్ని పొందాడని, యితడు కోసలేశ్వర మహారాజగు పరిపతి మహారాజు కుమార్తె యైన "వీర మాంబను" పరిణయమాడెనని యితడు నిత్య శివపూజా దురంధరుడని, శివలింగాభిషేకం చేసి ప్రసాదము స్వీకరింపకుండా యేమీ తినేవాడుకాదని వ్రాశాడు. ఈ విషయమే ఆదిగౌడ దీపికలో కూడా వ్రాయబడింది. ఈయన భార్య వీరమాంబ కూడా పరమశివ భక్తురాలై పార్వతీ పరమేశ్వరుల నారాధించుచు, యెన్నెన్నో వ్రతోప వాసములు,నోములు నోచి దాన ధర్మాలు విరివిగా చేస్తూ గొప్ప సాధ్వీమణిగా పేరొందింది. కొంతకాలానికి పురాణ దంపతులకు ఈశ్వర వరప్రసాదం వలన సకల సుగుణాఢ్యుడైన ఒక కుమారుడు జన్మించాడు.. ఇతనికి ' కాటమగౌడు " అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు. ఇతడు బాల్యం నుండి భక్తులతో గూడి పరమేశ్వరారాధన చేస్తుండేవాడు. పెద్దవాడై సకలవిద్యా పారంగతుడై బహుభాషా కోవిదుడై శివలీలా మహాత్మ్యము, శివతత్త్వసారమనే గ్రంథాలు వ్రాశాడని ఆదిగౌడ దీపికలో వ్రాయబడింది. ఇతడు మహాభారత యుద్ధానంతరం వరకు వున్నాడని శివపురాణంలో వుంది. ఇతడు కూడా తండ్రితోబాటు రాచ కార్యాల్లో పాల్గొంటూ తండ్రి కన్ని విధాల సహకరిస్తూ తాత్కాలీన భారత వర్షంలో గౌడ రాజ్యాన్నొక మహోన్నత రాజనీతి గల దేశంగా తీర్చి దిద్దాడు.

ఆనాటి రాజ్యాభిషేక వేడుకలు : వైదిక రీతిలో జరిగే హిందూ రాజ్యాభిషేక

---

కోటి మంది జనము / కూడియుండిన నయట్టి ; గొప్ప కులము మనది / చెప్పుకొనగ
అట్టి కులము వారె / ఆదుకోలేదన్న ; నింతకన్న ఘోర / మెందు లేదు //

విధాన మేవిధంగా వుండేదో తెలియజెప్పిందానాటి గోపాలగౌడు మహారాజావారి రాజ్యాభిషేకం. రాజ్యాభిషేకపు ముందు రోజున సుందర భవ్యనగరంలో వుండే రాజమందిరంలో పూర్వరంగం యేర్పరచ బడుతుంది. ఆనాడు రాజుకు దీర్ఘాయువు, సమృద్ధి అజాత శత్రుత్వము అపరాజేయం కలుగుటకు గాను హోమం చేస్తారు. ఇందులో అష్ట మాతృకలైన మాహేశ్వరి, వారాహి, బ్రాహ్మి, మహాలక్ష్మి, వైష్ణవీ, చాముండా, శైలపుత్రి, శారదా దేవతలకు పూజ, నవగ్రహారాధన చేసి గ్రహశాంతి అయిన తరువాత వినాయక శాంతి, ఐంద్రిక శాంతి చేస్తారు. ఇవన్నీ రాజుయొక్క రాజ్యకాలం సుదీర్ఘకాలం వర్థిల్లాలనే సంకల్పంతో పూజలు చేస్తారు.

మరునాడు పట్టాభిషేకం నాడు పవిత్ర జలంతోస్నానం – ఇందులో సర్వశుద్ధి నిమిత్తం ఓషధీమూలములు, పంచగవ్యములు, సర్వబీజము, సర్వ ఫలము, సర్వపుష్పము మొదలగు వాటి నుపయోగిస్తారు. ఈ స్నానం చేయించడంలో చాతుర్వర్ణములవారూ పాలు పంచుకుంటారు. ఇందులో ప్రప్రథమంగా శూద్రులు మట్టికుండలోని నీటిని రాజుపైన చల్లుతారు. తరువాత వైశ్యులు రాగి పాత్రలోని పాలు చల్లుతారు, తదుపరి క్షత్రియులు వెండి బిందెలోని పెరుగును చల్లుతారు ఆఖరున బ్రాహ్మణులు బంగరు పాత్ర యందలి వెన్నను తీసి రాజుకు పూస్తారు.

దీని తరువాత అంగశుద్ధి క్రమం ఆరంభమౌతుంది. ఈ ప్రక్రియలో రాజు యొక్క శరీరమందలి ప్రతీ అంగాన్ని విభిన్నమైన మట్టి ధూళులతో లేపనం చేస్తారు. ఇందులో ప్రముఖంగా చీమలి పుట్టలోని మట్టి, ఏనుగుదంతంతో తీయబడిన అడుసు, ఇంద్ర ధ్వజ దండం క్రింది ధూళి, గుఱ్ఱపు డెక్కల క్రింది ధూళి, గోశాల యందలి అడుసు, విష్ణు మందిరంలోని ధూళి, వేశ్యా గృహ ద్వారంలోని ధూళి, రథ చక్రముల క్రింది ధూళి, పవిత్ర నదీ-సాగర సంగమ మందలి మట్టి నుపయోగిస్తారు.

అటు పిమ్మట రాజ పురోహితుడు బంగారు పాత్రతో హోమ

---

ముఖ్యులైన వారు / ముందు సభ్యులగుచు ; చిన్న వారి వెల్లి / చేరదీసి
గ్రంథమందరకును / గావలయు ననుచు ;నచ్చ చెప్పవలయు / నయము గాను ॥

కుండంలోని భస్మాన్ని తెచ్చి రాజుపైన చల్లుతాడు. అటుతరువాత అనేక రంధ్రాలు గల స్వర్ణపాత్రలో పోసిన పవిత్రోదకంతో బ్రాహ్మణులు రాజున కభిషేకిస్తారు. పవిత్రోదకమంటే గంగా-యమున-సరస్వతి (త్రివేణీ సంగమము) నదుల లోని నీరు, నాలుగు సముద్రములు, సప్త సరోవరముల లోని నీరు. ఈ నీళ్ళు అభిషేకం జరిగే సమయంలో మంగళ తూర్యనాదాలు వేదమంత్ర పఠనం, శంఖారావాలు దుందుభి మొదలగు వాద్యములు మ్రోగుచుండగా, చాతుర్వర్ణముల ప్రతినిధులు రాజుపైన నీళ్ళు చల్లుతారు. ఈ తతంగం పూర్తయిన తరువాత పుణ్యాంగనలు స్నానం చేయిస్తారు. స్నానానంతరం ధౌత వస్త్రాలు కట్టించి, భద్రాసనం మీద కూర్చుండబెడతారు. ఈ పట్టాభిషేక మహోత్సవాన్ని తిలకించడానికి లక్షలాది ప్రజలు, సామంతులు, దేశ విదేశ రాయబారులు, గూఢచారులు మొదలగు ప్రముఖులెందరో ఆహ్వానింపబడతారు. స్వర్ణసింహాసనాని కిరువైపులా రాజ్యంలోని ఉన్నతాధి కారులు, చరురంగ దళముల అధ్యక్షులు కొలువు తీర్చి వుంటారు. ఛత్రం పట్టే వేడుక గొప్పది. చామరాలు వీచే సుందరాగుల నేర్పు గొప్పది. సింహాసనం మీద వరుసగా సింహ, వ్యాఘ్ర, హరిణ, వృషభ చర్మాల్ని పరుస్తారు. దీని వలన రాజుకు పరిసరముల సృష్టితో ఏకాత్మభావ ముదయించడానికి దోహదపడుతుంది.

తరువాత రాజపురోహితుడు నూరు మంగళ ద్రవ్యాల్ని చూపిస్తాడు. వీటి దర్శనం శుభాన్ని సూచిస్తుంది. తరువాత మాతృభాషలో రాజగురువు శపథం చేయిస్తాడు. జ్యోతిష్యులు నిర్ణయించిన శుభముహూర్తం రాగానే రాజగురువు గోపాల్ గౌడును - మహారాజుగా ప్రకటిస్తూ, ధగధగాయమానంగా వెలుగొందే నవరత్నఖచిత స్వర్ణమకుటం (కిరీటాన్ని) శిరోభూషణంగా అలంకరించి - రాజోచితమైన దుస్తులనిచ్చి - "మహాజనులారా! నేటినుండి యాయన మన మహారాజు" అని అనగానే ప్రజలు జయ జయధ్వానాలు, కరతాళధ్వనులు మిన్నుముట్టేటట్లు చేస్తారు. గౌరవ సూచకంగా 35 ఫిరంగులు పేలుస్తారు. మంగళ వాయిద్యాలు, శంఖానాదాలు, దశదిశల మ్రోగుచుండగా నూతనాభిషిక్తుడైన రాజుకు తిలకధారణ చేస్తారు. తరువాత రాజమాత

---

చదువు సంధ్యలేని / చవట గాడయినను, ధనము గల్గియున్న / ఘనము గాను పండితులును గూడ / ప్రస్తుతింతురు వాని / గౌడులార కీర్తి / కలితులార ॥

ఆశీర్వాదం పొంది నల్లని చెవి గల శ్వేతాశ్వాన్నధిరోహిస్తాడు. ఈ అశ్వాన్ని ముందుగానే విశేష పూజలతో సిద్ధపరచి వుంచుతారు. గుఱ్ఱం మీద నుంచి దిగగానే పూజాదులతో సిద్ధపరచ. బడియున్న భద్రగజాన్నధిరోహిస్తాడు. గజారోహణానంతరం రాజదంపతులు గణేశ మందిరానికి వెళ్ళి ఆ దేవదేవుని దర్శించి పూజించి ఆశీర్వాదం పొందుతారు. నగరమంతా సుందరంగా అలంకరింపబడి, యింటింటా ఉత్సవాలు, వేడుకలు జరుపుకుంటూ విందులు వినోదాలతో ప్రజలంతా మహదానందంతో క్రీడిస్తారు. పరిసరములందలి గిరిజనులు, కొండజాతీయులు రాజు యెడల తమ భక్తి విశ్వాసాలు ప్రకటించుకొనడానికి వచ్చి దర్శనం చేసికొని వారి వారి కళా కౌశలాన్ని ప్రదర్శిస్తారు. తరువాత రాజు ఖడ్గాన్ని ధరించి, ఒక చేతిలో గదను ధరించి గజారూఢుడవగా వాని వెంట వివిధ హెూదాలు గల ఉన్నత రాజోద్యోగులు 50 ఏనుగుల నెక్కి ఊరంతా ఊరేగుతారు. ఈ ఉత్సవ వేడుకలు ఒక నెల రోజులు జరుగుతాయి. ఈనెల రోజులు దాన ధర్మాలు అతిథి పూజలు విరివిగా జరుగుతాయి.

## గోపాల గౌడుని ప్రతిభ

తారానాథ్ అనే పండితుడు "గౌడాధిక్య"మనే గ్రంథంలో గోపాల గౌడు మహారాజావారు ధార్మిక విశ్వాసములందు బౌద్ధుడనియు, అజేయమగు శక్తి సామర్థ్యములు గల చతురుడనియు, పరిపాలనా దక్షుడనియు, పాట్నా జిల్లా యందలి బీహారు వద్ద నరేంద్ర (నలందా) బీహారు రాజ్యస్థాపకుడనియు వ్రాశాడు.

మంజుశ్రీ అను చరిత్రకారుడు "మూలకల్ప" మనే గ్రంథంలో గోపాలగౌడుని రాజ్యపాలనలో దేశమంతటా అనేకానేక విహారచైత్యాలు, ఉద్యానవనాలు, వాపీ కూపతటాకాదులను నిర్మించుటయే గాక నదుల నుండి పొలములకు పంటకాలువలు త్రవ్వించెననియు, అనేకానేక దేవళములు, గుహలను నిర్మించెనని వ్రాశాడు.

---

*ధనము ధాన్యముండి / తగినంత బలముడి / తప్పు చేయువాడు / దండనార్హు డౌనుగాన వాని / ననుసరింపగ రాదు, గళిత గర్వులార / గౌడులార //*

ఈయన గుర్జర (గుజరాత్) ప్రతీహార శాసకుడైన వత్సరాజుకు బద్ధశత్రువని యితని తరువాత యితని కుమారుడు కాలమగౌడు గుర్జర దేశీయులకు శత్రువుగానే వుండెనని వ్రాయబడింది.

## గౌడ దేశ పతనము

1575 సంllలో అక్బరు పాదుషా సుబేదారైన వలీఖాన్ గౌడదేశపు సిరి సంపదలకు సౌందర్యమునకు ఆకృష్టుడై గౌడ దేశాన్ని హఠాత్తుగా ముట్టడించాడు. శాంతి కాములైన గౌడులు తగినంత సైన్య బలాన్ని సమకూర్చుకొని వుండనందు వలనను, ఉత్తర -పశ్చిమ బంగాళములందలి అంతః కలహాల కారణంగాను, తరుచుగా శత్రువులు ఆకస్మిక దండయాత్రలు జరుపుచుండుట వలనను హిమాలయాలకు ఉత్తర భాగం నుండి వచ్చిన కాభోంజుల చేతిలో దెబ్బ తినివుండుట వలనను అప్పటి చందేలు రాజు యశోవర్మ కూడా ఒక వైపు నుండి దండెత్తి వచ్చినందువలనను గోపాలుగౌడుని సైన్య బలం తగ్గిపోయింది.

తుదకు మహమ్మదీయుల కాలంలో గౌడులు నామమాత్రరాజులుగానే వుండిపోయిన కారణంగా వలీఖాన్ గోపాల్ గౌడు నోడించి తన రాజధానిని పాండువా నుండి గౌడ దేశానికి మార్చుకున్నాడు. తత్ఫలితంగా గౌడ దేశం ముస్లిముల జనాభాతో అత్యంత జనసంకీర్ణమై పోయింది. గౌడులకు రాజులేని కారణంగా మహమ్మదీయులు నానా హింసలకు గురి చేశారు. గౌడులు వారి అమానుష కార్యాలకు, దౌర్జన్యాలకు గురియై సర్వస్వం కోల్పోవడం బట్టి, నిరాయుధులు, నిస్సహాయులైన వారిక చేయునది లేక తమకు జరిగిన అన్యాయాలకు ప్రతీకారంగా తమ విద్యాబలంతోను, దేవతోపాసనా మంత్రశక్తి తోనూ మహమ్మారిని సాయపడుమని ప్రార్థించారు. వారి ఉపచారాలకు సంతుష్టిచెందిన ఆ యమ్మ దేశంలో ప్రవేశించి నానాబీభత్సంచేసి శత్రువుల నందర్ని రోగగ్రస్తులను చేసి మూడు వంతుల మంది మహమ్మదీయులను కబళించి గొప్ప జన నష్టం కల్గించింది. ఈ మహోపద్రవానికి భయపడిన

---

ధనము గల్గ వాడు / దారుణంబులు చేసి, తప్పుకొనుచు తిరిగి / దాత పేర పుణ్యపురుషుడంచు / పూజలందు కొనుచు / పొగడబడుచు నుండు / భువిని నిజము ॥

తురకలలో చాలా మంది ప్రాణరక్షణ కొరకు యితర పట్టణాలకు పారిపోయారు. పాండువాలో కూడా మహమ్మారి ప్రవేశించి చాలా మంది తురకలను హతమార్చి అపారజన నష్టం కలిగించింది. పీనుగల పెంటగా మారిన గౌడ దేశాన్ని విడచి గౌడు లందరు సరిహద్దున నున్న ఆంధ్రదేశానికి వలస వెళ్ళి పోయారు. ముస్లిములు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకుపోయారు. మహమ్మారి ఉధృతం తగ్గిన పిమ్మట హత శేషుల ఆర్తనాదాలు హాహాకారాలు నలుమూలలా చెలరేగాయి. నగరమంతా నిర్మానుష్యమై పోయింది. రాజభవనాలన్నీ పాడుపడిపోయాయి. రాజమార్గంలో గడ్డి మొలిచింది. పరిసర ప్రాంతపు అడవులలో నుండి పెద్ద పులులు, సింహాలు మొదలుగా గల క్రూర జంతువులు వచ్చి మిగిలిన శత్రువుల్ని సంహరించాయి. క్రమంగా పాండువా నుండి గౌడ దేశం వరకు గల యిరువది మైళ్ళ ప్రదేశమంతా గొప్ప అరణ్యంగా తయారై పోయింది. దాని తరువాత బెంగాల్ నివాసులకా కారడవిలో కప్పుపడిపోయిన సుందర భవ్యనగరం ఆచూకీ తెలియ రాలేదు. ఇప్పుడిప్పుడే ఆ ప్రాచీన సుందర నగర వైభవాలు భారత పురాతత్వ శాఖవారి త్రవ్వకాల్లో బయటపడుతున్నాయి. ఈ గౌడ దేశం గోపాల గౌడుని అనంతరము 9, 10 శతాబ్దములలో పాల వంశీయుల క్రిందను, 12వ శతాబ్దంలో సేన వంశీయుల ఆధిపత్యంలోను వుంది. ఈ కాలంలో గౌడరాజు లక్కడ అనేకానేక హిందూ మందిరాలు,స్వర్ణమందిరాలు కూడా నిర్మించారు. వాటినన్నింటిని ముసల్మానులు మతోన్మాదంతో నాశనం చేసి దోచుకున్నారు. వాటి స్థానంలో మహమ్మదీయులు 1580లో నసరత శాహ అనే మశీదు, లోటోన్మశీదు, బంగారు మశీదు, ఫిరోజ్ మీనార్ (స్తంభం) వెలిశాయి. 1526లో ధనవంతుడైన సుబ్బరాయ గౌడను నతడొక దుర్గాలయాన్ని నిర్మించాడు. అది కూడా జీర్ణావస్థలో వుంది. భారత పురాతత్వ శాఖవారు త్రవ్వకాలను పరిశోధించి ఆ ప్రాచీన నగర కట్టుబడి, అందమైన శిల్పము, విశాలమైన రాజ బాటలు, సౌధ నిర్మాణంలో వుపయోగించిన వస్తుసామగ్రి గౌడులనైపుణ్యానికి తార్కాణమని వ్రాశారు.

---

*దొంగలౌచు దిరుగు / దొరలను వెంటాడి, పట్టి చూప వలయు / ప్రభుత కెపుడు*
*అట్టి వారి వలెనె / అవినీతి పెరుగును, భవ్యులార గౌడ / వంశ్యులార //*

మశీదులు కూడా కళాదృష్టిలో గొప్పవని వ్రాశారు. దీని అవశేషాలు బెంగాలుకు-మాల్దా పట్టణానికి పదిమైళ్ళ దక్షిణంగా వున్న ప్రదేశంలో వున్నాయి. కొన్ని శాసనములలో ఈ గోపాలగౌడు మగధ, అంగరాజ్యములను కూడా పాలించెనని వున్నది. ఈ మహనీయుని నిర్యాణం కూడా యెక్కడా చెప్పబడి యుండ లేదు.

గత సంస్కృతిని స్మరించి కీర్తింపజాలని జాతికి మనుగడ సాగించే హక్కు పోతుందని పెద్దలంటారు. గనుక గౌడులైన ప్రతీవారు యీ పవిత్ర యితిహాసాన్ని మననం చేసికొని పూర్వజులను కీర్తించాలి అది ధర్మం.

ముఖ్యగమనిక :- గౌడులను గురించిన ప్రాచీన యితిహాసం గల తామ్ర శాసనాలు 200లకు పైగా ఢిల్లీ ప్రాచ్యలిఖిత భాండాగారంలో వున్నాయి. ఒక్కొక్క శాసనానికి రూ.300/-లు రుసుము చెల్లిస్తే గాని అవి వ్రాసుకోవడానికి వీలు లేదు. గనుక సంఘాభిమానం గలవారు' ప్రాచీన విషయాలు తెలిసికొనాలనే ఉత్సుకత గలవారు యీ అపురూప సంపదను సంపాదించడానికి ధనవంతులైన దాతల నుండి విరాళాలు సేకరించి వెళ్ళి వ్రాసుకొని వచ్చి ప్రకటిస్తే జాతికి మహోపకారం చేసిన వారౌతారు. ఇది నాకు అసాధ్యమని పూనుకొనలేదు.

## వేదయుగం లోని గౌడుల పేర్లు

ఈ విధంగా కౌండిన్య వంశోద్భవులైన గౌడులందరు క్రమంగా కృతయుగంలో దేవగౌడులని, త్రేతాయుగంలో ఆదిగౌడులని, ద్వాపరయుగంలో శివగౌడులు సత్యగౌడులనే పేర్లతో ప్రసిద్ధులయ్యారని వీరందరు శివపూజా దురంధరులు, శైవమతస్తులని ఆదిగౌడ దీపికలో వ్రాయబడింది.

## ప్రాచీన గౌడులలోని కొన్ని ముఖ్య శాఖలు :

(1) ఆది గౌడ వంశోత్పత్తి : పూర్వ వివరణ చరిత్రాంశములను బట్టి ఉత్తర హిందూ స్థానం గౌడదేశమని నిరూపింపబడినది. ఈ ప్రదేశంలో

---

ప్రక్క యింటి వాడు / పట్టెడన్నమునకు ; పాట్లు పడుచు నుండ / బాధలేద?
బొజ్జ నిండ తిన్న / భోజనం బదియంత, దొంగతనమె గాని / దొరతనంబ?

సృష్ట్యాది నుండి గౌడ బ్రాహ్మణులు నివాసమేర్పరచుకొని వున్నారు. సృష్ట్యాదినుండి వుండుట వలన వారు ఆదిగౌడులని పిలవబడ్డారు. వీరి వంశం యించుమించు పదివేల సంవత్సరాలకు పూర్వం నుండి వున్నట్లు ప్రాచీన స్మృతుల్లో వుంది. వీరు వేద వేదాంగ పారంగతులైన యజుర్వేదీయులు. వీరిలో స్మార్త అద్వైతము, స్మార్త శాక్తేయమనే రెండు తెగలున్నాయి.

## బ్రాహ్మణోత్పత్తి మార్తాండమనే గ్రంథంలో యిలా వ్రాయబడింది

జనమేజయుడనే రాజు ఆర్యావర్త దేశాన్ని పాలించేవాడు. అతడొకప్పుడొక యజ్ఞంచేయ సమ కట్టి సుప్రసిద్ధ యాజ్ఞికుడైన వటేశ్వర మునిని, ఆయనకు గల 1444 మంది శిష్యులతో సహా రమ్మని మని ఆహ్వానించాడు. వారంతా వచ్చి చాలా ధన వ్యయంతో గూడిన గొప్ప యజ్ఞాన్ని పరిసమాప్తి చేశారు. యజ్ఞానంతరం అవబృధస్నానం పూర్తి చేసుకొని వచ్చిన రాజు వటేశ్వరుని ఘనంగా సత్కరించి ఆయనకు అమూల్య కానుకలు దక్షణగా యివ్వబోయాడు. కాని ఆ ముని పుంగవుడా కానుకలను స్వీకరింపక ఆశీర్వదించి వెళ్ళిపోవడానికి ప్రయాణ మయ్యాడు. అప్పుడా మహారాజా తమలపాకు మడుపులలో ఒక్కొక్క గ్రామం దానంగా వ్రాసి ఆ తమలపాకులను 1444 మంది శిష్యులకు యిచ్చాడు. శిష్యులా మడుపులను తీసికొని తిరుగు ప్రయాణమై నడుస్తున్నారు. వీరంతా మంత్ర తంత్ర విద్యలలో నిపుణులు. వీరు నీటి మీద కూడా అనాయాసంగా నడువగల జలోపరిగమన విద్య గలవారు. మార్గమధ్యంలో వారంతా ఒక నదిని దాటవలసి వచ్చింది. వారు తమ విద్యను స్మరించి నీటిపై కాలు మోపగా కాళ్ళు నీటిలో దిగబడిపోయాయి. అది గ్రహించి వారంతా ఆశ్చర్య చకితులై తమకు గల జలోపరిగమన విద్య నశించిపోవడానికి కారణం తెలియక గుర్వాజ్ఞానుసారం తమలపాకు మడుపులను విప్పి చూచుకున్నారు. అందులో గ్రామ దానాలు వ్రాయబడి వుండడం చూచి రాజు వద్ద దానం

---

*నేతి బీరకాయ । నేతిని చవి చూడ! యెంత హాస్యమౌనొ । అంతె కాదె*
*సంఘ జనులె దీని । సరిజేయకున్నచో; కలిత సుగుణులార । గౌడులార ॥*

పట్టడం కారణంగానే తమ జలోపరిగమన విద్య నశించిందని తెలిసికొని వారంతా వెనక్కు తిరిగి రాజాస్థానానికి వెళ్ళి - "ఓ రాజా! దానములు గ్రహించమని ముందుగానే చెప్పాము గదా! తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే ధనాపేక్ష లేని మావంటి సాధువుల నీవిధంగా మభ్య పెట్టవచ్చునా! నీ గ్రామ దాన స్వీకరణచే మా అమోఘ విద్యలు నశించాయి. గనుక నీ విచ్చిన దానమును నీవే తీసికో " అని చెప్పగా విన్న రాజు మిక్కిలి భయపడి, వారినెంతగానో బ్రతిమలాడుతు, యెన్నో విధాల ప్రార్థించి - "ఓ మహాత్ములారా! సర్వజ్ఞులైన మీకు నేనేమని చెప్పగల వాడను. రాజు యజ్ఞం చేయించుకొని ఋత్విక్కులకు దానమీయక పోతే ఆ యజ్ఞం ఫలింపదనిమీకు తెలియంది కాదు. నేనా యజ్ఞ ఫలాన్ని కాంక్షించియే మీరు కాదన్నా అలా వ్రాసి యిచ్చాను. నా అపరాధాన్ని మన్నించి మీమీ గ్రామాల్ని తిరిగి స్వీకరింపుడని ప్రాధేయపడి వారినందరను శాంతిపజేసి గౌడ దేశంలో వుండుమని ప్రార్థింపగా వారంతా అంగీకరించి అక్కడనే నివాసమేర్పరచు కున్నారు. అప్పటినుండి ఆ బ్రాహ్మణులు ఆది గౌడు లనిపించుకున్నారు. ధన మధాందత వలన వారిలో ఆచారాలు, అడుగంట నారంభించాయి. భోగలాలసులై పక్వాన్నాన్ని పూటకూటి వాళ్ళ యిళ్ళ నుండి కొని తెప్పించుకొని తినేవారు. క్రమంగా వారి నియమ నిష్ఠలడుగంటి ఆచార హీనులయ్యారు.

## (2) శ్రీ గౌడుల ఉత్పత్తి

కర్ సోదే అనే గ్రంథంలో ప్రాచీన కాలం లోని గుజరాతీ గౌడ బ్రాహ్మణులను మేడల్ వాలా అని పిల్చేవారని, విక్రమనామ సంవత్సరం 1160 మార్గశిర శుద్ధ పంచమీ గురువారం నాడు గుజరాత్ దేశాధిపతి మహాప్రతాపి, రాజా విజయసింహగౌడు తమ దేశమున నున్న 200 మంది గౌడ బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలు దానంగా యిచ్చి వారి నందర్ని తన రాజ్యమందుండు మని ప్రార్థించాడు. వీరు సామవేదులు. భారద్వాజ సంతతి

---

మత్తు వస్తువులను / మచ్చుకైనను గూడ, వాడి నట్టి గౌడు / గోడు కనరె
కల్లు సార బ్రాంది / యిల్లు వాకిలి ముంచు ; త్రాగరాదు మనము / దాని నెపుడు ॥

వారని చెప్పుకుంటారు. వీరిప్పడు మాళవ, కాశీ ప్రాంతాల్లో వున్నారు.

కాశ్మీరమందలి శ్రీ హట్ట నగరంలో గౌడులుండేవారు. తదుపరివారు కాల ప్రభావం వలన "మాలవీ" దేశానికి వెళ్ళిపోయారు. రాజా విజయ సింహ గౌడు వారినందర్నీ తన దేశాని కాహ్వానించి వారికనేక భూములను, ధనాదులనిచ్చి పోషించేవాడు. వీరికి కులదేవత లక్ష్మీదేవి ఎల్లప్పుడు వారా దేవిని శ్రద్ధాభక్తులతో పూజించేవారు. వీరికి వేదాధికారం గల బ్రాహ్మణ ధర్మాలుండేవి. కాని వీరు కాల క్రమేణా యితర వృత్తులను చేపట్టి తమ ధర్మాల్ని విస్మరించారు. వీరిలో 22 కుటుంబాల వారు మేడల్ (మీరట్) పట్టణానికి వెళ్లిపోయారు. అందువలన వారు మేడల్ వాలా అని పిలువబడ్డారు. వీరే మాలవీ శ్రీ గౌడులు. రాను రాను వీరుశూద్ర కన్యలను వివాహమాడి సురాకరణవృత్తి చేయనారంభించారు. దానికి ప్రమాణం యీ క్రింది విధంగా వుంది.

శ్లో॥ గౌడ బ్రాహ్మణ సంజాతో ఆర్యావర్తే ప్రవర్థితః
అసావ ధర్మ ఇత్యుక్తః సర్వధర్మ బహిష్కృతః ।
సురాకృత్వా విక్రయీత కుర్యాత్తద్ధన జీవనమ్
ఇత్యేతు గౌడ సంభూతః సౌష్కల్యేతు ఇతిస్మృతః ॥
(ఆది గౌడ దీపిక 895 వర్ణన – 193 పుట)

ఈ ప్రమాణాన్ననుసరించి మాలవీ శ్రీ గౌడులైన వారు తమ బ్రాహ్మణ ధర్మాల్ని విడచి, స్వధర్మాచార హీనులై తమ కుల దేవతయైన లక్ష్మీదేవిని పూజించుట మాని వేసిన కారణంగా ఆ దేవి క్రాగ్రహం కలిగి వారిని ధన, విద్యావిహీనులగునట్లు శపించింది. అప్పటినుండి గౌడులు విద్యా విహీనులై ధన హీనులై ఆ దేశాన్ని విడిచి కొందరు మాలవీ దేశానికి, కొందరు మార్వాడీ దేశానికి, కొందరు బంగాళా దేశానికి, మరి కొందరు ఢిల్లీ, పాట్నా మొదలైన పట్టణాలకు వలస పోయి స్థిర నివాసాలేర్పరచుకొని సురాకరణ వృత్తిని, తదితర వృత్తులు చేయనారంభించి జీవించే వారని పై ప్రమాణం వలన తెలుస్తుంది.

---

*కులము వాడు త్రాగ / ఘోర విపత్తుల ; పాలగుననె శాప / భయము కలదు*
*గౌడు డెవడు కూడ / కల్లు సార విస్కి ; త్రాగ రాదు ఎప్పుడు / ధరను నిజము ॥*

## (3) అగ్రదాని గౌడశాఖ

ప్రప్రథమంగా దానం పట్ట నర్హులు గాన వీరికి బిరుద నామమేర్పడింది. ఈ శాఖీయులు అపర కర్మలయందును, ప్రేత కార్యములందును దానాలు పట్టేవారు. ఈ ఆచారం కాశీ పట్టణంలో యిప్పటికీ వుంది. నేను కాశీలో వీరితో కలిసి మాట్లాడి విషయసేకరణ చేశాను.

## (4) ఆచార్య గౌడ శాఖ

వీరు అపర కర్మలందు భోక్తలై యుండుట ఆచారంగా గలవారు. పూర్వం దశరథ మహారాజు మరణించినప్పుడు భరతుడు మేనమామ గారింటి నుండి వచ్చే వరకు ఈ ఆచార్య గౌడ సంఘం వారే ఆ కళేబరాన్ని రక్షించారు. భరతుడు వచ్చి వీరి సేవాతత్పరతకు సంతసించి దశరథ మహారాజు ధరించిన అమూల్య వస్తు, వస్త్ర, భూషణా ద్యలంకారాలన్నీ ఏకాదశాహమున వారికివ్వబోగా వారు సంశయించి నిరాకరించారు. అప్పుడు వసిష్ఠ మహర్షి వచ్చి వారిని సమాధాన పరచి ఆ సముదాయానంతా తీసికొమ్మని ప్రేరేపింపగా అప్పుడా అమూల్య సంపదను వారు స్వీకరించారు.

అరణ్యవాసానంతరం సీతాసమేతుడై శ్రీరాముడు తిరిగి అయోధ్యకు వచ్చి తన తండ్రి కళేబరాన్ని అత్యంత శ్రద్ధానక్తులతో కాపాడిన విశ్వాసపాత్రులైన గౌడాచార్యులను రావించి వారిని పూజించి సత్కరించాడు. అప్పటినుండి అపరకర్మలందు ఏకాదశాహంలో యీ శాఖ గౌడులు పూజనీయులని, ఆ సమయంలో కనీసం ఒకరినైనా పూజింపని యెడల కర్మసిద్ధింపదని అందువలన తనరాజ్యం లోని ప్రజలెల్లరు వీరిని పూజింపవలెనని శాసించాడు. నేటికి యీ ఆచారము కోసల, విదేహ దేశాల్లో పాటింపబడుతుంది..

## (5) కీర్తన్య గౌడ శాఖ

వీరిని గురించిన సమాచారమేదీ దొరకలేదు.

---

అత్రి మునియె మనకు / ఆంక్ష పెట్టిన వాడు ; మునుల శాపమిపుడు / కనుల ఎదుట కానవచ్చు చున్న / కనలేర మీరంత; గౌడులార కీర్తి / కలితులార ॥

## (6) శుక్లవాల గౌడ శాఖ

వీరు కూడా ఆది గౌడ శాఖీయులవలె శుక్ల యజుర్వేదీయులు, వీరిలో జోషీలని, ఓఝులనే రెండు తెగలున్నాయి. వీరు వాస్తు, జ్యోతిష శాస్త్ర పారంగతులు. భూగర్భ జలాలను, ఖనిజ సంపదను, రత్నాదులను కనిపెట్టి వెలికి తీయుటలో ప్రవీణులు.

## (7) సారస్వత గౌడ శాఖ

లేఖనము, (కావ్య ప్రబంధాదుల రచన), కవిత్వము, ఆయుర్వేద శాస్త్రంలో ప్రావీణ్యులై, సర్వ విద్యలయందును విశేష ప్రజ్ఞా పాటవాలను సంతరించుకొని అందరకు పూజ్యులై కీర్తింపబడినవారు. కాలక్రమేణ వీరి శాఖీయులే ఆంధ్రదేశానికి వలస వచ్చినారని ఆధారాలను బట్టి తెలుస్తుంది.

# ద్వాదశ ప్రకార–గౌడ వంశోత్పత్తి వర్ణన

పై ఏడు శాఖల వారేగాక పూర్వపు గౌడులు ఆధ్యాత్మిక చింతనతో మహర్షుల నాశ్రయించి వారికి శిష్యులై వారి వారి నామములతో గోత్రముల నేర్పరచుకొని రనియు, అట్టివి పండ్రెండు కలవని ఆ ఋషుల–వారి శాఖల గౌడుల పేర్లు యీ క్రింది విధంగా వున్నవని ఆది గౌడ దీపిక యందు వర్ణింపబడి వుంది.

శ్లో॥ 1. మండపాచల సాన్నిధ్యే మండపేశ్వర సన్నిధౌ ।
గౌడస్తేఽ పి చ మాండవ్య శిష్యా స్తే గురవః స్మృతాః ।

2. మాండవ్యస్తత్ర శ్రీ గౌడా గురవః శంసిత వ్రతాః ।
గౌతమో దత్తవాన్తేషాం గుర్వర్థం తాన్ ఋషీన్ విభుః ।

3. గౌడ తత్ర చ శిష్యాన్వై గురవస్తే తపస్వినః ।
శ్రీ హర్షేశ్వర సాన్నిధ్యే గతవాన్ ఋషి సత్తమః ।

---

ధనము గల్గువారు । తమ వారికొరకని ; పెట్టవలయు పెద్ద । పెట్టబడులు
పూని సంస్థలెన్నొ । పోషింపరావలె, భవ్యులార గౌడ । వంశ్యులార ।

గౌడా స్తస్యతు వై శిష్యా గుర్వర్థం సంప్రకల్పితాః ।
4. చతుర్థం తు సుతస్తస్య హారతాయ దదౌ పునః ।

గృహీత్వా గతవాన్ సోఽపి దేశే హర్యాణకే శుభే ।
5. హర్యాణశ్చైవ శ్రీగౌడ గురుత్వే సంప్రణోది తాః ।

దేశేఽర్బుదే మహారణ్యే వాల్మీకాశ్రమ సంజ్ఞకే ।
6. వాల్మీకాశ్చైవ గురవో మునినా సంప్ర కల్పితాః ।

వాశిష్ఠ ఋషి శిష్యాశ్చ వశిష్ఠస్య మహాత్మ నః ।
7. సార భేయే శుభే దేశే సారభా గురవః స్మృతాః ॥

అష్టమూర్తి సుతం తస్యా దాలభ్యాయ దదౌ తతః ।
8. తచ్ఛిష్యా శ్చైవ దాలభ్య గురుత్వే తే ప్రకీర్తి తాః ।

తత్తస్యైభ్యో దదౌ హంసాన్ శిష్యాంశ్చ యజనాని వా ।
9. విప్రాస్తు సుఖదాశ్చైవ సుఖసేనా మహౌజసః ।

10. దశమంత్రస్య పుత్రంతు భట్టభ్యా మునయే దదౌ ।
తాన్ గురుత్వేన సంపాద్య భట్ట నాగర సంజ్ఞ కాః ।

11. ఏకాదశంతు పుత్రంతు సారభాయ దదౌ తతః ।
సూర్య ధ్వజాశ్చ తచ్ఛిష్యా గురుత్వే తే ప్రకల్పితాః ।

12. ద్వాదశంతు సుతం తస్యా మాదురాయ దదౌ తతః ।
మాధురీయాశ్చ గురవో వర్తంతే బహవ స్మృతాః ॥

పై శ్లోకములలో ముఖ్యంగా గౌడుల వర్ణనము మాత్రమే చేయబడినది. మండపాచల సమీపమున నున్న మాండవ్య ఋషి శిష్యులు-మాండవ్య గౌడులు. వీరిలో కొందరు లంబితానగరంలో వుండుట వలన లంబితా[2] గౌడులనియు, గౌతమ మహర్షి శిష్యులు – గౌతమ[3] గౌడులనియు, సరయూ నదీ తీరవాసులగు శ్రీ హర్ష వంశధరులు – శ్రీ హర్ష[4] గౌడులనియు,

---

ధనము గల్గు వారు । తమ వారి కొరకని ; పెట్టవలయు పెద్ద । పెట్టుబడులు
పూని సంస్థలెన్నో । పోషింపరావలె ; భవ్యులార గౌడ । వంశ్యులార ॥

హర్యానా దేశమున నున్న హరీత మహాముని శిష్యులు–హర్యాణ[6] గౌడులనియు, అర్యు దేశ మందలి మహారణ్యంలోనున్న వాల్మీకి మహర్షి శిష్యులు–వాల్మీకి[6] గౌడులనియు, వసిష్ఠ మహర్షి శిష్యులు, వాసిష్ట[7] గౌడులనియు, సారభేయ దేశమందలి సారభేయ మహర్షి శిష్యులు – సారభ[8] గౌడులనియు దాలభ్య ముని శిష్యులు– దాలభ్య[9] గౌడులనియు, భట్టుడను ముని శిష్యులు – భట్ట నాగర[10] గౌడులనియు, సారభుని శిష్యులలో కొందరు సూర్య[11] ధ్వజగౌడు లనియు, మాధురుడను ముని యొక్క శిష్యులు – మాధురీయ[12] గౌడులనే ప్రసిద్ధి నామములతో యీ ద్వాదశ విధ గౌడులను పిలిచేవారు. "హిందువులు" హిందు దేశవాసులెట్లో అట్లే గౌడదేశ వాసులగుటం బట్టి "గౌడుల"ని పిలువబడ్డారు.

## గౌడ శబ్దోత్పత్తి, వివిధ గ్రంథ నిర్వచనము

(1) కౌముది వ్యాకరణ రీత్యా

గుడస్య వికారః అణ్

వికారార్థమున గుడ శబ్దమునకు అణ్ ప్రత్యయము చేర్చగా "గౌడ" శబ్దమేర్పడినది.

(2) భావ ప్రకాశరీత్యా : (44వ అధ్యా)

గుడ వికారే ఖండాసవాదౌ త్రి ।

గుడస్య తృప్తౌ మద్యస్య పీత్వా గౌడం సురాసవం ॥

గుడ వికారమైన ఖండాసవమునకు గౌడమను పేరు గలదు. గుడవికార మైన మద్యము పానము చేయునది గౌడమ్–సురాసవమ్

(3) వాల్మీకి రామాయణం (53 శ్లో. అయోధ్య కాండ)

నానా స్వాద రసానాంచ ఖాండవానాం తథైవ చ ।

భోజనాని సుపూర్ణాని గౌడాని చ సహస్రశః ॥

నానాస్వాద రసముల యొక్కయు, ఖండ చెక్కరల యొక్కయు, గుడసంబంధములైన భోజనములు వేలకొలది సుపూర్ణములైనవి. గౌడ

---

చెట్టు పన్ను కట్ట / చేతపైకము లేక ; పడెదు పాట్లు ప్రభుత / పాలదెలిపి
తప్పుకొనగ వీలు / తరచి చూడుం డింక ; కలిత సుగుణులార / గౌడులార ॥

శబ్దము ఆస్వాద్యమైన భోజన, పానీయ, ఆసవాది పరంగా శ్రీరాముడు సురాదులను వాడినట్లు దీని వల్ల తెలుస్తుంది.

## (4) సుశ్రుత సంహిత :

గౌడ మమ్ల మనమ్లం వా పానకం గురుమూత్రలమ్ ।

పులుపు కలిగినదైనను, పులవనిదైనను గుడపానకము గురుమూత్రలము అనగా అతి మూత్ర దోషాన్ని హరిస్తుంది.

## (5) ఆంధ్ర వాచస్పత్యమనే నిఘంటువు

గౌడి బ్రాహ్మణులు - బీహారుకు, వంగదేశమునకు, భువనేశ్వరమునకు నడుమ గల దేశము. బంగాళమునకు ముఖ్య పట్టణముగా నుండిన గౌడి యను పట్టణమును బట్టి యీ ప్రదేశ వాసులకు గౌడి బ్రాహ్మణులని పేరు కలిగినది. వీరు మత్స్య మాంసములను భక్షిస్తారు. వీరిలో అగ్రదాని గౌడ బ్రాహ్మణులు, ఆది గౌడ బ్రాహ్మణులు, కీర్తన్య గౌడ బ్రాహ్మణులు, శుక్లవాల గౌడ బ్రాహ్మణులను వారు కలరు. వాడుక గౌడ బ్రాహ్మణులని వ్యవహరింతురు.

## (6) భార్గవ హిందీ ఇంగ్లీషు నిఘంటువు

గౌడ - n. mas. an old division of Bengal, a Caste of Brahmins, a sub-caste among Kayasthaas.

గౌడియా - adj. an inhabitant of Gour.

గౌడీ - n. fem. a kind of rum distilled from treacle, a musical mode.

## (7) ఆంధ్ర శబ్ద రత్నాకరము

గౌండ్లవాడు - వై.వి. కల్లు సారాయి తీయువాడు, దాని నమ్మెడు వాడు, గవుండ్ల వాడు, ప్రయోగం - గోండు.

---

ధనము లేని వాడు / దరికాన కేడ్చును; ధనము కల్లువాడు / దరికి రాడు
పేదవాని బ్రతుకు / వెంటపాంగు గదా; కలిత విభవులార / గౌడులార ॥

గౌడు - వై.వి. కాపు వారి పట్టపు పేరు. సారాయి నమ్మువాడు విణపై మోటు సింగారము గలది.

గౌడ గీతములు - మి.వి.బ. కల్లు దింపెడి వారు పాడు కొనే పాటలు

గౌడ - సం.వి. ఆ. స్త్రీ. స్త్రీ రాగంలో ఒకటి, గౌళ.

గౌడ బ్రాహ్మణులు - సం.వి. అ.పు. గౌడ దేశీయులగు విప్రులు వీరు మత్స్య భుక్కులు.

గౌడము - సం.వి. అ.పుం. (1) వంగదేశము భువనేశ్వరము నడుమ గల దేశము, (2) న. బెల్లముతో చేసిన ఒకానొక పిండి వంట.

గౌడికము - సం. వి. అ. పుం. (1) చెఱకు, (2) ఒక విధమగు మద్యము.

సం.వి.ణ. బెల్లంతో చేయబడినది.

వ్యుత్పత్తి - గుడే సాధు - గుడ + ఠక్, గుడస్య వికారః గుడ+ఠక్ త. ప్ర.

**(8) పి. శంకర నారాయణ ఆంధ్రాంగ్ల నిఘంటువు**

గౌండ్ల వాడు - Same as గవుండ్ల వాడు

గౌడు - n. a liquor seller, a toddy drawer, a shepherd, the honorific title of a class of sudras.

గౌడము - n. the district of Gouri the Central part of the province of Bengal, the Bengali language, name of the religion of a particular subcaste (గౌడమతము)

గౌడి - n. name of a tune, a style of poetry, the bold and spirited style

గౌడులు - n. the generic name of the five races of northern India as dist. fr. ద్రావిడులు - పంచ గౌడులు.

**(9) సంక్షిప్త హింది శబ్ద సాగర్**

గౌడ (1) ఇది వంగదేశమందలి ఒక ప్రాచీన ప్రదేశము బ్రాహ్మణులలో

---

*ధనము ధాన్యముండి / తగినంత బలముండి ; తప్పు చేయువాడు / దండనార్హు డౌను గాన వాని / ననుసరింపగ రాదు ; గళిత గర్వులార / గౌడులార ॥*

ఒక వర్గము. ఇందు సారస్వత, కన్యాకుబ్జ, ఉత్కళ, మైథిలీ, గౌడులున్నారు. వీరే పంచగౌడులు (2) వీరు బ్రాహ్మణులలో ఒక జాతి (3) గౌడ దేశ నివాసులు గౌడియా - వి. (సం. గౌడ +యి యా = ప్రత్యయము), గౌడ దేశము యొక్క, గౌడ దేశ సంబంధమైనది.

గౌడీ - బెల్లముతో తయారైన మధురసము ; సారాయి

(10) మను ధర్మశాస్త్రము

గౌడీ పైష్టీ తథా మాధ్వీ విజ్ఞాయా త్రివిధా సురా !
యథైవైకా తథా సర్వా నపాతవ్యా ద్విజోత్తమైః ।

సుర-మద్యము, గౌడి-యనియు, పైష్టి యనియు, మాధ్వియనియు మూడు విధములు దీనిలో ఏ ఒక్కటి గాని మొత్తము కాని బ్రాహ్మణోత్తములు (గౌడులు) త్రాగరాదు.

(11) బృహస్పతిలో నిర్ణయించిన - మద్యము సేవించిన గౌడులకు ప్రాయశ్చిత్త కర్మలు :

గౌడీం మాధ్వీం సురాం పైష్టీం పీత్వా విప్రః సమాచరేత్ ।
తప్త కృచ్ఛ్రం పరాకం చ చంద్రాయణ మను క్రమాత్ ।

గౌడ బ్రాహ్మణులు గౌడీ మద్యమునుగాని, మాధ్వీమద్యము (సారాయి) గాని, పైష్టీ మద్యము (బ్రాందీ, విస్కీ మొదలైనవి) గాని త్రాగినచో తప్త - ఇనుపశలాకను కాల్చి వాతలు వేయుట ద్వారాను (కృచ్ఛ్రం = కృనత్తి పాపమితి కృచ్ఛ్రం - కృతి - ఛ్ఛేదనే - పాపమును పోగొట్టునది) మూడు దినములు పగలు మాత్రమే భోజనము చేసి, మూడు దినములు రాత్రుల యందు మాత్రమే భుజించి, మూడు దినములు అడుగకుండ వచ్చిన పదార్థములను మాత్రమే భుజించి, మూడు దినములు కేవలము ఉపవశించి వ్రతము చేయుట ద్వారాను, పరాక = పై దానివలెనే యిది కూడా ఒక కృచ్ఛ్ర వ్రతం దీని యందు నాల్గు దినములు నీరు కూడా త్రాగకుండా

చదువుసంధ్య లేని / చవటగాడయినను ; ధనము గల్గి యున్న / ఘనముగాను
పండితులును గూడ / ప్రస్తుతింతురువాని; గౌడులార కీర్తి కలితులార ॥

నిరాహారుడై ఉపవసించుట ద్వారాను, చాంద్రాయణం = ఇది కూడా పై దాని వలెనే చంద్రకళల యొక్క వృద్ధి క్షయములను బట్టి ఆహార కబళ వృద్ధి -క్షయములతో వ్రతమాచరించుట ద్వారాను ప్రాయశ్చిత్తము చేసికొనిన గాని సురాపాన దోషపు పాపము పోదు. అట్టి వారిని వెలివేసి సమాజములోనికి రానిచ్చెడు వారు కాదు.

## (12) గౌడరీతి లక్షణ గ్రంథముల వ్యాఖ్య

కావ్యాదర్శం కావ్యరీతి భేదేస్త్రీ
పదం సంఘటనా రీతి రంగ సంస్థా విశేషవత్ ।
ఉపకర్త్రా రసాదీనాం సా పునః స్యాత్ చతుర్విధా ।
వైదర్భి చా ధ గౌడీ చ పాంచాలీ లాటి కౌ తథా విభజ్య ।

గౌడీ రీతి యనునది కావ్యరీతి భేదములలో ఒకటిగా చెప్పబడినది. సంఘటనారీతి కలిగి రంగ సంస్థా విశేష విషయకరమైన పదము రసాదుల కుపకారకమై వైదర్భి, గౌడీ-పాంచాలీ-లాటిక అనే భేదాలతో నాల్గు విధాలుగా వుంది.

### సాహిత్య దర్పణం

ఓజః ప్రకాశకైర్వర్ణైర్బంధ ఆడంబరః పునః ।
సమాస బహ్వలా గౌడీ । తల్లక్షణ ముక్తః ।

సమాస బహుళమై సంఘటన యొక్క ఆడంబరము కలిగి ఓజస్సును ప్రకాశింపజేయు వర్ణము కలది సమాస బహుళమైన రీతి గౌడి అనబడును.

ఉదా:- "చం చంద్భుజ భ్రమితి చండ గదాభి వాత ... ..."

### గౌడియా రీతి వ్యుత్పత్తి :

ఏషా చ గౌడ జన ప్రియాతాత్ గౌడైః ప్రయుజ్య మాన త్వాచ్చ
గౌడీ సంజ్ఞా లభతే ॥

గౌడ జనులకు ప్రియమైన దగుట చేతను, గౌడ జనులు

---

ధనము గల్గు వాడు / దారుణంబులు చేసి / తప్పించుకొని తిరిగి / దాత పేర
పుణ్య పురుషుడంచు / పూజలందు కొనుచు / పొగడబడుచునుండు / భువిని నిజము

ప్రయోగించుట చేతను, ఆ రీతి ఒక ప్రత్యేకమైన ఆదరణీయ లక్షణమగుట చేతను గౌడియా రీతి అని పురాణ కావ్య గ్రంథములందు లాక్షిణికులు దీనిని ప్రత్యేకంగా గ్రహించుట జరిగింది.

గౌడ + చ । గౌడియా అత్రార్థే ।

గౌడ శబ్దమునకు "ఛ" ప్రత్యయము చేర్చగా గౌడియా అనురూప మేర్పడినది.

పురుషోత్తముని ప్రశంస :

బహ్వతర సమాసయుక్తా మహాప్రాణాక్షరా చ గౌడియా ।
రీతి రనుప్రాస సహిమ వరతన్ త్రాఽస్తో భవాక్యా చ ।

బహు సమాసయుక్తమైనదియు, మహాప్రాణాక్షరములు (ఖ, ఘ, ఛ మొ ॥ ) కలిగినదియు, అనుప్రాస మహిమ పరతంత్రమైనదియు, చక్కని సమన్వయము కలిగినదియు, గౌడ రీతి అని పురుషోత్తముడను లాక్షిణికుడు ప్రశంసించినాడు.

దీని వలన గౌడ దేశ సాహిత్యము, కార్యముల యందు తద్రచనా ప్రాచుర్యము లక్షణ కర్తలచే గ్రహింపబడి గౌడీ రీతియను రీతి నాకదానిని సాహిత్యము, సారస్వత ప్రక్రియల యందు విజ్ఞాన విహారములు కలదని తెలియుచున్నది.

## గౌడులాచరించిన అన్న ప్రాశన విధానము

బాలునికి ఆరవ - యెనిమిదవ నెలలోగాని, బాలికకు-ఐదవ, యేడవ నెలలోగాని అన్న ప్రాశనము చేయవలెను. అనగా ప్రథమాన్నభక్షణ సంస్కారము. తండ్రి మంచిలగ్నమందు సుస్నాతుడై వృద్ధి శ్రాద్ధానంతరము, శుచి, అనే పేరు గల అగ్నిని స్థాపించి విరూపాక్ష జపం చేసి, కుశండిక అనే అగ్ని సంస్కార కార్యము చేసేవాడు. తరువాత ప్రకృత కర్మారంభంలో ప్రాదేశ ప్రమాణములైన నేతిలో ముంచిన సమిధలను అగ్నిలో హోమం చేసి

---

దొంగ లోచు తిరుగు / దారలను వెంటాడి ; పట్టి చూపవలయు / ప్రభులకెపుడు అట్టి వారి వలెనె / అవినీతి పెరుగును / భవ్యులార గౌడ / వంశ్యులార ॥

నిర్వర్తిత మహావ్యాహృతి హవనుడై మంత్రోచ్ఛారణ పూర్వకంగా నేతిలో పంచాహుతి హెూమం చేసిన పిదప పంచ ప్రాణ హెూమము మహావ్యాహృతి హెూమాలు చేసితిరిగి నేతిలో ముంచిన సమిధలను హెూమం చేసి ప్రకృత కర్మమును సమాప్తి చేస్తాడు. అటు తరువాత ఉదీచ్యమైన శాట్యాయన హెూమం మొదలుకొని వామదేవ్యగానాంతముగా గల కర్మ చేసి మంత్ర పూర్వకంగా కుమారుని నోటిలో అన్నము పెట్టేవారు. తదుపరి పురోహితులకు దక్షిణలిచ్చేవారు. ఈ కార్యము బాలునికి ఆరవనెలలోనే చేస్తారు. శూన్యతిధులు మొదలైన వానిని వదలి శుక్లపక్షతిథుల యందీ సంస్కారం చేయవలెనని మార్కండేయంలో వుంది. చక్కగా నూతన వస్త్రభూషణాద్యలంకారములతో సుసజ్జితుని చేసిన కుమారుని ఒడిలో కూర్చుండబెట్టుకొని దేవతా సమక్షంలో బంగారు పాత్రతో అన్నం తినిపించి తరువాత తేనె, నెయ్యి, బంగారము కలిపిన పాయసాన్ని పెట్టేవారు. ఈ ప్రకారముగా అన్న ప్రాశన అయిన తరువాత కుమారుని తల్లి ఒడిలో కూర్చుండబెట్టి, దేవతాసాన్నిధ్యంలో సకలశిల్పకళాపదార్థాలు, శస్త్రాస్త్రములు, స్వర్ణాభరణాలు, గ్రంథములు వాటిని వ్రాయు గంటములను అలంకరించిన స్థలము మధ్యలో బాలకుని వదలి, శిశువు స్వయంగా యే పదార్థాన్ని తీస్తాడో అదే అతని వృత్తి యగునని నమ్మి, దాని యందే అతనికి శ్రద్ధ కలిగే టట్టు చేసేవారు.

## గౌడాభినందుడు

ఇతని పూర్వులు గౌడ దేశ నివాసులగుటచే నితడు కాశ్మీరమున నున్న గౌడ విశేషణము యితనికి వచ్చినది. శక్తిపంతుడు గౌడ దేశము నుండి కాశ్మీరమునకు వలస వచ్చినవాడు. అతని మనుమడైన శక్తి స్వామి లలితాదిత్య నృపాలుని మంత్రులలో నొకడు. ఆ రాజు శాలివాహన శకము 617-654 లోని వాడు. ఆ మంత్రి సంతతిలో నైదవ వాడీ గౌడాభినందుడు. ఇతడు గొప్ప సంస్కృత పండితుడు, కవి. ఇతడు రాజశేఖరునకు సమకాలికుడు. బిల్హణ కవి యితనిని తన సూక్తి ముక్తావళిలో పేర్కొని యున్నాడు. కావున నితడు శాలివాహన శకము 800 ప్రాంతము వాడగును.

---

*దొంగలౌచు తిరుగు / దారలను వెంటాడి ; పట్టి చూపవలయు / ప్రభులకెపుడు అట్టి వారి వలెనె ; అవినీతి పెరుగును ; భవ్యులార గౌడ / వంశ్యులార ॥*

ఇతడు బాణుని కాదంబరీ కథను గైకొని కాదంబరీ కథా సారమను పేర ఎనిమిది సర్గల పద్యకావ్యమును రచించెను. అభినవ గుప్తపాదుడు కథా తాత్పర్యమును సర్గ బంధముగా జేయుట కుదాహరణగా దీని పేరెత్తి యిది భట్ట జయంతుని దనెను. అభినందు డనుటకు బదులుగా యితని తండ్రిపేరు పొరపాటుగా బేర్కొన్నాడనుట నిజము. ఏమనగా క్షేమేంద్రుడు తన సువృత్త తిలకములో – "కథా ప్రసంగే యథాభినందస్య" అని యీ కథాసారమునే స్మరించెను.

ఈ కవి సరిగా బాణుని గద్యము ననుసరించి ఈ కృతి నిర్మించెననుటకు ఉదాహరణ.

తస్యాం నిజ భుజోద్యోగ విరాజితారాతి మండలః।

అఖండల ఇవ శ్రీమాన్ రాజా నూద్రక ఇత్యభూత్" అని పేర్కొనియుండెను.

ఇది "సంస్కృతకవి జీవితము" బ్రహ్మశ్రీ మల్లా సూర్యనారాయణ శాస్త్రి గారిచే రచింపబడిన గ్రంథము నుండి గ్రహింపబడినది.

## శంకర భగవత్పాదులకు గురువై అద్వైతవాదాన్ని సృష్టించిన శ్రీ శ్రీ శ్రీ గౌడ పాదా చార్యుల వారి–చరిత్ర

గౌడ పాద పర్వతము : ఋగ్వేదము 10-75లోను, ఐతరేయ బ్రాహ్మణము 8-14-4లోను, బృహద్ధర్మ పురాణము 22వ అధ్యాయంలోను గంగానది ప్రశంస, దాని గమనాదులు వివరింపబడ్డాయి. అరుణోదయదేశం (ఇప్పటి గడవాల్ సంస్థానం) లోని గంగోత్తరీ యన బడే చోట గంగా భాగీరథీ దేవస్థానముంది. దీనిపైన కొంచెం దూరంలో పాండవుల నివాస క్షేత్రం వుంది. ఇదియే పాండవుల చివరి నివాస స్థానం గాను, యిచ్చటి నుండియే ద్రౌపదీ సమేతంగా ధర్మరాజాదులు స్వర్గారోహణ చేసినట్లు చెప్పబడింది.

---

ప్రక్క యింటి వాడు / పట్టెడన్నమునకు / పాట్లు పడుచునుండ బాధ లేద ?
బొజ్జ నిండ తిన్న / భోజనం బదియెంత; దొంగలనమె గాని / దొర తనంబ ?

ఇచ్చటి పర్వత పంక్తికి రుద్ర హిమాలయమని పేరు. ఇందులో ఐదు శిఖరాలున్నాయి. అవి రుద్ర హిమాలయ శిఖరము, బ్రహ్మ శిఖరము, విష్ణుపురి శిఖరము, ఉద్గురు కాంత శిఖరము, స్వర్గా రోహణ శిఖరము అనునవి. ఈ ఐదు శిఖరాలతో గూడిన రుద్ర హిమాలయ పర్వత పంక్తి ధనురాకారంగా వంగి మధ్యను పల్ల మేర్పడి యుండుట వలన అది మంచుచే కప్పబడి గ్లేసియర్ గ (Glacer) నయి మెల్లగా కరుగుచు నీరుగా జారి యివతల వైపున హద్దుగా గట్టు వలె నేర్పడి నిలచి, గోపురాకారంగా నున్న గోముఖ పర్వతం యొక్క ముఖం వలె నున్న తావు నుండి గోముఖమునందలి నోటి యందలి రంధ్రాకార మార్గం గుండా జారి యివతలకు జలపాత రూపంగా బయల్వెడలి చిన్న ప్రవాహంగా నడుస్తుంది. ఇదియే భాగీరథీ గంగ ప్రారంభస్థితి. ఈ హిమ నిలయానికి (Glacer) బిందు రూప సరస్సని పేరు. ఇక్కడ బంగారు, పసుపు పచ్చ ఊదారంగు పూలుండెడివని వాటిని తామర జాతి పూవులని పోల్చారని చెప్పబడింది. ఇచ్చటనే రుద్ర హిమాలయ పర్వత శిఖరంగా నేర్పడియున్న మరొక చిన్న పర్వతానికి "గౌడ పాద" పర్వతమని పేరు. దీని వద్దనే గంగోత్తర దేవాలయం వుంది.

గౌడ పాద పర్వతాన్ని చుట్టి నడిచి తదుపరి కేదార గంగయనే వేరొక ప్రవాహం భాగీరథిని తాకుచున్నట్లు దానికి మిక్కిలి సమీపం నుండి నడుస్తుంది. ఇక్కడనే భగీరథుడు గంగ కొరకు తపస్సు చేసిన చోటని చూపిస్తారు.

మన భరత ఖండంలో యెందరెందరో మహానుభావు లావిర్భవించారు. భగవంతుని సృష్టిలో కొందరు కొన్ని పనులు చేయడానికే సృష్టింపబడతారనేది పరమ సత్యం. అనాదిగా మన గౌడ వంశీయులు సారస్వతాభిమానులై సాహిత్య కళామతల్లికి యెనలేని సేవ చేసి కృతార్థులుగా చిరంజీవులై నిలిచారు. పైన వివరించిన పరమ పవిత్ర గంగాముఖ ద్వారమున గల గౌడపాద పర్వతంపై ద్వాపర యుగారంభంలో తపమాచరించి సిద్ధిపొందిన దివ్యావతారుడు మన గౌడపాదాచార్యులవారు.

---

*కొలత తక్కువగను / కొలిచెడు వారికి; తూకమందు తగ్గ / తూయువారి*
*ఆయువంత తరిగి / అణగారిపోదురు; కవిత విభవులార / గౌడులార //*

గౌడవంశీయు లందరకు ప్రాతఃస్మరణీయుడు, ఆరాధ్యుడైన యీమహనీయుని గురించి మన వారి కంతగా తెలియక పోవుటకు కారణం ఆయన సాహిత్యపరంగా చేసిన కృషి అంతా సంస్కృతంలో నిక్షిప్తమై యున్నందున దీనిని పరిశోధనాత్మకంగా చూచిన గాని లభించుట అత్యంత దుర్లభం. ఈయన సనాతన ధర్మపు విలువలను ప్రచారం చేస్తూ ఉపనిషత్ ప్రామాణ్యాన్ని నమ్మిన వాడు. ఈయన జీవిత చరిత్రను సేకరించుట అత్యంత క్లిష్టమైనా చివరకు తదేక దీక్షతో కాశీ హిందూ విశ్వవిద్యాలయ గ్రంథాలయం, కలకత్తాలోని నేషనల్ సెంట్రల్ లైబ్రరీ, మద్రాసులోని కెన్నమెరా లైబ్రరీ, గోరఖ్ పూరు గీతా ప్రెస్ మొదలుగాగల అనేకానేక గ్రంథాలయాలు దర్శించి సంక్షిప్తంగా నైనా కొంత విషయం సేకరింప గల్గినందుకు సంతసిస్తున్నాను. నా పరిశోధన మూలంగా ప్రాచీన గౌడుల చరిత్ర సేకరించి మీకందీయ గల్గినందులకు, నా శ్రమ ఫలించినట్లుగా భావించి ఆనందిస్తున్నాను.

**గౌడపాదుని జననము :** నర్మదానదీ తీరంలో నున్న సుఖ దేవర్షి ఆశ్రమ సమీపంలో నున్న భూపాల గ్రామంలో విష్ణు దేవుడను మహాత్ముడు గుణవతియను సాధ్వీమతల్లిని వివాహమాడి యుండెను. ఈ పుణ్య పురాణ దంపతుల నోముల పంటయే మన గౌడపాదుడు. ఈయనకు తండ్రి "సుఖదత్తు"డని నామకరణం చేశాడు. ఈ సుఖదత్తునికి తండ్రియే గురువై బాల్యమునందే సకల శాస్త్రాలు బోధించాడు. యుక్త వయస్కుడైన పిమ్మట తల్లి దండ్రులు వివాహ ప్రయత్నం చేశారు. కాని పరచింత నాభిలాషియైన సుఖదత్తుడు వివాహానికి అంగీకరింపక యింటి వద్ద వుంటే వివాహం చేసికొమ్మని ఒత్తిడి చేస్తారని తలంచి మాతృదేశ మైన గౌడదేశం వెళ్ళి అక్కడ నున్న వేదాంత శిరోమణియైన జిష్ణు దేవుండనే తపస్వి నాశ్రయించి ఆయన గుహాముఖంబున ఆయన దయను గోరి దీర్ఘకాలం తపస్సు చేశాడు. సుఖదేవర్షి ఆశీర్వాద బలంతోనే యీ మహామహుడుదయించాడు. యీయన తండ్రి విష్ణు దేవుడు సుఖదేవుని గురువుగా ఆరాధించే వాడు. ఆకారణంగానే తండ్రి యీయనకు సుఖదత్తుడని పేరుపెట్టాడు. ఈయనలోని పరమార్థ చింతనకు, యీయన యేకాగ్ర, నిష్కపట తపస్సుకు సంతసించిన

---

*బ్రతికి చెడ్డ వారి / బ్రతివారు వేధించి ; నీతులెన్నొ చెప్పి / నింద వేసి ఆదరింపరారు / అదలించుటే గాని ; గళిత గర్వులార / గౌడులార /*

జిష్ణుదేవుడొక మహామంత్రాన్నుపదేశించాడు. ఆ మంత్రాన్ని విధి విధాన పూర్వకంగా జపించి తపస్సిద్ధిని పొందగా యాయనకు - "గౌడ పాదుడ" నే పేరు పెట్టాడు. పాదుడనగా నెలకొన్నవాడు నిలచిన వాడు. గౌడ జాతి పేరు ప్రఖ్యాతులు నిలబెట్టు వాడని అర్థము. ఈ పేరుతోనే యీయన ప్రసిద్ధుడయ్యాడు.

జగజ్జనని సాక్షాత్కారం : ఆధ్యాత్మిక దివ్యాను భవ సంపత్తిని తన సొమ్ముగా చేసికొన్న యీ మహనీయుడు శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించి నిత్యము పర దేవతారాధన చేస్తుండేవాడు. కొంత కాలానికాయన అమోఘ తపశ్శక్తి ఫలితంగా జగజ్జనని దివ్య సాన్నిధ్య సాక్షాత్కారాన్ని పొంది తన మహిమ వలన శంకర భగవత్పాదులకు దేశికుడైన గోవింద భగవత్పాదులవారికి గురువై మహోన్నత శిఖరాన్నధిరోహించాడు. తదుపరి యీయన గంగోత్తరకి పశ్చిమ దిశగా నున్న పర్వతాగ్రం మీద తపస్సు చేసి సిద్ధుడైనందున ఆ పర్వతానికి "గౌడపాద పర్వత" మనే పేరు వచ్చింది. ఈ విషయాలన్నీ హు అన్ చ్యాంగ్ కు పూర్వుడగు భావవివేకుడనే పండితుడు రచించిన "తర్కజ్వాల" అనే గ్రంథంలో క్రీ.శ. 550 ప్రాంతమున నున్న గౌడపాదుని కారికల (సూత్రాది వివరణ శ్లోకములు ) లో ఉద్ధృతములని వ్రాయబడింది.

ఈయన పాండవ వంశోద్భవుడైన పరీక్షిన్మహారాజుకు శ్రీ మద్భాగ వతాన్ని అద్వైత బ్రహ్మతత్వంగా వుపదేశించాడు. శ్రీ శంకర భగవత్పాదులకు గురువైనందున ఆయన గౌడ పాదు నెల్లప్పుడు - " వేదాంత విద్యధిరాచార్యై " అని స్మరించేవాడు.

ద్వాపర యుగారంభం నుండి హిమాలయములందు సమాధి అవస్థలో వుండుట వలనను, ఆయనను గురించిన ప్రచారం లేనందు వలనను, ప్రజలాయనను మరచి పోయివుందురని తలంపవలసి వస్తుంది. జగద్గురువు ఆదిశంకరులు తన - "రత్నమాలాస్తవ" మనే గ్రంథంలో తన గురువగు గౌడపాదునికి గ్రీకు దేశీయులతో సంపర్కముండేదని, యీయనకు "అపోలోనియస్" అనే త్యానా దేశపు రాజకుమారుడు శిష్యుడుగా వుండేవాడని

---

*చెడి బ్రతికిన వారి / చెడుగంత పోనాడి ; చెప్పుచుండ్రు వారి / గొప్పలన్ని*
*డబ్బు లేక యున్న / డబ్బుకు కొరగారు ; గౌడులార కీర్తి / కలితులార /*

వ్రాశాడు. శంకరులకు గౌడపాదుడు ఆరాధ్య దేవుడు. గౌడ పాద నిరచితములైన అద్వైత సిద్ధాంతాలనే శంకర భగవత్పాదులు సమన్వయ పరచుకొని, స్వంతము చేసికొని అద్వైత మతస్థాపనాచార్యుడయ్యాడు. గౌడ పాదీయ దర్శన శాస్త్రమే యీ మతానికి మూలాధారం. ఈ కారణంగానే శంకరాచార్యులు గౌడపాదుని పరమ గురువుగా పూజించేవాడు.

## గౌడపాదుని వ్యక్తిత్వము

ఈయన ఉపనిషత్తుల ప్రామాణ్యాన్ని నమ్మి వాటిలో చెప్పబడిన ధర్మాల్ని నిత్య నైమిత్తిక కార్యాల్లో ప్రవేశపెట్టి తూ.చ. తప్ప కుండా ఆచరించేవాడు. కాని బౌద్ధ సిద్ధాంతాలీయన బుద్ధికి ప్రతిపన్నాలుగా కనిపించేవి. విజ్ఞాన వాదం, శూన్య వాదాదులను, అకుంఠిత తర్క విజృంభణములైన వాటిని త్రోసివేయరాదని, వేదాంతి యెవడును ఉపనిషత్తులకు విరుద్ధంగా నున్న సిద్ధాంతాల్ని అంగీకరింపలేదని వాదించేవాడు. తన కారికలలో గౌడ పాదుడు ఉపనిషదనుయాయులు తర్క సహాయంతో వేదాంత వాక్యాల్ని అనుసంధానం చేసి వాటి నుండి చేసిన నిగమములు బౌద్ధ దార్శనికులను భాధింపవని చూప ప్రయత్నించాడు. సత్యము -సత్యాన్ని బాధింపదని ఆయన విశ్వాసం. ఐతరేయ, తైత్తిరీయ, బృహదారణ్యకాల ఆధారంపై ఆత్మ (అనగా విజ్ఞానం) ఒక్కటే సత్తు అనియు, అదియే తన మాయచేత భేదాల్ని కల్పించుకొని తనకుతానే యెరుకపడుచున్న దనేది గౌడపాదుని సిద్ధాంతం. స్వప్నముచే మాయ చూడబడినట్లు, వేదాంతంచే యీ విశ్వం చూడబడిందని, స్వప్న పదార్థాల అభావాన్ని శ్రుతి చెప్పింది. నానాత్వమనే దిక్కడ లేశమాత్రం కూడా లేదు. ఒకటియే మాయచే అనేకంగా కన్పిస్తుంది. అజాయమాన (పుట్టనిది) మగునదియే మాయచే అనేకంగా జాయమాన (పుట్టినది) మగుచున్నదని శాస్త్రం చెప్తుంది. ఇదంతా యెక్కణ్ణుంచో వచ్చింది కాదు. మార్పు చెందిందేమీ లేదు. అనేది సంభవమగుట (మార్పు కార్యవర్గము) శ్రుతి చేత ప్రతిషేధింపబడింది.

ఇది కాదు - ఇది లేదనేది అగ్రాహ్యమవడం వల్ల ఆత్మ యందు భావాల్ని

---

డబ్బు లేని వారి / యిబ్బందులవి యెన్నొ; సానుభూతినైన / చాటరారు
పూవులమ్ము చోట / పుల్లలమ్మగ లేరు; భవ్యులార గౌడ / వంశ్యులార ॥

నిషేధించి దాని అజత్వాన్ని (పుట్టుకలేని తనాన్ని) శ్రుతి విపులీకరించి ప్రకాశవంతంగా చేసింది. సత్తు అనేది నిజంగా పుట్టదు. మాయచేతనే అది పుడుతుంది. స్వప్నావస్థలో ఒకే మనస్సు రెండుగా నయినట్లు జాగ్రదవస్థ యందు కూడా అదే ద్వయము (గ్రాహ్య-గ్రాహక రూపం)గా భాసిస్తుంది. కాబట్టి దీని సారాంశమేమనగా జీవుడనే వాడెవడును పుట్టలేదు. బంధనంలో కూడా యెవడూ లేదు. (దీన్ని అజాత వాదమంటారు)సాధనా లేదు - ముక్తి లేదు. అందువల్లనే జీవాత్మల అనన్యత్వం ప్రశంసింపబడి నానాత్వం ఉపనిషత్తులచే నిందింపబడింది. వేదపారగులు, వీత రాగ భయ క్రోధులు నగు మునులచే ప్రపంచోపశమనము, అద్వయము, నిర్వికల్పమైన ఆత్మ చూడబడింది. ద్విపదాంపరుడైన బుద్ధుడు, బౌద్ధ అద్వయ వాదులీ అజాతి వాదాన్నేఖ్యాసించారు. గనుక వేదాంతులమైన మాకు వారితో వివాదం లేదని గౌడపాదుడు గట్టిగా నొక్కి చెప్పాడు.

గౌడపాదుడు శంకరుల గురువైన గోవింద పాదులకు ఆచార్యుడని నిర్ణయింపబడింది. ఈయన క్రీ.శ. 7వ శతాబ్దం చివర 8వ శతాబ్దం ప్రారంభంలోని వాడని చరిత్ర కారులు నిర్ణయించారు. గౌడ పాదుని మాండూక్యోపనిషత్ కారికల భాష్యానికి టీకావ్రాస్తూ ఆనందగిరి యనునతడు"శ్రీ గౌడ పాదాచార్యుల వారా పూర్వపు దినాల్లో నరనారాయణుల వాసస్థానమైన బదరికా శ్రమంలో భగవధ్యాననిమగ్నుడై తప మాచరించారని, నారాయణుడాయన భక్తికి సంతోసించి ఉపనిషత్ప్రతి పాదకమైన బ్రహ్మజ్ఞానానుభూతిని ప్రసాదించెనని" వ్రాశాడు.

బాలకృష్ణానంద సరస్వతి 17వ శతాబ్దంలో తాను రచించిన - "శారీరక మీమాంసా వార్తికమున" గౌడపాదులను గూర్చి- "కురుక్షేత్రమనే దేశంలో హిరావతి (హిరణ్యవతి) నదీ తీరమున గౌడులనే ప్రసిద్ధి కెక్కిన ఒక జాతి ప్రజలు సురాకరణ వృత్తిచే నివసిస్తూ వుండే వారని వారి వంశీయుడైన శ్రీ గౌడ పాదచార్యులవారు ద్వాపర యుగారంభంలో గొప్ప తపస్సు చేశాడని వ్రాశాడు.

---

బ్రతుకు భారమయ్యె / పనులు దొరకవయ్యె ; తిండి కొరకు గాదె / తిప్పలన్ని
తిండి పెట్టి యెదురు / దెప్పు చుందురొకరు ; కలిత విభవులార / గౌడులార ॥

**మాండూక్యోపనిషత్తు - కారికలు :** గోరఖపూర్ గీతా ప్రెస్ వారు ప్రచురించిన మాండూక్యోపనిషత్ గ్రంథభూమికలోని కొంత హిందీ భాగానికి నా ఆంధ్రానువాదం యీ క్రింది విధంగా వుంది.

మాండూక్యోపనిషత్తు అనేది అధర్వ వేదీయ బ్రాహ్మణ భాగాంతర్గతమైనది. ఇందులో 12 సూత్రాలున్నాయి. గ్రంథపుటలను బట్టి యిది ఉపనిషత్తులన్నింటిలోను చిన్నది. కాని దీని మహత్వం దేనికీ తక్కువ కాదు. భగవాన్ గౌడపాదాచార్యుడు దీనికి కారికలు వ్రాసి దీని మహత్వాన్నింకా యినుమడింపజేశాడు. కారికలు-శంకర భాష్య సహితమైన యీ ఉపనిషత్తు అద్వైత సిద్ధాంత రసికులకు పరమ ప్రమాణ ఆదరణీయ గ్రంథం. కారికలను అద్వైత సిద్ధాంతం యొక్క ప్రథమ నిబంధమని చెప్పారు. ఈ గ్రంథాధారంతోనే భగవాన్ శంకరాచార్యులు అద్వైత మందిరాన్ని స్థాపించాడు. ఎందుకనగా అద్వైత సిద్ధాంతం అనాదియైనది గనుక దానికి సాంప్రదాయక మతవాద రూపం ప్రాప్తించింది. దీని ప్రధాన శ్రేయస్సు ఆచార్య వర్యుడైన భగవాన్ శంకరునిది. దాని మూలగ్రంథం గౌడ పాదీయ కారికలు.

కారికా కారుడైన భగవాన్ గౌడపాదా చార్యుని జీవితము, ఆయన జీవిత కాలము విశేషాల విషయమైన వివరణ కొంత వరకు పైన వివరించాను. బెంగాల్ నందలి "వేదాంత దర్శనేర ఇతిహాస" మనే గ్రంథం వ్రాసిన శ్రీ ప్రజ్ఞానానంద సరస్వతి స్వామీజీ అనునతడు గౌడపాదుడు-గౌడ దేశీయుడు (బెంగాలీ) అని వ్రాశాడు. ఈ విషయంలో దానిలో నైష్కర్మ్య సిద్ధికారుడు భగవాన్ సురేశ్వరాచార్యుని యీ క్రింది శ్లోకం ప్రమాణపూర్వకంగా గ్రహింపబడింది.

ఏవం గౌడై ర్ద్రావిడైర్నః పూజ్యైరర్థః ప్రభాషితః ।
అజ్ఞాన మాత్రోపాధిః సన్నహ మాది దృగీశ్వరః । ( 4-44)

ఈ ప్రకారంగా సాక్షాత్తు భగవంతుడే అజ్ఞానోపాధికుడై అహంకారాదుల సాక్షి (జీవుడు) యై వున్నాడు. ఆ పరమార్థ తత్వాన్ని మన పూజనీయ గౌడదేశీయ మరియు ద్రవిడ దేశీయ ఆచార్యులు వర్ణించారు. ఇక్కడ గౌడ

---

ధనము కూడ బెట్టి / దాచు కొనగలేక ; దొడ్డ దారి వచ్చి / వడ్డీ కిచ్చి
వడ్డీ అసలు గుంజి / దొడ్డవాడగు చుండె; గళిత గర్వులార / గౌడులార ॥

దేశీయ ఆచార్యుడు గౌడ పాదాచార్యుల వారని, ద్రవిడ దేశీయ ఆచార్యుడు శ్రీ శంకరాచార్యుల వారని చెప్పబడింది.

గౌడ పాదాచార్యుడు వివాహాన్ని త్యజించి సన్యాసి అయ్యాడు. ఈయన శిష్యుడు గోవింద పాదాచార్యుడు: గోవింద పాదాచార్యుని శిష్యుడు భగవాన్ శంకరాచార్యులు. శాంకర సంప్రదాయంలో ఏ ఆచార్యుడు వందనాత్మక మంగళాచరణ ప్రసిద్ధుడో అందు ఆరంభనుండి శ్రీ పద్మపాదాచార్యాది భగవాన్ శంకరుని యొక్క శిష్యపర్యంతం యీ సంప్రదాయం యొక్క ఆచార్యుల శిష్య పరంపర యీ విధంగా చెప్పబడింది.

**నారాయణం పద్మభవం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ ।**
**వ్యాసం సుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్ర మథాస్య శిష్యమ్ ।**
**శ్రీ శంకరా చార్య మథాస్య పద్మపాదం చ హస్తా మలకం చ శిష్యమ్ ।**
**తం త్రోటకం వార్తిక కార మన్యాన స్మద్గురూన్ సంతత మానతోఽస్మి ।**

శాంకర సంప్రదాయ మందు శాస్త్రాధ్యయనానికి పూర్వం ఆచార్యుడు – శిష్య గణం ఈ మంగళాచరణం పఠిస్తారు. దీని వలన శ్రీ గౌడ పాదాచార్యుడు భగవాన్ సుకదేవర్షి యొక్క శిష్యుడని మనకు విదితమైనది. భగవాన్ గౌడపాదాచార్యుని గ్రంథములందలి ఆయన కారికలు జగత్ప్రసిద్ధములైనవి. ఈయన భాష్యం వ్రాసిన మరొక గ్రంథం ఉత్తర గీత. దీన్ని వాణీ విలాస్ ప్రెస్, శ్రీరంగం వారు ప్రచురించారు. ఆ భాష్యంతో ఆయన మహాయోగి అని స్పష్టపడుతుంది. ఇవి గాక యీయన వ్రాసిన మరొక గ్రంథం సాంఖ్య కారికల భాష్యం కూడా ప్రసిద్ధమైనదే.

గౌడ పాదకృతమైన యీ కారికలు గొప్ప ఉదాత్తము మరియు మర్మస్పర్శిని యైనవని యీయనను ప్రపంచ మందలి సర్వోత్కృష్ట సాహిత్యమందు గణన చేశారు. ఏ విధంగా శ్రీమద్భగవద్గీత విషయంలో "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః" అని నిర్ణయించ బడిందో అదే విధంగా అద్వైత బోధ కొరకు యీ గ్రంథ రత్న మొక్కటియే శరణ్యము. ఇందులో సాధన, సిద్ధాంతం, పరమత

---

డబ్బు అప్పు యిచ్చి / ఉబ్బించి ఋణదాత ; నోటు వ్రాసి తెచ్చి / చేటుతలచి
కుదువ బెట్టుకొన్న / కోర్టున కీడ్పించు ; గౌడులార కీర్తి / కలితులార ॥

నిరాకరణ, స్వమత సంస్థాపనాదులన్నింటిని శాస్త్ర సమ్మతంగా, యుక్తి యుక్తంగా వర్ణించారు. ఈ గ్రంథ మొక్కటియే ముముక్షువులను పరమపదాన్ని పొందేటట్లు చేస్తుంది.

## గౌడ పాద విరచిత మాండూక్య కారికల ప్రాశస్త్యము

ఇందులో మొదటిది – ఆగమ ప్రకరణము – ఈ ప్రకరణలో సత్యరూపాన్ని గూర్చి వ్రాయబడిన తన భావాన్ని శ్రుతి సమ్మతం సహేతుకమని నిరూపించాడు.

రెండవది – వైతథ్య ప్రకరణము – ఇందులో తర్క-వితర్కాల ద్వారా నానాత్వంతో గూడిన ప్రపంచ వైఖరిని – సుఖదుఃఖాలను వివరించాడు.

మూడవది – అద్వైత ప్రకరణం – ఇందులో జీవోత్పత్తి, ఆత్మ యొక్క అసంగత్వము, ఆత్మైకత్వ సమీక్ష స్వప్న – జాగృతులు, తత్త్వబోధ, శాంతవృత్తి స్వరూపం, సుషుప్తి, సమాధుల భేదం, బ్రహ్మ స్వరూపం, మనోనిగ్రహాదుల వివరణ వుంది.

నాల్గవది – అద్వైత దర్శన, ద్వైత వాదుల పారస్పరిక విరోధము, జీవుని యొక్క జరామరణాదులు గుర్తించుటలోని దోషము, అజాతవాద నిరూపణ, బాహ్యార్థ వాద నిరూపణ, విజ్ఞానవాదన ఖండన, ప్రపంచం యొక్క అసత్యత్వ హేతవు, స్వప్నం యొక్క మిథ్యాత్వ నిరూపణ, సన్మార్గ గాములైన ద్వైత వాదుల గతి, పరమార్థవస్తువేది? ఆత్మ యందు కార్య-కారణ భావమెందుకు అసంభవము, హేతు ఫల భావం యొక్క అభినివేశం యొక్క ఫలము, ఆత్మ యొక్క స్వాభావిక స్వరూపాదుల గురించి వ్రాశాడు. కొరివి కట్టెను చేత్తో గుండ్రంగా త్రిప్పితే ఏవిధంగా నిప్పు గుండ్రని వలయాకారం గల చక్రంలా కనిపిస్తుందో అదే విధంగా ప్రపంచ వ్యవహారమంతా అనగా జనన మరణాదులు, మాతా పితాది బాంధవ్యజనము, హితులు, అహితులు మొదలైనవన్నీ భ్రాంతి యని వివరించాడు..

**గౌడపాదుని యితర రచనలు :** (1) పైన వివరించిన ఉత్తర గీతాదుల

---

దానధర్మమంచు / దాతృత్వమును చూపి ; గుడులు బడులు గట్టి / గొప్పగాను
నల్లధనము నంత / తెల్లగా మార్చును ; మాయ మాటలాడు / మంత్రి గాళ్ళు //

భాష్యం, (2) నృసింహ తాపినీ ఉపనిషత్తు (3) దుర్గా సప్తశతికి టీకా (4) శుభగోదయమనే శాక్తేయ గ్రంథము (5) శ్రీ విద్యారత్న సూత్రము.

ఈ రచనకు ఆధారాలు :

(1) విధురేశ్వర భట్టాచార్య గౌడపాదీయ ఆగమ శాస్త్రము

(2) T.M.P., మహాదేవన్ కృత ఫిలాసఫీ ఆఫ్ గౌడపాద

(3) పండిత గోపీనాథ కవిరాజ కృత బ్రహ్మసూత్ర శాంకర భాష్యపు భూమిక.

## గౌడ డిండిమ భట్టు–చరిత్ర

గౌడ దేశ ప్రజలందరూ సురాకరణవృత్తి చేయుచు మాతృదేశనామంతో గౌడులుగా ప్రసిద్ధి చెందారు. వారిలో వేద–శాస్త్ర–పురాణేతిహాసాదులు నేర్చిన వారు బ్రాహ్మణులుగా పిలువ బడేవారు. నేటి ఆధునిక సమాజంలో క్షత్రియ బ్రాహ్మణులు, కమ్మ బ్రాహ్మణులు, విశ్వ బ్రాహ్మణులు (కంసాలులు) మొదలగు వారు కుల వృత్తితో బాటు పౌరోహిత్యాది కార్యక్రమాలు చేస్తూ బ్రాహ్మణులుగా పరిగణింప బడినట్లు ఆనాడు కూడా చదువరు లెల్లరు బ్రాహ్మణులుగా గణింపబడ్డారని తెలియుచున్నది. మరియు భట్టు అనే పదం జాతి వలన బ్రాహ్మణులైన వారి కుండదు. ఇది శూద్రులకే పరిమితమైనది. ఉదా – రామరాజ భూషణుడు – భట్టుమూర్తిగా విజయనగరాధీశ్వరుల కాలంలో శ్రీ కృష్ణదేవరాయల ఆస్థాన అష్ట దిగ్గజాలలో ఒకడుగా వుండేవాడు, గనుక భట్టు అనేది శూద్రులకే పరిమితమైనదనుట సమంజసము. నన్నయ్యభట్టు శూద్రుడనే వాదం కూడా వుంది. ఈ డిండిములు నలుగురుండేవారు. వీరందరు కవిసార్వభౌములే. 2వ డిండిమభట్టు "యోగానంద ప్రహసన" మనే ఒక రూపకం వ్రాశాడు. అందులో తన వంశం గురించి యీ క్రింది విధంగా వ్రాసుకున్నాడు–

" అస్తి ఖలు గౌడేషు పరియేంద్ర పురాగ్రహార నాయక మణేః సామవేద సాగర సాయాంత్రి కస్య, అష్ట భాషా కవితా సామ్రాజ్యాభిషిక్తస్య బళ్ళాళ రాయ

*వాతయుండడెందు । దంభవాక్కులె గాని; యివ్వలేదు పైస । యేరికయిన*
*నిజము పల్కువాడు । నిందలపాలౌను ; కలిత విభవులార । గౌడులార ॥*

కటక కవికుల గర్వ పర్వత పదేః నాగణకవి గజకేసరిణః శ్రీ కవిప్రభోః పౌత్రః పుత్రశ్శ్రీ రాజనాథ దేశికస్య, బ్రహ్మాండ భాండ పిచండ మండలిత విజయ డిండిమ చండిమ్నః, శ్రీ కంఠాగమ శిఖండ మండన మణేః శ్రీ డిండిమ ప్రభోర్దౌ హిత్రః శ్రీమదభిరామ నాయకాస్తనంధయః, సభాపతి భట్టారకాచార్య భాగినేయః, శ్రీ డిండిమ కవిసార్వభౌమ ఇతి ప్రథిత బిరుదాంకిత నామధేయః, సరస్వతీ ప్రసాదలబ్ధ కవితాసనాథః; శ్రీ మానరుణ గిరినాథః తేన కృతేన యోగానంద నామ్ని ప్రహసనే సభానియోగ మని తిష్ఠామి-

పై వాక్యమువలన నీయోగానంద ప్రహసనకర్త డిండిమ కవిసార్వభౌముడని, బిరుదాంక నామధేయముగల అరుణ గిరినాథుడను గౌడ బ్రాహ్మణుడని తెలియుచున్నది. మరియు నాతని పితామహుడు కవి ప్రభుడనియు, అతడు బల్లాళ (దోరసముద్రము) రాయాస్థాన కవీశ్వరుల గర్వమణంచిన వాడనియు, నాగణయను కవీశ్వరునోడించిన వాడనియు, తండ్రి రాజనాథ దేశికుడనియు, మాతామహుడు డిండిమ ప్రభుడనియు, నాతడును విజయ డిండిమము గలవాడనియు, శైవ వేద పారంగతుడనియు, తల్లి అభిరామ నాయక యనియు, మేనమామ సభాపతి భట్టారకాచార్యుడనియు విశదమగుచున్నది. శ్రీ కంఠాగమపారంగతుడై విజయడిండిమము నార్జించిన మాతామహుని యొద్ద నుండియే యీ యోగానంద ప్రహసనకర్తకు "డిండిమ కవి సార్వభౌమ" బిరుదమును విజయ డిండిమమును లభించినవి. ఈతని పితామహుడే ప్రఖ్యాత కవీశ్వరుడుగా కీర్తింపబడెను. తండ్రియట్టి వాడుగా వర్ణింపబడియుండలేదు. పై రూపకములో కొన్ని చోట్ల అప్పటి రాజు దేవరాయలుగా తెలుపబడియున్నది. భరతవాక్యమున - "దీర్ఘాయుర్దేవరాయో దధతు వసుమతీ చక్రమాచంద్రతారకమ్" అని వుంది. కనుక నీతడు దేవరాయలను పేరు గల విద్యానగర ప్రభువు ఆస్థానమున నుండినట్లు నిర్ధారింపబడినది. దేవరాయలను పేరు విద్యానగర ప్రభువు లనేకుల కుండినను, ద్వితీయ హరిహర రాయల కుమారుడగు దేవరాయల యందును, తరువాత నాతని మనుమడగు దేవరాయల యందును రూఢముగా కనబడుచున్నది. రెండవ దేవరాయలకు ఇమ్మడి దేవరాయలని,

---

కట్న మీయలేక। కన్యల పెండ్లిండ్లు ; చేయనేరకున్న। చేర దీసి
స్నేహ బలము చూపి। చే యూత నీయుడీ ; కలిత సుగుణులార। గౌడులారా!

ప్రౌఢ దేవరాయలని, ప్రతాప దేవరాయలని, నామాంతరములు గలవు. యోగానంద ప్రహసనమున బేర్కొనబడిన దేవరాయలిర్వురును, దేవరాయలలో నొక్కడై యుండవలెను. రెండవ దేవరాయలే కాదగు ననుట కొక యాధారము గలదు. సంస్కృతమున నిమ్మడి దేవరాయలు రచించి నట్లుతని పేర "మహానాటక సుధానిధి" యను నొక యింపయిన కావ్యముంది. అందులోని యీ శ్లోకం చూడండి.

శ్లో॥ అగ్రే డిండిమ తాడనం తత ఇతో వంది ప్రజోద్ఘోషణం
ద్విత్రాశ్చిత్ర పటాః కిం యతి బిరుద ప్రోతాని పద్యాని నః
అస్థాంతావ దిదం మహేశ మకుటీ కోటీర కల్లోలినీ
కల్లోల ప్రతిమల్ల సూక్తి విభవైర్వ్యేష్య న్విజేష్య మహే ।

దీని వలన నిమ్మడి దేవరాయల కాలమున డిండిమ భట్టారకుడుండినట్లు తెలుచున్నది.

అరుణ గిరినాథునకు రాజనాథ దేశికుడను కుమారుడు గలడు. ఈతనికి డిండిమ కవి సార్వభౌముడని బిరుద నామము సంక్రమించినది. ఈతడే సాళ్వాభ్యుదయ మను పదునాల్గు సర్గముల మహాకావ్యమును రచించినవాడు. క్రీ.శ. 1490 ప్రాంతంలో విద్యానగర రాజ్యాన్ని వశపర్చుకొని పాలించిన సాళ్వగుండ నరసింహరాయల ప్రభావము లిందు వర్ణింపబడినవి. ఈ కావ్యంలోని ప్రతి సర్గాంతంలోను గద్యములు భేదించుచున్నవి. వాటిలో కొన్ని యీ క్రింది విధంగా వున్నాయి.

4వసర్గ – బిరుదకవి ప్రపితామహ, 5వసర్గ – దశరూపనారాయణ బిరుదమండన, 6వసర్గ – రసిక కవితా సామ్రాజ్య లక్ష్మీపతి – 8వసర్గ – నవనాటక భరతాచార్య, 10వ సర్గ – కవి మల్ల గల్ల తాడన పటు, 11వ సర్గ – ప్రతిభట కవికుంజర పంచానన బిరుద మండన, 12వ సర్గ – చేర –చోళ–పాండ్య – ప్రథమారాధ్య హృదయ శివాభిఖ్య డిండిమ కవి సార్వభౌమ బిరుద శోణాధి నాథాత్మజ, 14వసర్గ ద్వాదశ దేశ్య వృత్తిపార దృశ్వాశోఽష్ట భాషా పరమేశ్వరస్యాభి

---

పుష్పవతులయినను / పూని పెండ్లియె కాని ; పేద వారి జూచి / ప్రేమ తోడ
చేయవలయు పెండ్లి / జేరి వరుని దెచ్చి ; గలిత గర్వులార / గౌడులార ॥

నవనాటక భవభూతేర్మాఘాద్యతి వర్తి చిత్ర ప్రబంధ పరమేశ్వర స్యాష్ట దిగ్విజయ పటహీ కృత బిరుద డిండిమాడంబరస్య, షడ్దర్శన షణ్ముఖస్య, శైవ శాస్త్ర జీవాతో రఖిల వేదసాగర, సాయాంత్రికస్య – డిండిమ కవి సార్వభౌమ ఇతి కృతాపర బిరుద నామ్నః శ్రీమదరుణ గిరీశస్య తతః పాకస్య డిండిమ కవి రాజనాథస్య కృతౌ శ్రీ సాళు సాభ్యుదయే " –

ఇతడు గద్యములందు ప్రపితామహుని, తర్వాత తండ్రిని, ప్రఖ్యాత కవీశ్వరులను వర్ణించెనే గాని పితామహుని పేర్కొనలేదు. ఈయన తండ్రియగు అరుణ గిరినాథుడును తన ప్రహసనమున పితృనామస్మరణము మాత్రము కావించెను. కాని యాతడు విద్వాంసుడని వర్ణింపలేదు. తన తండ్రియగు 2వ డిండిమ భట్టారకుని పాండిత్య ప్రభావము నాతడు గద్యములందు మిక్కిలిగా కీర్తించెను. తత్తద్విషయములు తెలుగున వివరించుట చర్విత చర్వణమగునని వదలెను. చేర-చోళ-పాండ్య దేశములందాతడు పరమారాధ్యుడట! అష్టభాషా పరమేశ్వరుడట ! అష్ట దిగ్విజయ పటహమగు బిరుద డండిమాడంబరము గలవాడట । సాళ్వాభ్యుదమును రచించిన యీ మూడవ డిండిమభట్టారకుని కుమారుడు అరుణ గిరినాథుడు. ఇతనికి "కుమార డిండిము"డని బిరుదు గలదు. వీర భద్ర విజయమను పేరుగల డిమము నీతడు రచించినాడు. కొన్ని ఉదాహరణలు –

"సూత్ర – శృణు తావత్ సంతి ఖలు సంతత శివలింగా రాధన ప్రతినో, గంగాతటాలంకార గౌడ దేశ చూడావేడ పరేంద్రాగ్రహార నాయక మణయః శైవాగమ జీవాతవః, చేర-చోళ – పాండ్య శిష్యకుల సంస్కృత మహి మానస్వామ వేద సీమానః । శ్రౌతాచార పూతాత్మనః, పవిత్రతర గౌతమ గోత్ర జన్మానో, ద్విజన్మానః...... తదన్వ వాయార్ణవ పూర్ణ చంద్రస్య నాగణకవి గజ కేసరిణః, సరస కవితా సామ్రాజ్యానుభోగ సార్వభౌమస్య, కవి ప్రభోః వృత్త రాజన్య పౌత్రః, పరమ మాహేశ్వరస్య, పవిత్ర తర చరిత్రస్య, శివ తత్త్వ జ్ఞాన శీలస్య శ్రీమతో రాజనాథస్య పురాతన పుణ్య పరిణామస్య మభూద భూత పూర్వ చతుర్విధ కవితా స్వర్లోక సరిత్కల్లోల మాలా.... ప్రచండ తర కాహల ఘంటా డిండిమ

దేవళంబులందు । దేవి దేవతలకు ; మ్రొక్కు బడుల పేర । రొక్క మిచ్చి
రాతి బొమ్మలకును । చేతురు పెండ్లిండ్లు ; గౌడులార కీర్తి । కలితులార ॥

విరచిత బిరుదఘోషణో డిండిమకవి సార్వభౌమా పరమా నామ్నా శ్రీమానరుణ గిరినాథోనామ ఇత్యాది......

*గ్రంథాంత గద్యము –*

"బిరుద కవి పితా మహస్య, బిరుద డిండిమ వ్యాజ సంతాడిత వియత కవి గండ మండలస్య, డిండిమ కవి సార్వ భౌమస్య, శ్రీమతో అరుణగిరి నాథస్య, పౌత్రేణ విచిత్ర తర చిత్రహ యమక కావ్యధూర్య హోస్య అప్రతి రూపబహు రూపక సృష్టి కౌశల పరమేష్ఠినః పరమ మాహేశ్వరస్య చతుర్విధ కవితా చాతుర్య ధుర్యస్య, రాజనాథా చార్యస్య, పుత్రేణ పవిత్ర తమ గౌతమ గోత్రేణ, గంగా తటాలంకార గౌడ దేశాలంకార రత్నాపీడ పై రం·ద్రగ్రహార మౌళిమణి నా దుర్గాదేవీస్తనంధ యేన షడ్భాషా సార్వభౌమేన కుమార డిండిమ కవినా అరుణగిరి నాథేన ప్రణీతే –

ఈ రెండవ అరుణ, గిరినాథుడు (కుమార డిండిముడు) వీరనరసింహ రాయల కాలమందును, శ్రీ కృష్ణదేవరాయలవారి కాలమందును నున్నవాడగును. ఇతని తండ్రి రాజనాథుడు. సాళ్వగుండ నరసింహరాయల కాలమందున్నట్లు కుమార ధూర్జటి కవి రచించిన కృష్ణరాజ విజయమను ప్రబంధము తెలుపుచున్నది.

ఈ నాల్గవ డిండిమ భట్టారకుని కుమారుడు రాజనాథుడు. ఈతడచ్యుత దేవరాయల ఆస్థానంలో కవీశ్వరుడుగా నుండెను. అచ్యుత రాయాభ్యుదయమనే కావ్యం యీయన వ్రాసినదే.

పైన వివరించిన డిండిమ భట్టారకుల వంశవృత్తాదికమును తెలుపు గ్రంథమొకటి "విభాగ రత్నమాల" యని కలదు. అది డిండిమ వంశజులు రచించినది. పైన వర్ణింపబడిన డిండిమ భట్టారకులలో శ్రీనాథ కవికి ప్రత్యర్థి యెవరో తెలిసికొందము.

కవి తార్కిక సింహ సర్వతంత్ర స్వతంత్రాది బిరుద మండనుడై విశిష్టాద్వైతమును పెంపొందించిన వేదాంత దేశికులును డిండిమ భట్టారకునకును

---

దేవుడనెడు వాడు / దేహమంతయు నిండి ; యున్న గాని మనము / యెన్న లేక దేవళంబులందె / దేవుడున్నాడంచు / నమ్మిమూఢజనులు / సొమ్ము లిచ్చు //

మహా వివాదము జరిగినట్లు దక్షిణ దేశ ఇతిహాసంలో పండిత పరంపరాగతంగా చెప్పుకొనబడుచున్నది. దేశికులు 1270 మొదలు 1370 వరకు గలరని గురు పరంపరా ప్రభావమందలి యీ శ్లోకం తెలుపుచున్నది.

శ్లో॥ శ్రీ ధీ యోగ్యే శకే శుక్ల ఉదభూద్వేంకటేశ్వరః ।
లబ్ద ప్రాయేశకే ప్రయాత్యామ్యేవ పరమం పదమ్ ।

శ్రీ కంఠాగమ శిఖండ మండన మణియై విజయ డిండిమము తొలుత నార్జించిన డిండిమ ప్రభుడును, యోగానంద ప్రహసనకర్త (మాతామహుడు) వేదాంత దేశికులును, సమకాలికులు,.కావున దేశకుని ప్రత్యర్థి ప్రథమ డిండిమ ప్రభుడని నిర్ధారింపనగును. శ్రీనాథుని ప్రత్యర్థి ప్రౌఢదేవరాయల కాలమున గల యోగానంద ప్రహసన కర్త ద్వితీయ డిండిమ భట్టారకుడగును. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల యాస్థానము·నందే కనకాభిషేక సత్కారమును పొందినట్లు స్పష్టమగుచున్నది. శ్రీనాథుని కనకాభిషేక సత్కారము ప్రౌఢదేవరాయల కాలమున జరుగుట కూడా సంభవమే.

ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున "మెకంజీ గ్రంథ పరంపరలో" (15-3-56, 44-45) చంద్రభూషణ క్రియాశక్తి యొడయరులకు రాయదత్త భూదానమును దెల్పు తామ్ర శాసనంలో చంద్రభూషణాచార్యుల కాలమున శ్రీనాథ డిండిముల వివాదకాలమును సువిదితము కాగలదు. వీరే యీ వాదమునకు మధ్య వర్తిత్వము నెరపి తీర్పు చెప్పినది వారి కాలముననే ఈ వివాదంలో విజయం సాధించిన శ్రీనాథునికి జయమును చాటిస్తూ ప్రౌఢ దేవరాయలాతనికి కనకాభిషేకం చేసెను.

శ్రీనాథుడు తన చాటువు నందు –

"పగుల గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
గౌడ డిండిమ భట్టు కంచుడక్క" అని వ్రాసుకున్నాడు.

(డిండిమ మనగా రాయడి గిడ గిడి యను వాద్యము. ఢక్క యనగా డంకా - యశః పటహము ) దీనిని గలిగి యుండు నాడు డిండిముడు. అనగా డిండిమ

---

చదువు సంధ్య గల్గి / సంస్కార వతియైన ; కట్టు మీయకుండ / కన్య పెండ్లి
కాదు కాదు యిపుడు / కాల మహిమ గాదె ; ఆడ పిల్ల బ్రతుకు / పీడయయ్యె /

బిరుదమును సంపాదించిన పండితుడు తన యాధిక్యమును సూచించుటకై రాజసభ కేగునపుడాతనికి ముందుగా నీ వాయిద్యమును వాయించుచు గమ్యమును చేర్చెదరు.

శ్రీనాథుని జననము 1360-1365 నడుమ ననియు కనకాభిషేకము 1430-1435 నడుమననియు శ్రీ బండారు తిమ్మయ్యగారి యభిప్రాయము. డిండిమునితో వాదించుటకు సామర్థ్యము శ్రీనాథునకు ముప్పదేండ్ల వయస్సున నెక్కువగా నుండునో డెబ్బదేండ్ల వయస్సున నుండునో విజ్ఞులు నిర్ణయింపవలసి యున్నది.

అసలు పండితుల తోడి వాదము ముప్పదేండ్ల వయస్సున సహజము కాదు. అందులో డిండిముని వంటి ఉద్దండ పండితుని తోడి వాదమునకు సామర్థ్యము ముప్పదేండ్ల వయస్సున సాధ్యము కాదు. ఏబది యేండ్ల వయస్సున మాత్రమే పండిత వాదములు సాధారణము. శ్రీనాథుని వంటి సకల విద్యా సనాథుడు ఏబది యేండ్ల వయస్సు నందే కాదు డెబ్బది యేండ్ల వయస్సునందును వాదించు సామర్థ్యము కలిగి యుండుట విపరీతము కాదు.

శ్రీ మల్లంపల్లి సోమ శేఖర శర్మగారి అభిప్రాయము -

మొదటి అరుణగిరినాథుడు రచించిన సోమవల్లీ యోగానంద ప్రహసనము దేవరాయల కాలమున రచించినట్లు కలదు. రెండవ దేవరాయల కాలము నందే సాళువ నరసింహరాయలు ప్రాముఖ్యమునకు వచ్చెను. ఇతని మొదటి శాసనము 1437 వ సంవత్సరములోనే వెలువడింది. అరుణ గిరినాథుడు రామాభ్యుదయమనే సంస్కృత కావ్యాన్ని రచించినట్లు సర్గాంత శ్లోకమునందున్నది. కాని పంచమ సర్గాంత శ్లోకము అభిరామాంబికా రాజనాథుల తనయుడైన శోణాద్రినాథ డిండిమ కవీంద్రుడు రచించినట్లుంది. రెండవ దేవరాయల మహానాటక సుధానిధి కంటే రామాభ్యుదయము పూర్వరచనము.

దీనిని బట్టి మొదటి అరుణగిరి నాథుడైన గౌడ పండితుడు రెండవ దేవరాయల కాలమునందున్నాడని సువిదితము. అంతేకాదు శాసన ప్రమాణమును

---

పెండ్లి యనగ నేమి / పెద్దలయనుమతి / నాలు మగల జంట / హాయి మీఱ
పరువు గల్గు సంతు / వంశంబు పెంపొంద / కనుచు పెంచుమనిరి / అనువుగాను॥

గలదు. అరుణగిరినాథుడు తన కుమారునికి భూపతి పేరు పెట్టినందుకు మెచ్చిన వీరభూపతి ముడియనూరు అగ్రహారాన్ని కానుకగా యిచ్చి వేయించిన శాసనమది. ఈ భూపతి రెండవ దేవరాయల తండ్రి వీర భూపతి లేక వీర విజయ భూపతి. (భూపన్న = రాజన = రాజనాథ) శ్రీనాథునికి కవి సార్వభౌమ బిరుదము, భీమఖండంలో లేదు. కాశీ ఖండమున శివరాత్రి మాహాత్మ్యములో వుంది. కాబట్టి భీమఖండ రచనము తరువాత కాశీ ఖండ రచనకు పూర్వము శ్రీనాథునికి కనకాభిషేక సత్కారం జరిగినట్లు స్పష్టము. కనుక శ్రీనాథుని ప్రత్యర్థి మొదటి అరుణగిరినాథుడైన గౌడ డిండిమ భట్టు అనుట సమంజసము.

"రామాభ్యుదయము" అరుణ గిరినాథ కృతముగా నున్న శ్లోకమిది - శోణాద్రీంద్రం కవీంద్రం శ్రవణ కటురటడ్డిండిమం సార్వభౌమం ప్రసూతాంబాధి రామ నవ నవకవితా భాజనం రాజనాథాత్ తస్యైతస్మిన్న యాతి క్రమ విషయ మహానాటక స్యాగ్రజాతే కావ్యే సర్గోని సర్గోజ్జ్వల రసవిల సత్వంచ మోఽయం జగామ ।

1380 వ సం॥ జనన కాలమగు డిండిమ ప్రభువైన అరుణ గిరి నాథుడే శ్రీనాథుని ప్రత్యర్థి అని నిర్ధారింపబడినది. ఈ గౌడ పండితుడు ప్రౌఢదేవరాయల సంబంధముగల డిండిమ కవి సార్వభౌముడే. విభాగ పత్రమాల అనే గ్రంథములో అరుణగిరినాథుని జనన కాలము 1380వ సంవత్సరం సరియైనదేననియు, జననీ జనకుల, మాతామహుని విషయములు కూడా నిస్సంశయము అట్లే మాతులుని విషయము నాతనిపెంపకము కూడా యదార్థము. అరుణగిరి నాథుని తండ్రియైన రాజనాథుడు కుమారుని ఎనిమిదవ సంవత్సరమందే మరణించుట వలన అతని మేనమామ పెంచెననుట నమ్మతగినదే. తండ్రి మరణించునప్పటికి అతని మాతామహుడు గాని, పితామహుడు గాని జీవించియుండిన మేనమామ పెంచనక్కరలేదు. తండ్రిలేని పిల్లలను మాతామహుడు పెంచుటయే లోక ధర్మము.

1406 వ సంవత్సరములో విజయనగర ప్రభువైన మొదటి దేవరాయల కాలములో నలుబది సంవత్సరములు లోపు వయస్సు గల అరుణగిరి నాథుడు

---

పెండ్లి జేయగోరి / ప్రేమతో దేవుండు ; స్వర్గమందుగూర్చు / జంటలెపుడ
వధువు కొఱకు వరుడు / పలుచోట్ల తిరిగిన ; యింటి ప్రక్కన మరు / జంటలెపుడు

శ్రీనాథునికి ప్రత్యర్థి యగుట సంగతము కాదు. గనుక శ్రీనాథుని తోడి వాదము రెండవ దేవరాయల కాలంలోనే జరుగుట సంభవము. ఈ సందర్భంలో రాయలగురువైన చంద్రభూష క్రియాశక్తి యనునత డగ్రాసనాధి పత్యమును, మధ్యవర్తిత్వమును వహించెను. ఈ తార్కిక యుద్ధంలో డిండిమ భట్టు పరాజితుడయ్యాడు. అతని గర్వాప హరణము గావించు నుద్దేశ్యముతో శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల ఆస్థాన పండితుడైన గౌడ డిండిమ భట్టుని కంచుఢక్కను పగుల గొట్టించుటయే గాక యింతవరకు అతడు వహించిన కవి సార్వభౌమ బిరుదమును తాను వహించుటతో బాటు కనకాభిషేక గౌరవము పొందుట సామాన్యమైన విషయము కాదు. శ్రీనాథుని కనకాభిషేక సత్కార కాలం స్థూలంగా 1431వ సంవత్సరము. అప్పటికి 1360వ సంవత్సరము జనన కాలం గల శ్రీనాథుని వయస్సు 71 సంవత్సరములు. 1380వ సంవత్సరము జనన కాలమగు అరుణగిరినాథుని వయస్సు 51 సంవత్సరములు ఈ వయస్సునందే గౌడుడు ఉద్భట ప్రౌఢ వివాదంలో పాల్గొన్నాడు.

ఈ పై విషయములన్నీ శ్రీ డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తి ఎం.ఏ, పి.హెచ్.డి., గారి "శ్రీనాథుడు" అనే గ్రంథము నుండి సేకరింపబడినవి.

**మాధవుడను గౌడ మంత్రి :** రెండవ హరి హర రాయలు (1377-1404). ఇతడు విజయ నగరాధీశుడైన బుక్కరాయని కుమారుడు. ఇతని వద్ద మిక్కిలి సమర్థులైన మంత్రులుండేవారు. వీరిలో మాధవాచార్యుని సోదరుడగు నారాయణా చార్యుడొకడు. రెండవవాడు గౌడుడగు మాధవ మంత్రి ఇతడు బుక్కరాయల కాలంలో కూడా రాజసేన యందున్న వాడు. ఇతడు గోవా పట్టణంలో జన్మించాడు.

## శ్రీరాముని కాలంలో సుగ్రీవుని పోషణలో నున్న గౌడులు – బొంబాయి వస్తుప్రదర్శన శాలలోని రాగి ఫలకము నుండి గ్రహింపబడిన విషయము

శ్రీమద్రామాయణం యుద్ధకాండములో శ్రీ వాల్మీకి మహర్షి సురను

---

*కొడుకులన్న ప్రేమ / కోడండ్రు రాక్షసు ; లనెడు తిట్టుబోతు / లత్తలెల్ల తాము కోడరికము / తగులబెట్టిన తీరు; జ్ఞప్తి చేసికొనగ / జ్ఞానులగును.*

తయారు చేయువారిని గూర్చి వ్రాస్తూ - సుగ్రీవుని కపి సైన్యంలో విదేహుడు, వామాక్షుడు కుండలుడు, భీతవహుడు, మధుడు, చక్రి మొదలగు గౌడు లుండెడి వారనియు వీరు సురను సృష్టించి రామదండుకు, కపిసైన్యములకు సమృద్ధిగా సరఫరా చేస్తూ వుండేవారని, వీరి సాంప్రదాయం క్రమంగా ద్వాపరయుగాంతం వరకు నుండిన దనియు, శ్రీమన్మహా భారతమున విరాట్ నగరమునను, యాదవకుల మస్తమించు కాలమున యాదవులు సురాపానము చేసి వారలలో వారు ఒకరి నొకరు హత్యగావించుకొని నశించిరనియు, ఆకాలమున మద్య పదార్థములను తయారు చేయు వారందరు గౌడ నామములతో విలసిల్లిన గౌడ కులమునకు చెందిన వారనియు, కలియుగంలో వీరు కూడా అస్తమించారని వ్రాయబడింది.

త్రేతాయుగంలో రఘు వంశీయుడైన హరిశ్చంద్ర చక్రవర్తి విశ్వామిత్ర మహర్షికి సర్వస్వము దానమిచ్చి రాజ్యాన్ని కోల్పోయాడు. అప్పుడు హరిశ్చంద్రుడు వీరబాహుడనే కాటికాపరికి అమ్ముడై అతనికి సేపలు చేస్తుండేవాడు. వీర బాహుడు నిత్యం కల్లు త్రాగేవాడు. ఆకల్లు కుండలను హరిశ్చంద్ర చక్రవర్తి మోసిన యితిహాసం మనందరకు తెలిసినదే. దీని బట్టి మద్యపానము యిప్పటికి మూడు యుగాల పూర్వం నుండి వాడుకలో వున్నదని తెలుస్తుంది.

శ్రీ కృష్ణుని అన్న బలరాముడు కూడా సురను సేవించినట్లు మహాభారత యుద్ధ సమయంలో మద్య మాంసాలను విరివిగా వాడినట్లుంది. మధువు, మగువ, మాంసము యివి అప్పటికి యిప్పటికి వ్యసనపరులకు నిత్యావసరాలై యున్నాయి.

సత్య యుగం నుండి యిప్పటివరకు అన్ని జాతులవారు కల్లును విరివిగా ఉపయోగిస్తున్నట్లు పూర్వ చరిత్ర వలన విశద మవుతుంది.

ఈ విధంగా గౌడులు సృష్ట్యాది నుండి వుండి వున్నట్లు మనకు అనేకానేక ఉదాహరణలు లభిస్తాయి.

---

కనికరంబు లేక - కాపురంబుల నెన్నో ; కూలద్రోయు నత్త / కుమిలి కుమిలి చివరి దశను యందు / చేయు వారలు లేక ; పుచ్చి చచ్చుచుండు /కచ్చితముగ //

**గౌడుల ప్రాచీన ఔన్నత్యము :** పై విశేష వివరణను బట్టి, గౌడ దేశీయులు విద్యాధికులై, విద్యోపాసనాపరులై, సారస్వత జీవనము చేయువారై, సమస్త కళల యందును సంపూర్ణ వికాసము గలిగి ఉచ్ఛస్థితి నందుటం బట్టి అలంకార శాస్త్రమునందు గౌడ రీతి కొక ప్రత్యేకస్థానము కలిగినది. మరియు పంచ గౌడులలో సారస్వతులను విభాగమొకటి పైన తెలిసికొని యున్నాము. కాలక్రమమున గౌడ దేశము పతన మగుట వలన ఆదరణ లేక గౌడులలో కొందరు యితర వృత్తులను చేపట్టి జీవించుటం బట్టి కొందరు మాత్రమే సారస్వత జీవనము కలిగిన వారగుటచే పంచగౌడులలో సారస్వత విభాగ మేర్పడి యుండవచ్చును. పై వివరణను బట్టి మనము ఆంధ్రకు వలస వచ్చిన సారస్వత గౌడ బ్రాహ్మణుల వంశీయుల మనుట నిర్వివాదాంశము. ఇట్టి మహా విజ్ఞాన సంపన్నము మహోన్నత జాతియగు గౌడ జాతి మద్య పానాసక్తితోను, మత్స్య-మాంసాది భక్షణ తోను, రాజస తామసా హార ఫలంగా - సాత్విక - సారస్వత జీవనం సన్నగిల్లి ఆచార వ్యవహారములలో కూడా సదాచారం విస్మరించి, కాలానుగుణంగా పతనమైన దనుట సుస్పష్టము. ఇట్టి ఉన్నత ఆర్ష-సారస్వత జీవనం కల్గిన జాతి చరిత్ర సంస్మరణము వలన సన్మార్గోన్ముఖమై, సదాచారాభిలాష కల్గి, సంస్కారం పొంది, సంస్కృతమై, ఉత్తమ సంస్కృతి నలవర్చుకొని పూర్వపు టౌన్నత్యాన్ని ఉన్నతిని నిరంతర కృషి క్రమ శిక్షణల వలన సంపాదించి మరల మనవారు అకుంఠిత కార్య దీక్షలతో ప్రాచీన ఔన్నత్యాన్ని అనతికాంలో పొంద గల రనుటలో యెట్టి సందేహం లేదు.

ప్రస్తుత యీ సంగ్రహ వివరణ యొక్క ముఖ్యోద్దేశము మన జాతి యొక్కయు, మన పూర్వాచారముల యొక్కయు, ధర్మముల యొక్కయు, విజ్ఞానము యొక్కయు, గుణదోషములు తెలిసికొని అందలి గుణములను మాత్రమే స్వీకరించి దోషములను త్యజించి ఉత్తమ సంస్కృతి నలవర్చుకొని ఉత్తేజము నొంది ఉత్తమ మానవతా ధర్మములతో మన జాతికే కాక యావద్భారత జాతీయతకు మార్గదర్శకులై సౌభాగ్యము చేకూర్చ గలరని హృదయ పూర్వకంగ ఆకాంక్షిస్తున్నాను.

---

*ఉసురుపెట్ట నదియు / ఊరకే పోవునా ; కట్టి కుడుపు నట్టి / కార్చిచ్చు గద !*
*అభము శుభము లెరుగ / నట్టి వారందరు ; ఉసురు మనిన నదియు / ఊరుకోదు ॥*

## యజ్ఞయాగాది క్రతువులయందును, పితృ కర్మల యందును సురను ఉపయోగించుట

ఒకప్పుడు శంకరభగవానుడు కైలాసములో ప్రమథగణములతో గూడి సంతోషంగా యిష్టాగోష్టి సలుపుచుండగా స్కందు డేతెంచి శంకరునకు నమస్కరించి – "మహాదేవ! ఏకర్మమెట్లు గావించిన పితృ దేవతలు తృప్తులై మోక్షమును పొందుదురో చెప్పు" మని ప్రార్థింపగా ఆనందించిన శంకరుడీ విధంగా చెప్పియున్నాడు.

"వత్సా ! సుగుణసంపన్నుడు, బ్రహ్మజ్ఞాన పరాయణుడు నాయంశమున జన్మించిన నా భక్తుడగు దేవగౌడుడైన కౌండిన్య మహర్షి గౌడ మంత్ర ప్రభావముచే సృష్టించిన అమృత సిద్ధ రసము. వారుణీ మద్య దివ్యరసంబులతో పితృదేవతలకు తర్పణము చేసిన వారు తృప్తులై యమర లోకమున కరిగి శాశ్వతానందము నందుదురు. మరియు నీ యమృత సిద్ధ రసము మహర్షులచే శ్లాఘింపబడుట వలన దీని సేవన వలన దేవతలానందింతురు. అందువలన ప్రతివారును యజ్ఞయాగాది క్రతువులందును. పితృకర్మల యందును అవశ్యము దీనినుపయోగింతురు – ప్రమాణము –

శ్లో॥ పురా సుధా సమాయాతా కలౌ సమ్మూలి కాత్మకా
మధునా వారుణీ త్యేవా మధు మద్యం తథైవ చ ।
పురా బ్రహ్మ ప్రియా సా చ సర్వకర్మార్థ సిద్ధి దా
మధునా తర్పితా దేవాః మధునా తర్పితా ద్విజాః
మధునా సర్వకర్మాణి మధు స్సర్వత్ర సిద్ధిదం ।

తా॥ దేవతలు, బ్రాహ్మణాది సమస్త జనులు ఫల పుష్పముల తోను, మూలికలతోను, తయారు చేయబడిన వారుణీ మద్యము, సురా(కల్లు), తేనె మొదలగు పదార్థములు యజ్ఞ యాగాది క్రతువుల యందును పితృ కర్మల యందును ఉపయోగించిన దేవతలు, పితరులు, తృప్తులయ్యెదరు గాన ప్రతివారు వీటి నవశ్యముపయోగించవలెనని శాసింపబడినది.

(స్కందపురాణం – సనత్కుమార సంహితం)

---

సూదిపోటు మాట్ల / శూలంబులై సోక ; క్రుళ్ళి ఏడ్చుచుండు / కోడలపుడు
ఏడిపించి అత్త / వేడుక బరికించు ; గౌడులార కీర్తి / కలితులార ॥

## శివపార్వతులు – ఋషులు – శ్రీ రామాదులు సురను సేవించుట

1) శివుడు పార్వతీ సమేతంగా తాండవ నృత్యం చేసే సమయంలో సురను సేవించేవాడని, నందీశ్వర, భృంగీశ్వర, చండీశ్వర. వీర భద్రాది శివగణములు నిత్యము వారుణీ మద్యమును సేవించెడి వారని పురాణ గ్రంథాల్లో వుంది.

2) సూర్య భగవానుడు విరామంలేని తన రథ గమనాయాసం బాపుకొనడానికి నిత్యము సురను సేవించునని వుంది.

3) శ్రీ సీతారామ లక్ష్మణులు వనవాస కాలంలో అగస్త్య మునిని దర్శించడానికి ఆయన ఆశ్రమానికి వెళ్ళారు. ఆయన వార్ని సాదరంగా ఆహ్వానించి, అర్ఘ్య పాద్యాదులతో పూజించి, ఫలపుష్పము లతోను, మూలికలతోను, తయారుకాబడిన సారాయమును తెచ్చి – వారి వన వాస క్లేశానికెంతగానో విచారించి – "ఓ రామా! ఇది క్రొత్తగా చేయబడిన పానీయము. పానయోగ్యమైనది. పరిమళ సహితమైనది, మధూక పుష్పములతో తయారు చేయబడిన దివ్య సారాయము, వారుణీ మద్యము యిది త్రాగిన మీ మార్గాయాసం తీరు" నని చెప్పి ఆసారాయము నీయగా దానిని సీతారామ లక్ష్మణులు సుష్టుగా త్రాగి సేద దీరిరి.

4) మరియు దీనిని నాశ్రమ వాసులగు ఋషులు, ఋషి కన్యలు, ఋషి పత్నులు నిత్యము పానము చేసి దివ్యజ్ఞాన సంపన్నులై వెలసిరి. (వాల్మీకి రామాయణం అరణ్యకాండ 102 సర్గ)

5) దశకంఠుడు – శివపూజా దురంధరుడైన రావణ బ్రహ్మ దీనిని నిత్యము త్రాగేవాడు. రావణుని మరణానంతరము వానికి ఉత్తర కర్మలు చేసే సమయంలో విభీషణుడు పితృకార్యం కొరకు సుర, మాధూక పుష్ప రసము, వారుణీ మద్యములతో పితృకార్యమును నిర్వహించెను.

6) ఆర్యులలో కూడా యజ్ఞ యాగాది క్రతువులు పితృతర్పణము మొదలగు వాని యందును, ఆహితాగ్ని సంస్కారము లందును సురాపానము చేసెడివారు.

7) ముని పల్లెలలో, మతంగ, శరభంగాది మునులు నిత్యము యీ వారుణీ

---

చలన చిత్రములకు / జనరాంద్రులగువారు ; సోకు చేసికొనుచు / సొమ్ము లిచ్చి
చూచి ఫేషనులను / నేర్చుకొనిరి నేడు ; కలిత విభవులార // గొడులార ॥

మద్యమును సేవించి సత్వగుణసంపన్నులై, దీర్ఘకాలమీశ్వరునారాధించి తరించిరి.

8) క్షీర సాగర మధన కాలమందు వరుణుని కుమార్తెయగు వారుణీదేవి సుర (కల్లు) అనే పేరుతో సురలు చూచుచుండగా ఉద్భవించింది. ఆ సురాదేవిని రాక్షసులు చూడలేదు. సురలు ఆ దేవిని గ్రహించిరి. ఆ సురాదేవిని పరిగ్రహింప నందుకు దితిపుత్రులైన రాక్షసులు అసురులనబడిరి. దేవతలాసురా దేవిని గ్రహించి పూజించి నందున వారు సురలన బడిరి.

9) వేదకాలమున, ఆర్యగౌడులని ప్రసిద్ధి గాంచిన యీ జాతీయులు వారుణీ దేవిని తమ కులదేవతగా పూజించేవారు. ఈ దేవి పాలసముద్రము నుండి శ్రీ మహాలక్ష్మితో పాటు ఉద్భవించింది. గనుక యీ దేవిని వరలక్ష్మీదేవిగా పరిగణించి ఆశ్వీయుజ బహుళ దశమి మొదలు ద్వాదశి వరకు మూడు దినములు వేదమంత్రములతో, సహస్ర నామార్చనలతో షోడశోపచార పూజలు చేసి, దానితోబాటు శివలింగార్చన అభిషేకాదులు చేసి ద్వాదశీనాడు సమారాధన చేసి, శివప్రసాదము స్వీకరించి ఆనాడే శ్రీ వారుణీ వరలక్ష్మీ దేవికి ఊరేగింపు మహోత్సవము చేసి శివ పురాణ కాలక్షేపంతో ఆరాత్రి జాగరణ చేసి మరునాడు ఆదేవిని పీఠమునందు ప్రతిష్ఠించి బీదలకు అన్న వస్త్రదానాదులు చేయుచుండెడి వారనియు, అందువలననే ఆనాటి గౌడజాతీయులు అష్టైశ్వర్య భోగ భాగ్యములతో తులతూగే వారనియు, రాజభోగముల ననుభవించే వారని, యీ విధంగా వారి జీవితము ఆనందమయంగా జరిగిపోయేదని ఆదిగౌడ దీపిక యందు వ్రాయబడింది.

10. వివాహాలయ్యాక భరత శత్రుఘ్నులు తమ మేనమామ యుధాజిత్తుకూడా కేకయ రాజ్యానికి తాతగారి పిలుపున వెళతారు. ఇంతలో దశరథుడు శ్రీరామ పట్టాభిషేకం తలపెట్టి ముహూర్తం నిర్ణయించాడు. ఈ విషయం తెలిసికొన్న మంధర తన యజమానురాలైన కైకకు దుర్బోధ చేసి ఏ విధంగా నైనా భరతునికి పట్టాభిషేకం జరగాలని పూర్వం దశరథ మహారాజు కైకేయి కిచ్చిన రెండు వరాలను జ్ఞాపకం చేసి అవి యిప్పుడు కోరుకోమని ప్రోత్సహిస్తుంది.

---

వేషను వలయంబు / ప్రేమగా మారంగ ; మూర్ఖ జనులవోలె / మురిపెమునను చిత్రసీమ వారి / చిత్ర విచిత్రాలు / నేర్చి అనుకరించి / నిల్చినారు.

దాని ప్రకారం కైక భరతునికి పట్టాభిషేకం, రామునికి వనవాసం కోరుకుంటుంది. వృద్ధుడైన తండ్రి మాట నిలువబెట్టడానికి రాముడు సీతాలక్ష్మణులతో వనవాసానికి వెళతాడు. పుత్ర వియోగం భరింపలేక దశరథుడు నలుగురు కొడుకులుండి కూడా ఒక్కడు దగ్గర లేకుండా మరణిస్తాడు. అప్పుడు వశిష్ఠుడు భరత శత్రుఘ్నులకు కబురుచేసి రప్పిస్తాడు. వారు వచ్చి తండ్రి మరణం, రామలక్ష్మణులు లేకపోవడానికి కారణం అడిగి తెలిసికొని తల్లిని యెంతగానో దూషించి, తండ్రికి అంత్యక్రియలు చేసి రాముని తీసికొని వస్తానని ప్రతిజ్ఞ చేసి, మంత్రి సామంత, పురోహిత, చతురంగ బలములు వెంటరాగా, జానపదులు, అయోధ్యా పురవాసు లెల్లరను వెంట తీసికొని రాముణ్ణి వెతుక్కుంటూ అరణ్యాలకు బయలుదేరతాడు. మార్గమధ్యంలో భరద్వాజ మహర్షి ఆశ్రమం కనిపిస్తుంది. వెంటనే భరతుడు అనతి దూరంలోనే తన రథాన్ని దిగి పాద చారియై ముని వద్దకు వెళ్ళి ఆయనకు ప్రణమిల్లి తాను వచ్చిన సంగతి చెప్పి దుఃఖిస్తాడు. అప్పుడు భరద్వాజు డతనిని సాంత్వన పర్చి ఆనాటికి తనకు అతిథులుగా వుండమని వారిని ఒప్పించి వారికి గొప్ప విందు చేయ సంకల్పించి తన తపోమహిమతో స్మరణ మాత్రము తోనే విశ్వకర్మను రావించి విషయం చెప్పి భరత మహారాజుకు ఆయన పరివారాని కంతకు వసతి గృహాలు నిర్మింపుమని, వారి కొరకు కొన్ని చెఱకు రసంతోను, కొన్ని మైరేయమనే పుష్పఫలాదులచే చేయబడిన సారాయముతోను, కొన్ని కల్లుతోను నిండిన సరస్సులను సృష్టించి పానార్థముపయోగపడునట్లు చేయుమని ఆజ్ఞాపించగా విశ్వకర్మ అత్యంత సుందర భవనాలను వాటిలో స్వర్ణ రజిత పాత్రలను, తూగుటుయ్యెలలు, హంస తూలికా తల్పాలు మొదలైన సౌకర్యముల నన్నింటిని కల్పించి, కల్లు సారాయములతో నిండిన సరస్సులను సృష్టించాడు. తరువాత ఆ ముని దేవేంద్రుని పిలిపించి దేవతా వస్త్రాదులు, దేవకాంతల నాట్యాలను ఏర్పాటు చేయించాడు. చంద్రుని వలన వివిధాన్నములు, భక్ష్య, భోజ్య, లేహ్య, పేయ, చోష్యాదులను, పానము కొరకు మధుసిద్ధి రసము (విప్ప సారాయి), వారుణీ మద్యము (కల్లు) మొదలగు అనేక రకములైన పానీయాలను, అనేక రకములైన మాంసాదులతో కూడిన కూరలను

---

*తల్లి బిడ్డ నెట్లు / చల్లగా సాకునో ; భార్య భర్త నట్లు / బహు విధముల భోజనాదు లిడగ / పూజ్యురాలగు చుండు ; సుజన రాశి వినుత / సుదతి వినుమ /*

తయారుచేయించి భరతునకు అతని అపార సేనకు విందు చేశాడు. భరతాదులందరూ భోజనాదులతో బాటు తృప్తిగా సురాపానము చేసి విశ్రమించారు.

(వాల్మీకి రామాయణం అయో. కాం 91 సర్గ)

11. సీతాన్వేషణ కొరకు హనుమంతుడు రాత్రి సమయమందు రావణుని అంతఃపురం ప్రవేశించి , సురాపానముతో మత్తెక్కి వివశులై పడి యున్న రావణుని అతని ప్రక్కనే వున్న రాక్షస స్త్రీల నెందరినో చూశాడు. ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన పానశాలలను అందులోని సారాయము మొదలైన పాన పదార్థాలను హనుమంతుడు చూశాడు.

(వాల్మీకి రామాయణం సుంద. కాం. 9 సర్గ )

12. పాండవులజ్ఞాత వాస సమయంలో మారు వేషాలతో విరాటుని కొలువులో కుదిరి వానికి సపర్యలు చేస్తున్నారు. అందులో ద్రౌపదీ దేవి విరాటుని భార్యయైన సుధేష్ణ వద్ద పరిచారికగా వుండేది. ఒకనాడు సుధేష్ణ సోదరుడు కీచకుడు అక్క వద్దకు వచ్చి ఆమె వద్ద నున్న జగదేక సుందరిని చూచి కామించి ఆమెను పొందవలెనన్న కోర్కెను అక్కతో చెప్పాడు. ఆమె ఎన్నో నీతులు చెప్పి వారించింది. కీచకుడు నామాట వినకపోతే రాజ్యమంతా సర్వనాశనం చేస్తానని బెదిరించాడు. అప్పుడు సుధేష్ణ యిక చేయునది లేక ద్రౌపదిని ద్రాక్ష సారాయమును తీసుకొని వెళ్లి తన సోదరుని భవనంలో యిచ్చి రమ్మని చెప్పింది. రాణి ఆజ్ఞానుసారం ద్రౌపది కీచకుని భవనానికి వెళ్ళింది. ఆమెను చూచి పరమానంద భరితుడైన కామాతురుడామెను బలవంతంగా పట్టుకోబోయాడు. ఆమె యెలాగో అతని బారి నుండి తప్పించుకొని వంట యింట్లో చొరబడి అక్కడ వంటలువాడుగా నున్న తన భర్త భీమసేనునితో యీ విషయం చెప్పి తన దుస్థితికి దుంఖించింది. భీముడామెను వూరడించి ద్రౌపదీ వేషంలో నర్తనశాలకు వెళ్ళి కీచకుని రావలసిందిగా సంజ్ఞ చేశాడు.. నిజంగా తన కోరిక తీర్చడానికి ద్రౌపది యే స్వయంగా వచ్చిందని "కామాతురాణాం న భయం న లజ్జా" అనే సూక్తి ననుసరించి వెంటనే వెళ్ళి స్త్రీ వేషంలో వున్న

ఒడలు గానిపించు / నుడుపుల ధరియించి; యువకులైన వారి / యువిద లెల్ల
పురిని గొల్పగానె / పోయిరి పెడదారి ; గౌడులార కీర్తి / కలితులార ॥

భీముని కౌగిలించుకొన్నాడు. అప్పుడు భీముడు వానిని గుట్టుచప్పుడు కాకుండా చంపి ముద్ద చేసి పడుకోబెట్టాడు.

ఆకాలంలోని శివగౌడులు అమృతసిద్ధ రసాన్ని తయారు చేసి ఆయాదేశాధిపతులకు పంపి, అంతఃపురాలకు కావలా వారిచేత సరఫరాచేయించి వారి చేత అధికంగా గౌరవింపబడేవారు. ఆ రాజులు సంతోషంతో ఆ గౌడులకు తమ రాజ్య మందలి కొంత రాజ్య మిచ్చి గాని, కొన్ని గ్రామాలను దానంగా గాని యిచ్చే వారు. వాటిని యీ గౌడులే స్వతంత్రంగా పాలించి ఆదాయాన్ని అనుభవించి సుఖించేవారు. ఇట్టి గౌడులను మహారాజులు తమ తమ ఆస్థానాలలో గౌరవనీయ వ్యక్తులుగా పరిగణించి మిగతా వారితో సమానంగా ఆసనాదులనిచ్చి ఆదరించి పోషించేవారు.

ఈ విధంగా సురాపానం, సృష్ట్యాది నుండి నేటి వరకు అవిచ్ఛిన్నంగా సాగుతుంది. మహారాజులు, మహాత్ములగువారందరు సురాపానం చేసినట్లు మనకు చరిత్రలో ఉదాహరణలు కోకొల్లలుగా లభిస్తాయి. గాంధీజీ కూడా తాను స్వయంగా "నీరా"ను త్రాగినట్లు వ్రాసికొన్నాడు. మిగతా విషయములు గ్రంథ విస్తరణ భీతిచే విడిచి పెట్టడమైనది.

## శుక్రాచార్యుడు సురను శపించుట–కచ–దేవయాని కథ

ఈ కథ శ్రీమదాంధ్ర మహాభారతం, ఆదిపర్వం, తృతీయాశ్వాసం లోనిది. ఈ పర్వాన్ని కవిత్రయంలోని మొదటి వాడైన నన్నయ్య భట్టారకుడు వ్యాసకృత సంస్కృత భారతాన్నుండి ఆంధ్రీకరించాడు. భారతంలో చతుర్వేద సారమంతా నిండి యుండుటం బట్టి దీన్ని పంచమ వేదమని, భరత వంశస్థుల చరిత్ర యుండుట వలన భారతమని, గొప్ప అర్థ గౌరవం గలది గాన మహా భారతమని, పూర్వ రాజుల చరిత్ర లిందుండుటచే దీనికి "ఇతిహాస" మనియు, సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశాను చరితము ననెడి ఐదు పురాణ లక్షణములుండుటం బట్టి దీనికి పురాణమని ప్రసిద్ధ నామములు గలవు. ఇది 11వ శతాబ్దంలో రాజమహేంద్రవరం రాజధానిగా వేంగి దేశము నేలిన రాజ రాజ

---

నగ్న యువతి జూపు / నగుబాటు సినిమాలు; పిచ్చి పట్టినట్లు / పెద్ద చిన్న
చూచి వచ్చి దాని / సొకులన్నియు నేర్చి ; పాడు చేసినారు / భ్రష్టులగుచు ॥

నరేంద్రుని ప్రోత్సాహంతో ఆస్థాన కవియైన నన్నయ్య దీనిని తెనిగించాడు. సంస్కృతము మొదలగు ననేక భాషలలో కవిరాజశేఖరుడని ప్రసిద్ధి నొందిన నారాయణ భట్టను గౌడ కులజుడు యీ నన్నయ్యకు సమకాలికుడు.

వ్యాస భగవానుడు జనమే జయమహారాజుకు భారతకథను వినిపింపుమని వైశంపాయనుని నియమించాడు. అతడు కథను ప్రారంభించి కౌరవ వంశ క్రమాన్ని తెలుపుచుండగా "యయాతి" ప్రసక్తి వచ్చింది. అప్పుడు జనమే జయునకు సందేహం కలిగి – "ఓ మహాత్మా"! యయాతి మహారాజు బ్రాహ్మణ కన్యయైన దేవయానిని వివాహమాడడం యెలా సంభవించింది?ఆ యయాతి చరిత్ర చెప్పు" మని ప్రార్థింపగా వైశం పాయనుడు యయాతి చరిత్రకు ముందుగా దేవయాని వృత్తాంతం చెప్పుటకొరకై దానికి సంబంధించిన కచుని విద్యాభ్యాసము గురించి యీ విధంగా చెప్పాడు.

ఓ జనమే జయ మహారాజా! వృషపర్వుడనే రాక్షస రాజుకు శుక్రాచార్యుడు గురువై సమస్త విధముల రాక్షసులకు మేలు చేయుచుండెను. నిత్యము దేవతలకు రాక్షసులకు జరిగే యుద్ధాల్లో మరణించిన రాక్షస శ్రేష్ఠులను నిత్యము శుక్రుడు తన మృత సంజీవనీ విద్యతో తిరిగి బ్రతికిస్తున్నాడు. ఆ సంగతి గ్రహించిన దేవతలు మిక్కిలి భయపడి, రాక్షసుల్ని జయింపలేక ఏ విధంగానైనా శుక్రచార్యుని వద్ద గల మృత సంజీవని విద్యను సంపాదించి తీసికొని రాగల మహానుభావుడెవరని యాలోచించి అందుకు బృహస్పతి కుమారుడైన కచుడే తగిన వాడని నిర్ణయించి దేవత లందరూ కలిసి కచుని వద్దకు వెళ్ళి – "కుమారా! మేము కార్యార్థులమై నీ వద్దకు వచ్చాము. నీవు చిన్న వాడవైనా నియమపాలన చేయువాడవు. మంచి గుణ సంపన్నుడవు అన్ని విధాల యోగ్యమైన వాడవు. నిత్యము మనకు రాక్షసులతో వైరం తప్పుట లేదు. మనచే నిహతులైన రాక్షస వీరులను శుక్రాచార్యుడు తన మృతసంజీవనీ మహావిద్యచే క్షణకాలంలో బ్రతికిస్తున్నాడు. అందువలన రాక్షసులు అజేయులై మనలను నానా విధాల హింసిస్తున్నారు. మిక్కిలి బలపరాక్రమాలు కల్గిన ఆ రాక్షసులను జయించడం మనకు చాలా కష్టంగా వుంది. మనవారెంత బలవంతులైనా మృతసంజీవని లేని

వన్నె చిన్నె కొలుకు / చిన్న నన్నని బట్ట ; బిగువు గాను తొడిగి / మగువ లెల్ల
కురుల విరియబోసి / కుచ కుంభములజూపె ; కలిత సుగుణులార గౌడులార !

కారణంగా వారంతా రాక్షసులచే చంపబడుచున్నారు. గనుక నీవు ధైర్యంతో శుక్రాచార్యు నాశ్రయించి మృత సంజీవనీ విద్య ను సంపాదించి దాని వలన దేవతలనందర్ని కాపాడాలి. నీ యోగ్యతలు చూచిన శుక్రుడు మిక్కిలి దయతో నిన్ను విశ్వసించి విద్యయనే కన్యను నీకు దానం చేయగలడు. ఆయనకు దేవయాని అనే కూతురుంది. ఆమెపై తండ్రికి మిక్కిలి ప్రీతి. అతడామె మాటను త్రోసివేయడు. కనుక నీవు యథాశక్తి దేవయాని మనస్సుకు నచ్చునట్లుగా ప్రవర్తిస్తూ శుక్రునితో బాటు ఆమెను సేవించిన నీ ప్రయత్నం తప్పక నెరవేరుతుంది. ఈ కార్యం సాధించడానికి నీవే సమర్థుడవు గనుక నీవు శుక్రుని వద్దకు వెళ్ళుమని ప్రోత్సహించారు.

దేవతల కోరిక ననుసరించిన కచుడు వృషపర్వుని పట్టణానికి వెళ్ళి, అక్కడ వేదాధ్యయన పరుడై దానవులందరకు గురువై యున్న శుక్రుని చూచి నమస్కరించి " ఓ మహాత్మా! నాపేరు కచుడు, బృహస్పతి కుమారుడను నీకు శిష్యుడనై యుండి సేవలు చేయడానికై వచ్చాను. నన్ను శిష్యుని గా స్వీకరించి నన్ను కరుణింపు" మని ప్రార్థించాడు.

అతని కోమలత్వము, వినయంతో గూడిన మృదుమధురవాక్కులు, నిత్యము నియమంతో వేద విహిత విధుల నాచరించుటచే ప్రకాశించే శాంత గుణాన్ని చూచి శుక్రుడు మిక్కిలి ఆనందించి "వీనిని పూజించినచో బృహస్పతిని పూజించినట్లే" అని తలంచి అతిథి పూజలతో కచుని సంతోష పరచి కచుని శిష్యునిగా చేసికొన్నాడు. తదాదిగా కచుడు యే పని చెప్పినా తరువాత చేస్తాననక వెను వెంటనే చేస్తుండేవాడు. గురువు గారి మనస్సు లోని యాలోచనలను గ్రహించి తదనుగుణంగా ప్రవర్తిస్తూ మనోవాక్కాయ కర్మలందు భేదం లేకుండా ఒకే విధంగా భక్తిని చూపిస్తున్నాడు.

గురు పుత్రికయైన దేవయానికి మిక్కిలి విధేయుడై మంచిమాటలు చెప్తూ వివిధ రకములైన పూలు, పండ్లు కోసియిస్తూ ఆమె కెల్లప్పుడు ప్రీతి కలిగిస్తూ వుండేవాడు, ఈ విధంగా యెన్నో యేళ్ళు శ్రద్ధతో గురువును,

---

*బొట్టు లేని ముఖము / జుట్టు ముడులు వేయ / గాలి గోపురముగ / గాన వచ్చె*
*పసుపు కుంకుమముల / పాల దోలిరెపుడొ ; కలిత విభవులార / గౌడులార ॥*

గురుపుత్రికను సేవించి తన నేర్పు వలన వారి యనుగ్రహాన్ని సంపాదించాడు. గురు సేవయందలి నేర్పుతో కచుడు శుక్రునకు ప్రియ శిష్యుడై యుండుట చూచిన రాక్షసులు సహింప లేకపోయారు. బృహస్పతి యందలి కోపము పగ తోడు రాగా వీనినే విధంగా నైనా సంహరించాలని నిశ్చయించి సమయం కొఱకు యెదురు చూస్తున్నారు. ఒకనాడు కచుడు హోమధేనువుల్ని కాస్తూ అడవిలో ఒంటరిగా కనిపించాడు. అదియే మంచి సమయమని రాక్షసులు కచుని చంపి ఒక పెద్ద చెట్టుకొమ్మకు వ్రేలాడ గట్టి వెళ్ళిపోయారు. సూర్యాస్తమానం అయిపోయింది. కచుడు లేకుండ గానే హోమధేనువులు తిరిగి వచ్చాయి. వానితో కచుడు రానందుకు దేవయాని మిక్కిలి భయపడి తండ్రి వద్దకు వెళ్ళి– "నాయన గారూ' సూర్యుడస్తమించాడు. హోమధేనువులు కచుడు లేకుండా తిరిగి వచ్చాయి. మీ యగ్నిహోత్రములు కూడా శ్రద్ధతో వ్రేల్చుట జరిగింది. చాలా ప్రొద్దుపోయినా కచుడు రాలేదు. అడవిలో నతనికి మృగముల వలన గాని రాక్షసుల వల్లగాని హాని కలిగియుండ వచ్చునని సందేహంగా వుంది. కారణం వెంటనే కనుక్కోమని చెప్పింది.

కూతురు మాటలు విన్న శుక్రుడు వెంటనే తన దివ్య దృష్టితో చూచి రాక్షసులచే కచుడు చంపబడ్డాడని గ్రహించి వానిని బ్రతికించి తీసికొని రమ్మనమని మృత సంజీవనిని పంపించాడు. అతని ఆజ్ఞను శిరసావహించిన ఆ విద్య వెంటనే వెళ్ళి కచుని బ్రతికించి తీసుకుని రాగా శుక్రుడు, దేవయాని సంతోషించారు. తమ ప్రయత్నం విఫలమైనదని రాక్షసులు యెంతగానో విచారించి తిరగి కచుణ్ణి నామరూపాలు లేకుండా హతమార్చాలని అతన్ని వెన్నంటి తిరుగు తున్నారు. ఒకనాడు కచుడు పూవులు తేవడానికి అడవికి వెళ్ళాడు. వెంటనే రాక్షసులు అతన్ని చంపి అతని రూపం లేకుండా ఆ శవాన్ని కాల్చి ఆ బూడిదను మద్యంలో కలిపి నేర్పుతో ఆకల్లును శుక్రుని చేత త్రాగించారు. సురాపానము వలన కలిగిన మత్తుతో శుక్రుడా సంగతిని గ్రహింప లేకపోయాడు. వెనుకటి వలెనే కచుడు కనబడనందుకు దేవయాని మిక్కిలి దుఃఖించి – "ఈ రోజు కూడా కచుడు రాలేదు. రాక్షసులాతనిని చంపి యుండవలెనని" తండ్రి వద్ద మొర పెట్టుకొనగా

---

బొట్టులేని ముఖము / జుట్టు ముడులువేయ / గాలిగోపురముగ గానవచ్చె /
పసుపు కుంకుమముల / పాల దోలిరెపుడా కలిత / విభవులార గౌడులార! ॥

తండ్రి "ఓ పుత్రీ! సంజీవనీ మహిమ నెరుగక రాక్షసులు మిక్కిలి గర్వంతో విరోధము పూని పగబట్టి అతన్ని చంపుచున్నారు. ఆ కచునికి మంచి గతి కలుగును కాక! అతని కొరకు విచారింప నేల?" అని కుమార్తెను వూరడించాడు.

దానికామె "సర్వజ్ఞుడవైన ఓ తండ్రీ! ఆ కచుడు బుద్ధిచే మనందరికంటే శ్రేష్ఠుడైన యంగిరసుని మనుమడు. మనలనాశ్రయించిన వాడు, ప్రసిద్ధుడైన బృహస్పతికి కుమారుడు. నీకు శిష్యుడు మీదు మిక్కిలి అందగాడు. బ్రహ్మచర్యాశ్రమ నియమాల్ని చక్కగా పాటించేవాడు. అట్టి సుగుణాలరాశి నిష్కారణంగా రాక్షసులచే చంపబడితే నేను దుఃఖింపకుండగా యెలా వుండగలను? వాన్ని చూస్తేనే గాని నేను భోజనం చేయను" అని పట్టు పట్టింది.

కచుని చూస్తేనేగాని భోజనం చేయనని యేడ్చుచున్న దేవయాని పై చాలాసేపటికి దయగలవాడై శుక్రుడు తన దివ్యదృష్టితో లోకాలోకపర్వతమువరకు గల సమస్తము చూచాడు. యేలోకంలోను కచుడు కనిపింపలేదు. చివరకు కచుడు, బూడిద రూపంలో కల్లుతో కలిసి తనపొట్టలోనే వున్నాడని తెలిసికొని కల్లు వలన కలిగిన దోషాన్ని, రాక్షసులు చేసిన అపకారాన్ని గ్రహించి మిక్కిలి కోపించి "పూర్వమనేక జన్మములయందు పుణ్యకర్మములెన్నియో చేసినందున కలుగు జ్ఞానము కల్లు త్రాగుటవలన క్షణంలో నశించును. జనులెవ్వరును కల్లును త్రాగరాదు. నేడు మొదలు బ్రాహ్మణులు మొదలగు జనులీ కల్లు త్రాగిన యెడల పాపములయందు దగిలి భ్రష్టులై పోవుదురు. నేనీ కట్టడి చేశాను జనులందరు దాన్ని అనుసరింపవలెను." అని శుక్రుడు మద్యపానాన్ని శపించాడు.

శుక్రాచార్యుడు సురాపానమును మహాపాతకముగా శపించి, తనయుదరమున నున్న కచుని వెంటనే బ్రతికించాడు. అప్పుడు కడుపులో నున్న కచుడు "ఓ పుణ్యాత్ముడా! నీ దయవలన దేహమును, ప్రాణమును, బలమును పొందాను. దయతో నాకు బయటకు వచ్చే మార్గం చెప్పండి" అని ప్రార్థించాడు. "నాయుదరము చీలిననే గాని, యీతడు బయటకు రాలేడు. పొట్టపగిలి మూర్ఛిల్లిన నన్ను బ్రతికింపవలసియుండు" నని తలంచిన శుక్రుడు కచునకు

---

మట్టెలందెయలవి / మాయమయ్యెను నేడు ; ఎత్తుచెప్పులొచ్చి / చిత్తుచేసె
టిక్కుటిక్కునడచి / టెక్కు చూపింతురు ; గళిత గర్వులార గౌడులార! ///

మృతసంజీవనీ మంత్రాన్నుపదేశించాడు. అప్పుడు కచుడు శుక్రుని ఉదరాన్ని చీల్చుకొని నిండుచందమామవలె బయటకు వచ్చి వెంటనే జీవములేకపడియున్న శుక్రుని బ్రతికించాడు. ఈవిధంగా యెంతో ప్రయాసతో కచుడు శుక్రునివలన మృతసంజీవనీ విద్యను సంపాదించాడు. చాలా కాలమైన తరువాత కచుడొకనాడు గురుని యనుమతి నొంది తన స్వర్గలోకమునకు బోదలచి, ఆ విషయం ప్రీతితో దేవయానికి చెప్పాడు. ఆమాటలు విన్న దేవయాని అతని యెడబాటును సహింపలేక దుఃఖిస్తూ, "బ్రాహ్మణశ్రేష్ఠుడవైన ఓ కచుడా! నీవు బ్రహ్మచారివి, సత్ప్రవర్తన గలవాడవు. నేను కన్యను. మనకిరువురకు యింతకుముందే మన్మధుని మహిమ (ప్రేమ) చేతనే పెండ్లి అయిపోయింది. నా తండ్రి దయచేత సంజీవనీ విద్యను పొందావు. దాంతోబాటు నన్ను కూడా పెండ్లాడి నాకానందాన్ని కల్గింపుమని ప్రాధేయపడింది.

దేవయాని మాటలు విన్న కచుడు మిక్కిలి విచారించి, "ఓ గురుపుత్రీ! నా మనస్సులో నిన్ను చెల్లెలుగా భావించాను. లోకనింద్య మైన మాటలు పలకడం నీవంటి దానికి మంచిది కాదు. నిజానికి శిష్యులు గురువులకు కుమారులు. ఇదిలోక ధర్మం. కామోద్రేకంతో నీవాసంగతిని మరిచి నట్లు మాట్లాడతగదు." అని హితోపదేశం చేశాడు.

తనకు తానై వలచినా కచుడు నిరాకరించాడనే కోపంతో "నీవు నాకోర్కె తీర్చక తిరస్కరించావు కనుక నీకు సంజీవనీ విద్య ఫలింపక విఫలమగు గాక!" అని శపించింది.

దానికి కచుడు "ఓ సోదరీ ! నేను ధర్మమార్గమును విడువని వాడను. నీ శాపఫలితంగా నాకు సంజీవనీ విద్య యుపయోగింపని యెడల నాచే నుపదేశమొందినవారికి బనిచేయునుగాక! మరియు నీవధర్మాన్ని తలపెట్టావు గనుక నిన్ను బ్రాహ్మణేతరుడు వివాహమాడుగాక!" అని ప్రతిశాపమిచ్చాడు. వెంటనే స్వర్గానికి పోయి దేవతలకు మృతసంజీవనీ విద్యనుపదేశించి వారికెంతగానో సాయపడి మేలు చేస్తున్నాడు.

---

కాల మహిమ యంచు / కామశాస్త్రము నంత ; బట్టబయలుగాక / పడతులెల్ల
బూతుకథలచదివి / పుస్తకములు దాచ ; చిన్నవారు చదివి / చెడిరి నేడు॥

# శౌనక శుక్ర సంవాదము

శౌనకః–

సురాపానా ద్వం చ నాం ప్రాపయిత్వా సంజ్ఞానాశం చేతసశ్చాప ఘోరమ్ ।
దృష్ట్వా కచం చాపి తథాభి రూపం పీతం తథా సురయా మోహితేన ।
సమన్యురుత్థాయ మహానుభావ స్తథోశనా విప్రహితం చికీర్షుః ।
కావ్యస్స్వయ మిదం జగాద సురాపానా త్ప్రత్య సంగత శఙ్కః ।

తా॥ శౌనకుడు సురాపానం వలన వంచితుడై చేతనారహితుడై కోపంతో శుక్రునకు అపచారం చేయదలిచిన వాడై యుండగా శుక్రుడు సురాపానం వలన శంకా రహితుడయ్యెను.

శుక్రః–

యో బ్రాహ్మణోద్య ప్రభృతీవా కశ్చిన్మోహాత్సురాం పాశ్యతి మన్దబుద్ధిః
అపేత ధర్మా బ్రహ్మహా చైవ సస్యా దస్మిన్లోకే గర్హితస్స్యాత్పరే చ ।
మయాచే మాం విప్రధర్మోక్త సీమా మర్యాదాంచ స్థాప్యతాం సర్వలోకే ।
సన్తో విప్రా శ్శుశ్రువాంసో గురూణాం దేవాలోకా శ్చోప శృణ్వన్తు సర్వే।

తా॥ యే బ్రాహ్మణుడు మోహంవలన సురాపానం చేయునో అతడు ధర్మముల నన్నియు నశింపచేసుకొని బ్రహ్మహత్యాపాపమును పొందును. ఈ విషయమును సర్వలోకములు గుర్తింతురు గాక!

శౌనకః

ఇతీద ముక్త్వా సమహానుభావ స్తపోనిధీనాం నిధిర ప్రమేయః
తాం న్దాన వాంశ్చైవ విమూఢ బుద్ధీ నిదం సమాహూయ వచోభ్యువాచ।

తా॥ ఈ విధంగా చెప్పిన తపోనిధియై మహానుభావుడైన శుక్రుడా రాక్షసులను జయించి యిట్లు పలికెను.

శుక్రః–

ఆచక్షేపో దానవా బాలిశాస్తు శిష్యః కచోవత్స్య తి మత్సమీపే
సంజీవనీ ప్రాప్య విద్యామమాయాం తుల్యప్రభావో బ్రాహ్మణో బ్రహ్మభూతః

---

వర్ష మాస వార । పత్రికల్ గలవారు ; సెక్సుకథలనన్ని । చేర్చి కూర్చి
రచన చేసివాటి । రయమున ముద్రించి ; జనుల కందజేయ। జారులైరి ॥

తా॥ రాక్షసులందరు మూర్ఖులు. శిష్యుడైన కచుడు నావద్దనే మృతసంజీవనీ విద్యను పొంది నాతో సమానమైన ప్రభావము కలవాడై పవిత్రుడైన బ్రాహ్మణుడుగా నున్నాడు.

**శౌనకః–**

గురో ఋషే స్స కాశేచ దశవర్ష శతాని చ ।
అనుజాతః కచోగన్తు మియేష త్రిదశాలయమ్ ।

తా॥ కచుడు గురువును సేవిస్తూ వేయి సంవత్సరములు గురువు వద్ద వుండి స్వర్గలోకమునకు పోయెను.

ఇది మత్స్యపురాణము. పంచవింశతి అధ్యాయంలో శ్లో॥56-64 వఱకు గల దాని సంగ్రహము.

# అత్రిముని వంశ వృక్షము

అత్రిమహర్షి - నవ బ్రాహ్మలలో మూడవవాడు. (భార్య - అనసూయ) కుమారుడు కాండిన్య ఋషి - (భార్య) మాయాకన్య ఈమె ప్రదేవ-సుమంతులకుమార్తె. వీరి సంతతి : (1) కౌండిల్యుడు (2) ఆయుధర్ముడు (3) వామాక్షుడు (4) దేవాశ్రయుడు.

---

మంచి పనులు చేసి / మాన్యత పొందండి ; పరుల సుఖము కొరకు / పాటుపడుచు జన్మసార్థకతను / సాధింపగా వలె ; నేటి నవ్య యువతి / నిజము గనుమ //

పై వారి భార్యలు :
(1) (స్ఫురద్రూపి), (2) (విమలాదేవి) (3) (నిర్మలాదేవి) (4) (కుశలాదేవి)

ఈ నలుగురు కుమారులకు జన్మించిన వారు దేవగౌడులు. కాండిల్యునికి స్ఫురద్రూపి యందు నారాయణుడను వాడు జన్మించెను.

ఈ నారాయణునికి తన్వియనే భార్య యందు
ఉద్దాలకుడు - (భార్య ) తేజః ప్రభ
శౌణకర్ణి
శాత్ర ధవ్యుడు
గౌర గ్రీవుడు
వాగ్వై రజితుడు (భార్య) ఆహూతి
అరణ్యుడు
వామ రథ్యుడు
గోపనాథ్వుడు (భార్య) కళ్యాణి
గోపాలుడు (గోపాల గౌడు) భార్య - వీరమాంబ
కాటమగౌడు (కాటమ మహేశ్వరుడు )

# సర్దార్ సర్వాయి పాపన్న

ఈ గౌడకులాలంకారుని చరిత్ర ఉర్దూ, పార్శీ భాషలలో నున్నది. దాన్ని నామేన మామగారైన స్వర్గీయ మార్గాని సుబ్బారావుగారు తెనిగించి తన "గౌడ వంశోత్పత్తి మార్తాండ" మనే గ్రంథంలో వ్రాశారు. దానికి నా పరిశోధనలో లభించిన కొన్ని విషయాలు కలిపి వివరించాను.

యీ చరిత్రను 1906 సంగలో మద్రాసులోని షాహుకారు పేటలోనున్న ఉప్పల గౌరయ్య శెట్టి అనునతడు చిన్న గేయసంపుటిగా ప్రకటించాడు. దీనికి ముందు అనగా 1874 సంగనకు ముందు కూడా యీ గీతములు బళ్ళారిలో ఒక బోయవాడు పాడుచుండగా తెలుగు భాషయందభిమానముగల J.A.బోయల్ దొరగారు విని యెంతో ఆనందించి యట్టి మహావీరుని చరిత్ర కాలగర్భంలో కలిసి పోకూడదని యెంచి "ఇండియన్ ఫోక్ సాంగ్స్" అనే ఒక చిన్న వ్యాసం వ్రాసి దాన్ని "ఇండియన్ ఆంటిక్వెరీ" అనే పత్రికకు పంపగా వారందలి మూడు ఘట్టాలను మాత్రమే ప్రచురించారు. అందులో మొదటిది పాపడు సైనికుడై యుద్ధ భూమికి పోవుచు తనతల్లి వద్ద సెలవు తీసికొన్న ఘట్టం, రెండవది పాపనిపేరు చెపితే రాజులకు, జమిందారులకు భయం కల్గించిన ఘట్టం, మూడవది పాపడు వీర స్వర్గము లంకరించిన ఘట్టము.

ఇదికాక నవాబుల పాలనలో మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన చరిత్రలో పాపడు ఔరంగజేబు పాదుషా యంత్యకాలమున నున్నవాడని, హైద్రాబాదు, వరంగల్ మొదలగు ప్రాంతాలపై మనపాపడు దండెత్తి కోటలను ముట్టడించుచు, నగరములను కొల్లగొట్టుచు, పాదుషాకు పక్కలోని బళ్ళెమై అహర్నిశలు వేధించుచుండుటం బట్టి మహమ్మదీయులతనిని సర్దారుగా అంగీకరింపక ఒక బందిపోటు దొంగగా, ప్రజలను హింసించే క్రూరుడుగా, వర్ణించుటలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. పాపన్నను వారొక జాగీరుదారునిగా అంగీకరించుట వారికి తలవంపు. ఆరోజుల్లో బలమున్న వాడే రాజు.

---

తిండిగింజలెన్నొ / పండించి జనులకు ; మేలు బదులు కీడు / చాల చేసె
స్వార్థపరులు నేడు / సంపద పరు లైరి; గౌడులార కీర్తి / కలితులార ॥

స్వశక్తితో శత్రు రాజులనోడించి సంపాదించిన భూభాగమే వారి రాజ్యంగా పరిగణింపబడేది.

గౌడులు అనాదిగా స్వతంత్రేచ్ఛ గలవారై సర్వస్వతంత్ర సత్తా గల రాజ్యాలను స్థాపించి వాటికి పాలకులై, ధర్మప్రవర్తనులై, యితరులను లెక్క సేయక ప్రజానురంజకంగా రాజ్యపాలన చేసినట్లు చరిత్ర చెప్పుతుంది. అట్టిగౌరవ ప్రపత్తులు గల గౌడుల ప్రతిష్ట గనిన మహమ్మదీయ చక్రవర్తులు సహింపలేక యీ గౌడులను పూర్తిగా అణగద్రొక్కాలనే దుర్బుద్ధితో నిరంకుశాధికారం చలాయించి వారిని పీడించినా ఆ కాలపు గౌడులు వారి శాసనములను ధిక్కరించి, సత్యప్రవర్తనులై ప్రజామన్ననలను పొంది యుండిరనుట సుస్పష్టము. యావద్భారతావనిని తన హస్తగతం చేసికొని పరిపాలన సాగించిన ఢిల్లీ చక్రవర్తి ఔరంగజేబు అవసానకాలంలో తెలంగాణా ప్రాంత విముక్తికై విజృంభించి మొగల్ సైన్యముల నెదుర్కొని తెలుగు గడ్డ నుండి తురక సర్దారులను తరిమికొట్టిన వాడీ సర్వాయి పాపడు. మొగలు సార్వభౌముడైన ఔరంగజేబును ముప్పుతిప్పలు పెట్టిన ఛత్రపతి శివాజీ, మహారాష్ట్రమును వశపర్చుకొని స్వతంత్రంగా పరిపాలన సాగించిన సమయమునందే యించుమించుగా నాతని సమకాలికుడై తెలంగాణమునందును సర్వాయి పాపారాయడట్టి ప్రయత్నమే చేసినాడు. కాని తత్సాధనోపాయములు, ఫలితములు యిరువురకు భిన్నముగా నున్నవి.

## పాపన్న బాల్యము

"ఫోక్ సాంగ్సు"

పుట్టినాది బెల్గామూ – పెరిగినాది తాటికొండా
కులమందు గమళ్ళవాడు – ఇంటిపేరు నాశనోళ్ళు
పేరు సరదారి పాపన్న – ఆరాయుడూ ।

అనుట వలన యితని జన్మస్థానము బెల్గామనియు, ఇతడు పెరిగినది తాటికొండనియు, కులము గౌడులనియు, ఇంటిపేరు నాశనోళ్ళనియు,

---

నాస్తికత్వమెపుడు । నాశనంబొనరించు ; ఆస్తికత్వమున్న । నన్నియమరు
విశ్వకర్త నెవడు । విస్మరింపగరాదు ; భవ్యులారగౌడ । వంశ్యులార ॥

పేరు సర్దార్ పాపన్న అని తెలుస్తుంది. (ప్రస్తుతం నాశన యింటిపేరుగల వారు ప్రకాశం జిల్లా చీరాల, పేరాల, మొదలగు చోట్ల, గుంటూరుజిల్లా బాపట్ల వగైరా ప్రాంతాల్లో వున్నారు.). వరంగల్ జిల్లా తాటికొండ వాస్తవ్యుడు నాశన పాపారాయుడు. ఇతడు మొదట ఆవుల్ని మేపుకుంటూ కల్లు గీచుకొని జీవితము గడుపువాడు. అతని గోపాల జీవితమిట్లు వర్ణింపబడింది.

ఆవులదొడ్డి కాడి కొచ్చి-దొడ్డి తడికె వాడు తీసెరా
పిల్లనగ్రోవి వూదుతున్నాడు-ఆ రాయుడూ
యెనకా యేనూరు ఆవులు-ముందరా మున్నూరు ఆవులు
ఈనికావు వేరుపడ్డాది-శనగచేలే పరగమేపెనామందను
జొన్నచేలే పరగ మేపెనురా-ఆరాయుడూ!
నక్కలమ్మ గుంట కాడ-ఆవులకు నీళ్ళుపెట్టి
చెట్టునీడ నిద్రపోతాడూ-ఆ రాయుడూ!

ఈ విధంగా ఆవులను మేపుకుంటూ వాటినన్నింటిని మధ్యాహ్నపు వేళ అరణ్య మధ్యమందుగల నక్కలమ్మ చెరువులో నీరు త్రాగించి మర్రిచెట్టు నీడను తాను హాయిగా నిద్రించేవాడు. ఇది పాపని దినచర్య. ఒక నాడతడు నిద్రించుచుండగా తీవ్రమైన యెండ అతని ముఖం మీద పడుతుంది. ఆ యెండ అతనికి తగలకుండా ఒక పెద్ద నాగుపాముపచ్చి తన పడగను విప్పి అతనికి గొడుగు పడుతుంది. ఆసమయంలో ఆ మార్గం గుండా కాశీనుండి రామేశ్వరం పోయే బ్రాహ్మణ యాత్రికులా వింతదృశ్యాన్ని చూచి ఆశ్చర్య చకితులై ఆ నాగుబాముకు నమస్కరింపగా అది అడవిలోకి వెళ్ళిపోయింది. తరువాత ఆ యాత్రికులలో జ్యోతిషం తెలిసిన పండితుడొకడు ఆ బాలుని లేపి జరిగిన విషయమంతా చెప్పి "నాయనా! నీకు మహారాజయోగముంది. నీవు త్వరలోనే రాజువౌతావు'. అనిదీవించి వెళ్ళిపోయారు. ఆపండితుడు చెప్పిన మాటలు మనపాపన్న జీవితాన్నే మార్చివేశాయి. వెంటనే అతడు యింటికి వెళ్లి తల్లితో యీ విషయ మంతా చెప్పియికనుండి తనకు కలుగబోయే మహర్దశకు తగిన పనులే చెప్పమని కోరాడు. ఆతల్లి కొడుకుల

---

పూజ్యులైనవార్ని / పూజ సేవకుండిన ; పుణ్యఫలము సిరులు / పొవునిజము
పుడమిలోనబుట్టి / పూతులై మెలగురో; కలిత సుగుణులార / గౌడులార!

సంభాషణపాట-వానికి తల్లి సమాధానము చదవండి.

## (1) పాపన్న తల్లి వద్దనుండి సెలవు తీసికొనుటః

పాపన్న - తల్లి కొలువుకు వడిగ వెళ్ళెను-తల్లికి దండంపెట్టి నిలచెను.
ఏరుకట్టి వ్యవసాయము, అమ్మ--ఎంగిలి ముంతలు ఎత్తలేను.
కొడతాను గోల్కొండ పట్టణాన్ని-ఢిల్లీకి మోజూర్ అవుతాను నేను
మూడు ఘడియల్లో బందరు కొడ్తాను-మూల కోట కందవోలు చూచి
బంగరు కడియాల్ పెట్టుదును-మన కన్న బంట్రోతుతనమేల?

(2) తల్లి - వినరా సర్దారిపాప! - పరవిద్యలెన్నియైనా
కులవిద్యకు సాటిరావు-సర్దారు పాప
ఇంటియావుల మేపుమంటాది-సర్వమ్మతల్లి॥
ఈతచెట్టుగీయమంటాది-సర్వమ్మతల్లి॥
తాటికల్లే కట్టమంటాది -సర్వమ్మతల్లి॥
ఈత కల్లే కట్టమంటాది-సర్వమ్మతల్లి॥
ఈతబెల్లం వండమంటాది-సర్వమ్మతల్లి॥

దీన్ని బట్టి యితని తల్లిపేరు సర్వమ్మ అని అందువలననే యతడు మాతృనామంతో సర్వాయి పాపన్నగా ప్రసిద్ధి పొందాడని తెలుస్తుంది. కాని యితని తండ్రి పేరు యెక్కడా చెప్పబడియుండలేదు.

తల్లి సర్వమ్మ కొడుకు చెప్పిన మాటలు నమ్మక కులవృత్తినే చేయుమని నిర్బంధించేది. తల్లి మాటలు పాపనికి రుచింపలేదు. తన దృష్టియెంతసేపూ తనకు పట్టబోయే రాజయోగముమీదనే ఆలోచన సాగిస్తుంది. తన రాజయోగానికి సరిపడ్డ పనులు చేసి గొప్ప మొనగాడు కావాలనే కోర్కె నానాటికి బలపడింది. పట్టణాల్లో నివశించే ధనవంతుల్ని, జమిందారుల్ని, రాజుల్ని కొల్లగొట్టి ఆధనంతో పేదలకు సాయపడాలనే ప్రగాఢ వాంఛ అంకురించి మొలకెత్తింది.

---

*కష్టములను చూచి / కంగారుపడువారు; దేవుడన్న వాని / తిట్టుచుండ్రు*
*కారణంబు లేక / కడగండ్లు రావయ్య; నిజము తెలియలేరు / నేర మతులు॥*

ఈదులు గీస్తే యీంద్రవాడు–కల్లు కట్టితే గమండ్లవాడు
కత్తి పట్టితే మేదరవాడు–కుండ పట్టితే కుమ్మరివాడు
మొనగా డిచ్చుట మెచ్చునా–సర్వమ్మ తల్లీ!
పౌరెగా డిచ్చుట మెచ్చునా–సర్వమ్మ తల్లీ!

అతని ఆలోచనలు గొప్పవి. తన కోరిక సఫలమై కార్యరూపం దాల్చడానికెంతో ధనం కావాలని నిశ్చయించుకున్నాడు.

ఊరు కొడితే యేమి ఫలము–పల్లెకొడితే యేమి ఫలము
కొడితే గోల్కొండ కొట్టాలె–సర్వమ్మతల్లీ
నెల్లూరు బస్తీలు కొట్టాలె–సర్వమ్మతల్లీ
కందవోట మహల్ కొట్టాలె–సర్వమ్మతల్లీ
మైసూరు దేశం కొట్టాలే–సర్వమ్మతల్లీ
మీసము గిరగిరా త్రిప్పేనూ–సర్దారు పాపడు!

పాపన్న అసామాన్య వీరుడు. పౌరుష పరాక్రమములతని సొత్తు. అతడు విజృంభించిన ఆపగలశక్తి, యెదురునిల్చి పోరాడే ధైర్యం ఆనాట రాజుల్లో యెవరికీ లేదు. పాపన్నపేరు వింటేనే ధనవంతులంతా గడగడా వణికేవారు. అతని దర్శనం యమదర్శనంలా భావించి జోహార్లర్పించి అతనికి సర్వస్వం ధారపోసేవారు. గోల్కొండ, నెల్లూరు, బందరు, కడప మొదలగు పట్టణాల లోని ప్రజలందరు భయంతో కంపించి పోయేవారు. అతని పరాక్రమమెంత భయావహమో చూడండి.

అబ్బా! అబ్బా! పాపనాక్క పేరుచెబితే–ఊరపిచ్చుక పొలము చేరదు
పిట్ట పిచ్చుక ఊరుచేరదు
కౌజులు కారాడుతుండును–నక్కలు నాట్యము త్రొక్కును
పందికొక్కుడోల్ కొడతాడో – వాడంటే
దొంతి కుండలు గంతులేస్తావి – వాడంటే
పసిబిడ్డలు పాలు తాగరుగా – వాడంటే

---

మనిషి మంచిగోరు / మాన్యులు లేరెందు ; దైవమొక్కడెగను / దీనులనుచు
నమ్ముకొన్న వార్ని / నమ్మ చేయ డెపుడు ; గళిత గర్వులార / గౌడులార ॥

గుజ్జాలు గుగ్గిల్ళు తినవు – వాడి పేరంటే
తల్లీ దర్పం దొణుకు – గోల్కొండ బస్తీ లొణుకు
నెల్లూరు బస్తీ లొణుకు – బందరు బస్తీ లొణుకు
కడప జిల్లా జిల్లా లొణుకు – వాడి పేరు వింటే.

(2) పాపని పేరన్న గల భయాన్ని వర్ణించేది.
అడుగో పాపడు వస్తాడంటే – కుందేళ్ళూ కూలబడెను
లేడి పిల్లలు లేవ లేవు – పసిబిడ్డలు పాలు త్రాగవు
నక్కలు సింహాలు తొక్కుల్ళాడును –
పాపన్న పేరుచెపితే మహమ్మదీయరాజుల గుండెలు పగిలేవి.

పాపన్న తల్లి మాటలను వినలేదు. రాజపదవిని పొందాలనే ఉత్సాహమతనికి ద్విగుణీకృతమగుచుండెను. తన సంకల్పం నెరవేర్చుకొనుటకు ధనముకావాలి. యుద్ధ సామగ్రికావాలి. కోటలు కట్టాలి. వీరోచితంగా పోరాడాలి. ఈ ప్రాంతానికంతకు ప్రభువుని కావాలి. ఇట్టి ఆశయాలతో పాపన్న కొందరు నేస్తగాండ్రను కూర్చుకొని కల్లు తీయుటకు బయలుదేరాడు. త్రోవలో చాకలి యెల్లి తుమ్మింది. పన్నెండు మంది నేస్తాలతో। శకున మెల్లి వస్తుంటే। చాకలి యెల్లి ఒక్కమైన। చిక్కు తీసి కొప్పు బెట్టి। శ్రీగంధపు చుక్కబెట్టి। హంసలా మొగ్గాల రవికె। ఠీకు మీద తొడిగినాది । కండ్లకు కాటీక వేసీ। పండ్లుకు దాసీనా వేసి। జోర్ మెట్లు వేసుకోని। బొమ్మంచు చీర గట్టి। పిల్లవాణ్ణి చంక పెట్టి। కూటి బుట్ట యెత్తుకోని। యెదురుగూండ తాను వచ్చి। పెళ్ళు పెళ్ళున తుమ్ముతున్నాది ఆ యెల్లమ్మ. దానికి కోపించిన పాపడు దానికి తగిన శాస్తి చేసి ముందుకు సాగాడు. అతనికి ఎరుకల నాంచారి యెదురయ్యింది. ఎరుక చెప్పుమని బెదిరించాడు. ఏడు గడియలు గోలుకొండను పాలింతువని నాంచారి గద్దె చెప్పింది. ఇప్పుడు పాపన్న సంతోషానికి మేర లేకుండెను. నేస్త గాండ్రతో కలిసి తాటి తోపులో ప్రవేశించాడు. అచ్చటి తాటి చెట్లు స్వయంగా వంగినవట ! అప్పుడు

---

*మనిషి మంచిగోరు । మాన్యులు లేరెందు ; దైవమొక్కడెగను । దీనులనుచు నమ్ముకున్న వార్ని । వమ్ము చేయడెపుడు ; గళిత గర్వులార । గౌడులార ॥*

లొట్ల లోని కల్లును వారంతా తృప్తిగా త్రాగినారట ! ఆ త్రాడుగు మైకంతో పాపడు యింటికి వెళ్ళాడు.

## పాపన్న గోల్కొండ సింహాసన మధిష్టించుట :

తన నాయకత్వంలో గోల్కొండ కోటను ముట్టడించాలని దృఢంగా సంకల్పించుకున్నాడు. సైనికులకు భోజనాదికములకు డబ్బు కావాలి గనుక తన తాతతండ్రులు సంపాదించిన తరగని ధనం తన తల్లి వద్ద వున్నదని తెల్సికొని ఆ ధనమున్న చోటును చెప్పుమని నిర్బంధించి ఆమెను బాధింపగా ఆ బాధల కోర్వలేక ఆమె భూమిలో పాతి వుంచిన ధనాగారం చూపించింది. సంతసించిన పాపన్న భూమిని త్రవ్వి అందులో నుండి ఏడు కొప్పెర్ల ధనాన్ని తీసికొన్నాడు. కొప్పెర అనగా వెయ్యి రూపాయలు. పాతర దగ్గర కావలిగా నున్న యెల్లమ్మ అనే దేవతకూడా పాపనికి భయపడెనట! తాను కష్టపడి సంపాదించిన డబ్బు కల్లు అమ్మకం తాలుకు కూడబెట్టిన మొత్తం ఐదువేలు కలిపి మొత్తం పండ్రెండు వేల రూపాయలతో యుద్ధ సామాగ్రియైన కత్తులు, బళ్ళాలు, బాణాలు , ఈటెలు, కొప్పెరాలు, యినుప గుదియలు మొదలుగాగల యుద్ధోపకరణాలను తయారుచేయించు కొని హసేన్, హుస్సేన్, హిమాం, దూదేకుల పీరు, కుమ్మరి గోవిందన్న, జక్కుల పెరుమాళ్ళు, నెల్లూరి హనుమంతు, చాకలి సర్వన్న, మంగలి మాసన్న మొదలగు వారు ముఖ్యులు గాను, వీరికి కొత్వాల్ మీరా సాహేబు నాయకుడుగాను పండ్రెండు వేల రాణువను గల అపార సేనావాహినితో గోల్కొండ పైకి దండెత్తాడు.

పన్నెండు వేలకే దండురాణువను వెంబడి తోడ్కొని
గోలకొండకే యుద్ధానికే ప్రయాణమైనాడు
ఈటె చువ్వలా బారులు ముందుగ తర్లుతూ వున్నాది.
కత్తుల యొక్క బారు వెనుకనే తర్లుతూ వున్నాది.
పన్నెండు కొప్పెర్ల ధనము గనుకనే దండుకు పంచెనురా

---

ఎప్పుడేది యగునా / యెరుగనేరితరంబు ; యెరుగు వాడు గాదె / పరమ పురుష
డట్టివాని నెప్పు / డందరు కొలువుడు ; గౌడులార కీర్తి / కలితులార //

దండు దళమునే తీసుకొని ప్రయాణమైనాడు
గోలకొండకే వర్థిజాబులే తాను బంపినాడు.

పాపన్న దండు గోల్కొండ కోటను ముట్టడించింది. నవాబు దండుకు పాపన్న దండుకు మధ్య ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధ వర్ణన యీ విధంగా వుంది.

రెండుగా తల పట్టా తొడిగె సర్దారి పాపడు
కయ్యానికైతే దూకినాడుగా దండు మీదికే
పొడు పొడు పొడు పొడు పొడుమంటాడు సర్దారి పాపడు
గిర గిర గిర గిర గిర మంటూ పట్టాలు తిరిగి నాయీ
కొట్టె తేనుగా పడియున్నావీ క్రొవ్విన దేహాలు
నరికి తేను పడి వున్నావి శిరసులు ప్రేగులు
అప్పుడు తిన్నా పప్పు అన్నమే తెప్పలు పడుతుంది.
ఎగిరే వక్కా శిరస్సు లాకు ఏడాసందు లేదు
వ్రాలేటివో శిరసులాకు ఏడా సందు లేదు
ఏడు గడియలు యుద్ధమాయెను గోలుకొండ మీద ।

పాపడు తన అనుపమాన శౌర్య పరాక్రమాలతో అబేధ్యమైన తురుష్క సైన్యాన్ని చీల్చి చెండాడి కోటను వశపర్చుకున్నాను. పాపన్న ధాటి కాగ లేని నవాబు ప్రాణ భీతితో పారిపోయాడు. పాపన్న గోల్కొండ సింహాసనాన్ని అధిష్టించి రాజై రాజ్యపాలన చేసి తన చిరకాల వాంఛ నెరవేర్చుకొని బాల్యంలో పండితుడు చెప్పిన జోస్యాన్ని నిజం చేసి తన పంతాన్ని నెగ్గించు కొన్నాడు. దీన్ని బట్టి ఆకాలంలో మన జాతీయులలో యిట్టి వీర పౌరుషం గల యువకులున్నారని తమ అప్రతిహత శౌర్య, ధైర్య, పరాక్రమాలతో శత్రురాజుల నోడించి రాజ్యములను స్థాపించెనని విశదమగుచున్నది. (ఈ పరిపాలన మహమ్మదీయుల చరిత్రలయందు యేడు ఘడియలని వుంది)

**పాపన్న నిర్మించిన దుర్గములు :** పాపన్న తన బాహుబలంతోను,

---

*తానొకండు దలుప । తాత యొండు తలంచు; కోరుకున్న వన్ని । కూడిరావు*
*దైవబలముతోడ । తిరుగును నన్నియు; భవ్యులార గౌడ । వంశ్యులార ॥*

అసమానధైర్య సాహసములతోనూ, నిజాం రాజ్యమందలి నల్గొండ పరగణా భోనగిరి సర్కారులోని "షాహపూర" మందొక అత్యంత బలిష్టమైన దుర్గాన్ని పట్టణాన్ని నిర్మించి తన రాజ్యానికి రాజధానినిగా చేసికొని తరువాత తాడికొండ దుర్గాన్నికూడా నిర్మించి, దుర్గాధిపతియై సమయము దొరికి నప్పుడల్లా మహమ్మదీయ రాజ్యములపై దండెత్తి వారి కుపద్రవమును కల్పించి రణకండూతితో రాజ్యమును విస్తరింపజేసి ప్రజానురంజకంగా రాజ్యపాలన గావించెను. పాపన్న ఔరంగజేబు చివరిరోజులలో నున్నట్లు, అప్పుడతని రాజ్యంలోని హైద్రాబాదు, వరంగల్లు ప్రాంతములపై దాడి చేసి కోటలను ముట్టడిస్తూ, నగరములను కొల్లగొడుతూ వచ్చినందున ఔరంగజేబు పాదుషా చరిత్ర వ్రాయునప్పుడు మహమ్మదీయ చరిత్రకారులీతని చరిత్ర కూడా వ్రాయక తప్పింది కాదు. చరిత్ర దృష్టితో పాపారాయడి జీవిత విశేషాలు తెలిసికొనుట మహ్మదీయులు వ్రాసిన చరిత్ర గ్రంథములు తప్ప యితర ఆధారములు లేవు. ఈ ఆధారం చరిత్ర గ్రంధములలో ఖాసింఖాన్ రచన నొకటి. T.W. Haig వ్రాసిన " Historic land Marks of Daccan" అనే గ్రంథంలో పాపని గురించిన కొద్దిగా ప్రాస్తవన వుంది.

పాపారాయునికి చాలా ధనము ఆస్థి గల ఒక వితంతు సోదరి వుండేది. అతడొక నాడామెను చూచుటకు వెళ్ళి నాలుగైదు దినములామె యింట నున్న తరువాత అతని కళ్ళు ఆమె అపారధనరాశుల మీద పడింది. ఆ ధనాన్ని తన సైన్యాభివృద్ధికిమ్మని అడిగాడు. అమె నిరాకరింపగా, కొంతమంది అనుయాయులతో అతడామె నత్యంత క్రూరంగా, దారుణంగా హింసించి, నూనెగుడ్డలు కట్టి వెలిగించిన దివ్విటీలతో ఆమె శరీరమంతా కాల్పించి ఆమె వద్ద నున్న యావత్తు ధనాన్ని, నగల్ని తీసికొని దాంతో కొంత కాల్బలాన్ని కూర్చుకొని తిరిగి మహమ్మదీయ జాగీరుదార్లను కొల్లగొట్ట నారంభించాడు. ఫౌజుదార్లు, జమిందార్లు యీతని దుండగములను సహింపలేక అతన్ని చెరబట్ట నిశ్చయించారు. చారుల వలన వారి పన్నాగాన్ని తెలిసికొన్న పాపడు వెలిగందల పరగణాయందలి "కోలాస్" జమిందారు వెంకట్రావు

---

పుట్టెడాముదమును / పూసుకు దొర్లిన ; అంట బోదు చిన్న / అణువునైన
ఆశలన్ని గూడ / అడియాసలగుచుండు ; కలిత సుగుణులార / గౌడులార ॥

వద్దకు వెళ్ళి వానితో స్నేహం చేసి వాని వద్ద కొన్నాళ్ళు వున్నాడు. ఆ సమయంలో ఆ జమిందారు కొలువులో నున్న హనుమంతు అనేడి మరియొకనితో కూడి జమిందారుని అనుమతి లేకుండా వారిరువురు తిరిగి దండయాత్రలు సాగించారు. అది గ్రహించిన వెంకట్రావు యితన్ని పట్టి బంధించి కారాగారంలో వుంచాడు. ఈ లోగా వెంకట్రావు కుమారునికి జబ్బు చేసింది. తన కుమారునికి జబ్బునయమైతే ఖైదీల నందర్ని విడిపిస్తానని వెంకట్రావు భార్య మ్రొక్కుకొని ప్రతిజ్ఞ చేసింది. పాపన్న అదృష్టం కొద్దీ వెంకట్రావు కుమారుడు రోగవిముక్తుడవగా అతని భార్య ఖైదీల నందర్ని విడిపించింది. పాపడు అందరి ఖైదీలతో బాటు విడిపంపబడ్డాడు.

బంధవిముక్తుడైన పాపరాయుడు "సర్వాయ" అనువానితో కలిసి నల్లగొండ పరగణా బోనగిరి సర్కారులో "షాహాపురం" వెళ్ళి అక్కడ కొందర్ని తన సైన్యంలో చేర్చుకొని షాహాపురం వద్ద నున్న ఒక పెద్ద గుట్ట మీద మరొక మట్టికోటను కట్టించాడు. ఆ దుర్గం, దాని పరసర ప్రాంతాలు యితనికి చాలా అనుకూలంగా వుండేవి.

ఈతని వైభవానికి కన్నెర్రనైన "కుల్పాల్" పరగణా (యిది షాహాపురానికి యెనిమిది క్రోసుల దూరంలో వుంది) పౌజుదారైన ఖాసింఖాన్ అనునతడు తన సైన్యాధ్యక్షుడైన ఆఫ్ఘన్ అనువానికి కొంత సైన్యాన్నిచ్చి పాపన్న మీదికి పంపాడు. మన పాపన్న ఆఫ్ఘన్‌ను త్రుటి కాలంలో వధించి వాని సైన్యం వద్ద నున్న ఫిరంగులు, తుపాకులు మొదలైన ఆయుధాలన్నీ వశపర్చుకొని సైనికుల్ని తరిమికొట్టాడు. ఈ సంగతి తెలిసికొన్న ఖాసింఖాన్ గొప్ప సైన్యంతో వచ్చి పాపన్నను యెదుర్కొని వాని సైనికుల్ని చాలా మందిని హతమార్చాడు. అది చూచి కోపోద్రిక్తుడై పాపన్న తుపాకితో ఖాసింఖాన్‌ను కాల్చి చంపాడు.నాయకుడు చనిపోగానే తురుష్క సైన్యం చెల్లా చదురై పారిపోయింది. తిరిగి మహమ్మదీయులు గొప్ప సేనలతో వచ్చి పాపన్నతో ఢీ కొన్నారు. ఈ యుద్ధం రెండు నెలల వరకు జరిగింది. అప్పుడు తన బలం తగ్గిందని గ్రహించిన పాపన్న యెలాగో

---

*శివుని ఆజ్ఞ లేక / చీమైన కదలదు ; తెలియ లేరు మాయ / తెలివి లేక*
*నడుపు చుండు మనల / నాటకం బాడించి / కలిత విభవులార / గౌడులార //*

తప్పించుకొని పారిపోయేడు. అప్పుడు తురకలా మట్టికోటను నాశనం చేశారు.

మహమ్మదీయ సైనికులు వెళ్లిపోయిన తరువాత తిరిగి పాపన్న షాపూరంలో మట్టి కోటకు బదులు ఊతి తోనూ సున్నంతోను ఒక సుదృఢమైన క్రొత్త కోటను నిర్మించి అందులో ఫిరంగులు, తుపాకులు మొదలగు ఆయుధాలు సమకూర్చి కట్టు దిట్టం చేసి ద్విగుణీకృతోత్సాహంతో పాపన్న యీ సారి షాహాపురానికి ఇరువది క్రోసుల దూరమున నున్న పరగణా లన్నీ దోచుకున్నాడు. ప్రజలంతా హాహాకారాలు చేశారు. పాపన్న దుండగాల్ని సహించలేని సామంతరాజు లితన్ని పట్టి తగు శిక్ష విధింపవలసిందిగా ఔరంగజేబు పాదుషాను ప్రార్థించారు. అప్పుడు ఔరంగజేబు కొలిపాకలో సర్దారుగా నున్న "రుస్తుందిల్ ఖాన్" అను వానిని హైద్రాబాదు సుబేదారుగా నియమించి పాపారాయుని పట్టి బంధింపమని ఆజ్ఞాపించాడు. వెంటనే అతడు గొప్ప సైన్యంతో పాపన్న మీదికి వచ్చాడు. (ఇతని పేరు కొన్ని చరిత్రలలో పుర్‌దిల్ ఖాన్ అని వుంది.) అతడు పాపన్న చెలికాడైన చాకలి "సర్వాయ"తో తలపడి అతన్నిచంపి తరువాత పాపన్నతో మూడు నెలలు యుద్ధం చేసినా పాపన్నను జయింపలేక పోయాడు. తుదకు రుస్తుందిల్ ఖాన్ పాపన్న అజేయుడని గ్రహించి అతని బాహు విక్రమానికి జోహార్లర్పించి అతని వద్ద నుండి అమూల్య కానుకలను బహుమతిగా గ్రహించి వెళ్ళిపోయాడు. దీన్ని లంచమనడానికి, కప్పమనడానికి వీలు లేదు. ఎందుకనగా దీనికి ముందుగాని వెనుక గాని పాపన్న అట్టి బహుమతులు యే సుబేదారుకు యిచ్చి యుండలేదని, రుస్తుందిల్ ఖాన్, వెళ్ళిన తరువాత కూడా పాపన్న యథావిధిగా తన కార్యక్రమాలు సాగించాడని చరిత్ర చెప్పుతుంది. కొన్ని గ్రంథాల్లో పాపన్నను తీవ్రంగా గాయపరిచాడని, కొన్నింటిలో పాపన్న చేతిలో రుస్తుందిల్ ఖాన్ హతుడయ్యాడని పర్స్పర విరుద్ధమైన వ్రాతలున్నాయి. వీటిలోని నిజనిజాలు తెలియలేదు.

తరువాత పాపన్న విజృంభించి యుద్ధసామాగ్రిని సైన్యాన్ని అభివృద్ధి

---

కాల గతియె గాదె / కనుమాయ కలిగించి ; ఘనులనైన మార్చు / క్షణములోన
శాసకులను గూడ / శాసించి వారిని ; తలక్రిందుజేయు / దాని మహిమ //

చేసికొని కోటలు వశపర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఔరంగజేబు మరణానంతరము క్రీ. శ. 1707లో అతని కుమార్డు కాంబక్ష్ వింజాపురం హైద్రాబాదు రాజ్యాలకు పాలకుడయ్యాడు. ఇతని కాలంలో పాపారాయుని అణచుటకు గట్టి ప్రయత్నాలేవీ జరుగలేదు. అయినా అప్పుడప్పుడు మహమ్మదీయ సైన్యాధిపతులు దాడులు చేస్తుండేవారు. ఓటమి యెరుగని పాపన్న ఆ దాడులను సునాయాసంగా త్రిప్పి కొట్టి తానే గెలుచుచుండుట వలన, కాంబక్ష్ కూడా తన్నెదుర్కొడానికి తగినన్ని గట్టి ప్రయత్నాలు చేయకపోవడం వలన పాపారాయునికి మరింత ప్రోత్సాహం కలిగి షాహాపురానికి ముప్పది మైళ్ళదూరంలో నున్న వరంగల్ నగరము పైకి దండెత్తాడు.

**పాపన్న ఓరుగల్లు కోటను ముట్టడించుట :** ఇట్టి విజయగర్వంతో పాపడు క్రీ॥ శ॥ 1708 సంవత్సర మొహరం పండుగ పదవనాడు హిందూ ముస్లిము లందరు ఉత్సవ వేడుకల్లో పాల్గొని వినోదాలతో తన్మయులై యున్న సమయంలో మన పాపారాయుడు మూడువేల కాల్బలము, ఐదువందల ఆశ్వికదళం తోను ఓరుగల్లు కోటను ముట్టడించి పట్టణంలోనికి యితరులు వచ్చే మార్గాలనన్నింటిని మూయించి తెల్లవారక మునుపే కోటను స్వాధీనపర్చుకొని లక్షలాది రూపాయల నగదు, కోట్ల కొలది విలువైన జవహరి, ప్రసిద్ధ ఓరుగల్లు తివాసీలు చేజిక్కించుకుని స్త్రీలు, పురుషులు, పిల్లలు మొత్తం 1200 మందిని చెరబట్టి వారిలో అత్యంత సౌందర్యవతియైన ఖాజీ మహమ్మద్ సయ్యద్ అనువాని భార్యను తన కొరకు వుంచుకొని, తొమ్మిదేండ్ల వయస్సు గల అతని కుమార్తెను నాట్యములు నేర్పే వేశ్యలకు అప్పగించి నాట్య విద్య నేర్పింపుమని ఆజ్ఞాపించాడు.

## పలు రాజు మంత్రి బండారు మల్లు, గంగురాజుచెలికాడు సరదారు పాపన్నతో పోరాడి కూలుట

అతడు గూలు బెరిగి హరిపాలుడపుడు

---

*బ్రహ్మ హరియు శివుడు / పాలించు వారలు; భేద భావమున్న / ప్రేమ చెడును*
*ముగుర నొకటి గాన / మొకరింపగ రండు ; గౌడులార కీర్తి / కలితులార ॥*

మతిమంతు బండారు మల్లుని జూచె
చూచినంతనే రణశూరుడై లేచి
త్రాచుదు ననియిక తగహయం బెక్కి
ఏతెంచె వైరి సేనల మీదనంత
ఘాతచే పగవారి కంఠముల్ దునిమె
పాటింప ఏనుగులపై వార్చి ద్రుంచె
ఘోటకంబులు చెండి గుట్టలు వైచె
పృథివిపై మత్తేభపుట మణగించి
అతి శౌర్య వంతుల హతము గావించి
అటు మీద దాటించి హయము హెూయ్యాలి
నిటువలె నేతెంచు వీరుని జూచి
కల భూపతికి చెలికాడు గుడికాడు
బలుకారు సరుదారు పాపన్న పేరు
రంగధామునకు కరమ్ములు మొగిచి
పొంగుచు భట్లచే పొగడించుకొనుచు
బండారు మల్లన్న పై దాకె నపుడు
నిండారు కన్నుల నిలచి ద్రిష్టించి
బండారు మల్లన్న పక పక నవ్వి
చండ ప్రతాప రణ శౌర్యుడై పలికె
"ఘనుడవు పాపన్న కయ్యము చేయు
వనరంగ బహుశౌర్యవంతుడటంచు
బహుమన్నె సరదార్లు పలుకగా వింటి
వహికెక్కు బహుబుద్ధి మంతుడవు వేగ
రమ్మ తడవేటికి రంగంబు సేయ
"లెమ్మ"ని నంత తాలేచి పాపన్న
జముదాళి నేజాల జడివాన లీల

---

ఒకరు గొప్ప యంచు / నొకరు కొద్ది యటంచు / వాదులాడు వారు బాధలొందు
వాదులాట మాని / వారి మువ్వురకును; పూజ చేయగల్గు / పుణ్యఫలము //

నిముసుకత్తుల తోటి నిలువెల్ల పోట్లు
బండారుమల్లుకు పైభారమాయె
కండ కండకు పోట్లు కత్తి నరుకులు
తగిలి కోపించె సుద్ధతి కుఠారమున
తగిలించె ఎదురొమ్ము దాటి పరుజాన
అదిగాడి పాపన్న కతిభారమయ్యె
మదినుంచి పరమేశు మహిమీద వ్రాలె
మరి వెనుక బండారు మల్లుగాయముల
వారిపాలు జూడ శ్రీహరిని ప్రార్థించె
మేలు మేలని సురల్ మెచ్చు చుండంగ
నాలమున గూలె బండారు మల్లన్న ॥

## పాపన్న భువనగిరి కోటను ముట్టడించుట

కొంతకాలం విశ్రాంతి తీసికొన్న తరువాత పాపన్న హైద్రాబాదుకు పదిమైళ్ళ దూరంలో నున్న భువనగిరి (భోనగిరి) పై దండెత్తి పట్టణాల్ని, పల్లెల్ని దోచుకొని మూడు వేల మంది స్త్రీ పురుషులను బందీలుగా తీసికొనిపోయాడు.

అటు పిమ్మట షాహాపురానికి నాలుగు క్రోసుల దూరమందున్న తరిగొండ (తాటి కొండ) వద్ద మహాబలిష్టమైన దుర్గాన్నొక దాన్ని నిర్మించి అందులో గొప్ప సైన్యాన్ని, మందుగుండు సామ గ్రిని భద్రపరచి తదుపరి యధేచ్ఛగా వీర విహారం చేస్తూ అనేకానేక ప్రదేశాలు కొల్లగొడుతూ ధనార్జన చేయనారంభించాడు.

ఇతని ధాటికి తాళలేని వరంగల్లు ప్రజలు అప్పటి ఢిల్లీ చక్రవర్తియైన బహదూర్ షాహకు పాపని పట్టి బంధింప వలసిందిగా ఒక వినతి పత్రాన్ని పంపుకున్నారు. అందులో "షాహాజ నాయత్" అనే ముస్లిమ్ యోగి కూడా వున్నాడు.

---

*బ్రహ్మ, హరియు శివుడు । పాలించు వారలు ; భేద భావమున్న । ప్రేమచెడును ముగురనొకట గాన । మొకరింపగ రండు; గొడులార కీర్తి । కలితులార ॥*

కాని అప్పటి చక్రవర్తి బహదూర్ షాహ యంతటి వాడు ఒక సామాన్య గౌడవీరుని పైకి సామ్రాజ్య సైన్యాలకు నాయకత్వం వహించి వచ్చుట గౌరవభంగమని తలంచి తన సేనలో అత్యంత చతురులు, నమ్మకమైన యూసఫ్ ఖాన్, రుజ్ బిహానీ అనువారలను అపార సేనలతో పాపారాయుని పైకి పంపాడు. వీరి రాకను చారుల వలన ముందే తెల్సికొన్న పాపన్న యూసఫ్‌ఖాన్ సైన్యాలతో రాక పూర్వమే షాహాపురానికి ఎనిమిది క్రోసుల దూరంలో నున్న కుల్పాల్ నగరాన్ని ముట్టడించాడు. ఈ సైన్యానికి నాయకుడు దిలావర్ ఖాన్ - ఇతనికి పాపన్న కు కొలిపాకలో పెద్ద యుద్ధం జరిగింది. ఇంతలో మహమ్మదీయ సైన్యాలు వచ్చి పాపన్న సేనకు అపార నష్టాన్ని కలిగించి అతన్ని షాహాపురం వరకు తరిమివేశారు. ఇంతలో దుర్గమందున్న ఖైదీలు కొందరు చెర నుండి తప్పించుకొని పాపన్న కోటను స్వాధీనపర్చుకొనగా యుద్ధం నుండి తిరిగి వచ్చిన పాపన్న తిరిగి కోటను స్వాధీన పర్చుకొనుటకు యెంతో కష్టపడుచున్న సమయంలో కుల్పాల్ ప్రాంతం నుండి యూసఫ్‌ఖాన్ సైన్యాలు వచ్చి ఖైదీలతో కలిసి దిగ్బంధం చేయుటతో పాపన్న నిస్సహాయుడై, శత్రుబారినుండి తప్పించుకొని తరిగొండ దుర్గంలో తలదాచుకున్నాడు. ఇది తెలిసిన శత్రుసైన్యాలు తరిగొండ (తాటికొండ) కోటను ముట్టడించాయి. అయినా పాపన్న ధైర్యాన్ని విడనాడక కోటను సంరక్షిస్తూ దివారాత్ర విభాగం లేకుండా హెూరాహెూరిగా తొమ్మిది మాసాలు శత్రువుతో పోరు సాగించాడు.

## యూసఫ్‌ఖాన్ భేదోపాయంతో పాపన్న సైనికులను వశపర్చుకొనుట

ఎంతకు కోట వశం కానందున చతురుడైన యూసఫ్ ఖాన్ పాపన్న అనుచరులలో భేదోపాయాన్ని కల్పించి వారిని అపారధన రాశు లిచ్చి ప్రలోభ పెట్టి తన వైపుకు త్రిప్పుకున్నాడు. ఈ తంత్రంతో పాపన్న స్వజనులు, నమ్మినబంటులుగా నున్న సైనికులందరూ మహమ్మదీయ

---

ఒకరు గొప్ప యంచు / నొకరు కొద్ది యటంచు / వాదులాడు వారు / బాధలొందు
వాదులాట మాని / వారి ముువ్వురకును; పూజ చేయగల్గు / పుణ్య ఫలము //

సైన్యంతో కలిసిపోయి పాపన్నకు యెదురు తిరిగి వానియుద్ధ రహస్యాలన్నీ శత్రువులకు తెలిపారు. దాంతో వారు క్రమంగా కోటను స్వాధీన పర్చుకోజొచ్చారు. అప్పుడు పాపన్న పరిస్థితి సంకటంలో పడింది. తన స్వజాతీయులే డబ్బు కాస పడి తనను వెన్నుపోటు పొడిచారనే ఉక్కురోషంతో పాపన్న యిక అక్కడుండలేక యెవరికీ తెలియకుండా వారి బారి నుండి తప్పించుకొని మారు వేషంతో ఒంటరిగా తాటి కొండకు కొద్ది దూరంలో నున్న హసనాబాదుకు పారిపోయాడు. తాటికొండలో అతడున్నది లేనిది రెండు రోజుల వరకు యెవరికి తెలియలేదు. హసనాబాదులో కూడా అందరు స్వామి ద్రోహులై పాపన్న స్వజనులే గూఢచారులై అతని ఉనికిని తెల్పుటలో శత్రుసైన్యాలు హసనాబాదును కూడా ముట్టడించాయి. అక్కడ యిరుపక్షాల వారికి పోరు ఘోరంగా జరిగింది. ఆ యుద్ధంలో శత్రువులు పాపన్నను గాయ పర్చి ఖైదీగా పట్టుకొని యూసఫ్ ఖాన్‌కు అప్పగించారు.

**పాపన్న వీర స్వర్గమలంకరించుట :** అప్పుడతడు పాపన్నను తాను దోచుకు వచ్చిన ధనాన్ని చూపించే వరకు ఘోరంగా హింసించి తరువాత అతన్ని వధించి అతని శిరస్సును చక్రవర్తికి పంపారని, తదుపరి అతని శరీరాన్ని చిత్ర వధ చేసి అతని మొండాన్ని హైద్రాబాదు కోట గుమ్మానికి వ్రేలాడ గట్టారని వ్రాయబడింది.

మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన చరిత్రకు బోయల్‌దొరగారు సంపాదించిన గేయములోని చరిత్రకు కొంత తేడా వుంది. ఇది సహజమే కదా? అనామకుడైన కల్లు అమ్ముకొనే ఒక గౌడ కులస్తుడు చక్రవర్తి యేలుబడిలోని రాజ్యాన్ని వశపర్చుకోవడం సామాన్య విషయం కాదు. వారి ప్రతిష్ఠకు భంగంరాని పద్ధతిని, తమ అసమర్ధతను కప్పి పుచ్చుకొనుట కతనిని వారొక బందిపోటు దొంగ గానే చరిత్ర సృష్టించి వ్రాశారు.

తానిక ఓడిపోవుట తథ్యమని తెలిసికొన్న వీరకిశోరము యింత పౌరుషమైన బ్రతుకు బ్రతికి –

---

*మానవుడు సుఖింప / మహిలోన జన్మించె; కాని అతని కెపుడు / కష్ట ముండు*
*దైవలీల యిదియ? / దేవుండు క్రూరుడా?! కష్ట బూని యున్న / కతమదేమొ?*

ఇంకను నేనొకరి చేతిలో చావనేటికండీ
బాకే పైకి నెగరవేసి తా రొమ్ము వొగ్గినాడు
గరగర గరగర గరమంటూ బాకు వచ్చినాది
గుండెలో లోతుగా దిగబడగానే
రామ రామ రామా అంటూ ప్రాణం విడిచాడు
వీర స్వర్గము పోయినాడు రా సర్దారి పాపడు
పాపని యొక్క వీరస్వర్గం పాడించి విన్నా
పాడిన వారికి విన్న వారికి తొలుగును దోషంబు ।

అని వున్న గేయములలోని విషయములే సత్యములని మనము గ్రహింపవలసి వుంది. ఎందుకనగా యింతటి వీరుడు పరరాజుల చేతికి చిక్కి వారిచే వధింప బడ్డాడనడం హాస్యాస్పదమే కాగలదు. ఇంతటి గౌరవ ప్రతిష్ఠలార్జించుకొన్నవాడు గౌరవ పదవులను పొందినవాడు, గౌరవ ప్రదమైన చావు తనకు తానై పొడుచుకొని మరణించి నాడనుటయే సమంజసము. ఇలా చచ్చిన వానినే తురకలు తమకసి తీరక ముక్క ముక్కలుగా నరికి కోట గుమ్మానికి వ్రేలాడ గట్టి యుండ వచ్చును. ఎందుకనగా మహమ్మదీయ రాజులు చచ్చిన వారిని కూడా అలా చేసిన సందర్భాలనేకం చరిత్రలో వున్నాయి. ఈ వీరుని కథను మనలోని కళాకారులు బుఱ్ఱకథగా రూపొందించి ఊరూరా ప్రచారం చేయాలని నా కోరిక. ఇట్టి వీర రస ప్రధానమైన పాపని కథ ఎట్టి వారినైనా పులకాంకితులుగా చేస్తుంది.

## పాపని కథ సింహావలోకనము

పాటలో పాపని తల్లి సర్వమ్మ అని చెప్పబడింది. చరిత్రలో సర్వాయి యను వాడు పాపని మిత్రునిగా చెప్పబడినాడు. పాటలో పాపడు గోలకొండను జయించి ఏడు ఘడియలు రాజ్యమేలి నట్లున్నది. ముసల్మానులు రచించిన చరిత్రలో గోలకొండ ప్రస్తావనయే లేదు. ఓరుగల్లు, కొలను పాక, భువనగిరులపై దండెత్తి నట్లు చరిత్రలో చెప్పబడింది. పాటలో తల్లిని హింసించి ధనమును తీసికొన్నట్లుంది. చరిత్రలో పాపడు తన సోదరిని హింసించి ధనముగైకొన్నట్లుంది. పాటలో పాపడే స్వయంగా బాకుతో పొడుచుకొని మరణించి నట్లుండగా చరిత్రలో పాపని శిరమును ఖండించి ఢిల్లీ కంపి మొండిమును కోటకువ్రేలాడ గట్టి నట్లుంది. పాపడు పుట్టినది బెల్లామని పాటలో చెప్పగా చరిత్రలో బెల్లాము పేరే లేదు. ఇటువంటి ప్రధానమైన భేదాలు కనిపిస్తున్నాయి. ఇందులో ఏది సత్యమో యిప్పటికి దొరికిన ఆధారములను బట్టి చెప్పుటకు వీలు లేదు.

ఐనను పాపని తల్లి పేరు సర్వమ్మ అయి యుండునని అతడు గోల్కొండను జయించి కొన్ని దినములైనా పరిపాలన సాగించెననియు, పాపడు యెవరి చేతిలోనూ చంపబడక తానే స్వయంగా బాకుతో పొడుచుకొని వీరోచితంగా మరణించి యుండునని చరిత్రకారు లూహించుచున్నారు.

ఎరుకల నాంచారి పేరు ముందే చెప్పబడినది. ఈమెకు సంబంధించిన జానపద గేయమొకటి ప్రచారంతో వుంది. శారదాకాంౘ్రడును ఈ పాటను పాడుచుందురు. గోల్కొండ సుల్తానుల కాలంలో ఒక ఎరుకల నాంచారి యుండెడిదట. ఆమె చెప్పెడు ఎరుకలన్నీ సత్యములగు చుండెడివట. ఒకసారి ఆమె గోల్కొండ సుల్తానుకు గద్దె చెప్పి అతనిని మెప్పించెనట. ఈమె ఎరుక చెప్పి చేసిన సూచన ప్రకారం షాహాపుర ప్రజలు త్రవ్విన బావిలో నీళ్ళు పడినవట ! ఈమె బాలమైసమ్మచే పీడింపబడుచున్న లంబాడీ "తండా"కు సహాయం చేయగా వారేకృతఘ్నులై, నిర్దాక్షిణ్యంగా యామెను చంపి పాతిపెట్టగా ఆమె దేవతగా మారెనట. ఇట్టి కథ యొకటి జానపదులును, షాహాపురప్రజలును

---

*భూత దయ నెవండు / పూని పాటింపడో ; అట్టి వాని జన్మ / మసుర జన్మ*
*జీవులన్నిటికిని / జీవితం బీడేర్ప / మనుజాళ్లర్థతలను / మరువనేల?"*

చెప్పుకొనుచుందురు. షాహాపుర గ్రామంలో యిప్పటికి నాంచారి పేరుతో పిలువబడే బావి ఒకటి వున్నది.

సర్వాయి పాపని కథలో ఈ నాంచారికి సంబంధమున్నట్లు ఆ ఎరుకల నాంచారి పాటలో ఎక్కడ లేదు. అయితే పాపనికి ఎరుక చెప్పిన నాంచారి ఎవరు? ఈ నాంచారి కథ కూడా గోల్కొండ సుల్తానుల కాలంలోనే జరిగినట్లు పాట వలన తెలుస్తుంది. కనుక పాపని కథ లోని ఎరుకల నాంచారియు యీమెయు ఒకరే అయి యుందురనుటకు అవకాశం లేదు. ఎరుకల నాంచారి అను నామె పాపనికి ఉంపుడు కత్తెగా నుండి యుండెననియు ఒక ప్రవాదము కలదు.



షాహాపురం దుర్గము – సింహద్వారము

షాహాపుర గ్రామంలో యిప్పటికి "నాళగోనోళ్ళు" అనే యింటి పేరు గల గౌండ్ల వారున్నారు. ఇది కొంచెము భేదంతో పాపని యింటి పేరు. 'నాశనోళ్ళు" తో పోలుచున్నది. వారు పాపని వంశజులేమో! ఇదే గ్రామంలో "నూనె వాగు " ఒకటున్నది. పాపడు నూనెకు బదులుగా దివిటీలను ఆ వాగు

నోరు లేని జీవి / నోచుకోదా తిండి ; నోరు గల్గు వాడు / కూడు కొనగ
సేమ మరయ లేర / చిన్న చీమకునైన; గౌడులార కీర్తి / కలితులార //

నీటిలో ముంచి వెలిగించెడి వాడని ప్రజలలో వాడుక కలదు. ఊరివెలుపల పూర్వకాలపు ఒక దిగుడు బావి వుంది. కోట లోపలిభాగము నుండి ఈ బావికి మనుష్యుల రాకపోకల కనుకూలంగా సొరంగం వుంది. ఇప్పుడిది శిధిలావస్థలో వుంది. పాపడు కోటలోని వారికి కావలసిన నీటిని యీ సొరంగం ద్వారానే ఆ బావినుండి ఏనుగులు పై తెప్పించెడి వాడని స్థానికులు చెప్పు చుందురు. పాపడు కోటకట్టక ముందు ఒకనాడు షాహాపుర గ్రామ ప్రాంతంలో తిరుగు చుండగా కుందేలు కుక్కను తరుముచున్న వింత దృశ్యాన్ని చూచి అట్టి స్థలమే కోట నిర్మాణానికి అనువైన స్థలమని నిర్ణయించి అక్కడనే కోటను కట్టెనని ప్రజలలో ప్రచారం వుంది.

షాహాపుర దుర్గాన్నుండి తాటికొండ దుర్గానికి రాకపోకలకై సొరంగ ముండెడిదని ప్రజలు చెప్తావుంటారు. కాని అట్టి గుర్తు లిప్పుడేవీ కనిపించుట లేదు. తాటికొండలో ఒక చిన్న కొండపై కోట నిర్మాణం గావింపబడినది. కొంత మట్టితోను, కొంత ఊతి తోను ఆ కోటను కట్టారు. తాటి కొండ దుర్గం కన్న షాహాపురంలోని దుర్గమే పెద్దది. ఇప్పుడా షాహాపుర గ్రామాన్ని "ఖిల్లా షాహాపురం" అనే పేరుతో పిలుస్తున్నారు.

**షాహాపురం కోట :** షాహాపురం కోట 280 అడుగుల చతురస్ర విస్తీర్ణము కలిగి వుంది. కోట గోడలకు నలు మూలలందు నాలుగు బురుజు లున్నాయి. ఒక్కొక్క బురుజు 60 × 60 అడుగుల వైశాల్యం కలిగి వుంది. బురుజుల ఎత్తు 80 అడుగులు కోట లోపలి మధ్య భాగంలో ఒక బురుజు వుంది. దీనిని "నడిమి బురుజు" అంటారు.

కోట గోడల యెత్తు 80 అడుగులు గోడల వెడల్పు సుమారురెండు గజాలు పశ్చిమ – దక్షిణ వైపు గోడల మీదుగా చక్కగా నడువ వచ్చును. తూర్పున ఉత్తరమున నున్న గోడల మీద నడుచుటకు వీలు లేదు. ఈ కోటకు అగడ్త లేదు. కోట గోడల కుపయోగించిన ఊతి పలకలు శిల్ప నైపుణ్యం కలిగి వున్నాయి. బహుశః యివి ఏ శిధిల దేవాలయములకో చెందిన వాటిని తెచ్చి

---

జ్యోతిషంబు జెప్పి / చూచును చేతులు ; మూలికిచ్చి పైన / ముడుపు గట్టి
మోసగించు వారు / కాసుకు కొరగారు ; భవ్యులార గౌడ / వంశ్యులార !

యుండిరేమో! ఆ బావుల్లో కొన్ని మసీదులకు సంబంధించినవి కూడా కనిపిస్తాయి.కోటలో యిప్పుడిండ్లు లేవు. జన నివాసం కూడా లేదు. బావులు లేవు. ధాన్యాగారాలు, గదులు ఉండి వున్నట్లు శిథిల చిహ్నాల వలన తెలుస్తుంది. గోడలకు రంధ్రాలున్నాయి. ఈ రంధ్రాలు రెండు విధాలుగా వున్నాయి. కొన్ని దూరములో నున్న వారిని తుపాకులతో కాల్చుట కుపయోగించునవి, కొన్ని క్రింది భాగములో నున్న వారిని కాల్చుటకుపయోగించునవి. పిట్ట గోడల మీద కూర్చుండి తుపాకులు కాల్చేవారు. కోటకు పశ్చిమాన సింహద్వార ముంది, ఉత్తరాన దిడ్డి దర్వాజా వుంది. ఇప్పుడది ఊడిపోయి వుంది.



షాహాపురం దుర్గము లోపల "నడిమి బురుజు"

తాటి కొండలోని కోట గోడలుమట్టి, ఊయిలతో కలిపి కట్టబడ్డాయి. ఈ విధంగా పాపని చరిత్ర అస్పష్టంగా, సమన్వయ రహితంగా లభించింది. స్వతంత్ర

---

తాండ్రచెట్టు నీడ / ధర మానవుల నీడ ; చూడ దివ్వెనీడ / కీడు దెచ్చు
వాని నీడ చూడ / వల దెప్డు పడతులు ; నేటి నవ్యయువతి నిజము గనుమ //

రాజ్య స్థాపనాభిలాషతో విక్రమించి మహమ్మదీయ ప్రభువులపై దండెత్తి వారికి గంగ వెఱ్ఱు లెత్తింపజేసిన పాపన్నను మహమ్మదీయ చరిత్రకారులు తమ గ్రంథాల్లో పాక్షిక బుద్ధితో ఒక బందిపోటు దొంగగా చిత్రీకరించారు. సైన్యాల్ని కూర్చుకొని,కోటలు నిర్మించి, కదన రంగంలో కత్తి పట్టి, వీర విహారం చేసి, మొగల్ పాదుషా ఔరంగజేబునే గడగడ లాడించిన వాడు బందిపోటు దొంగ ఎలా అవుతాడు?

ఇట్టి అసహాయ శూరులే జీవితరంగంలో జయాన్వితులైతే మహావీరులు గాను, రాజులు గాను, సార్వభౌములుగాను ప్రసిద్ధి కెక్కుతారు. విఫలులైన వారు బందిపోటు దొంగలగా వర్ణింపబడతారు. ఇది చరిత్రకారునిఅభిమాన, దురభిమానములను బట్టి చేయబడే తీర్మానము. అట్లే ముస్లిం చరిత్రకారుల దృష్టిలో పాపారాయుడు, బందిపోటు దొంగగా చిత్రీకరింపబడ్డాడు. సర్వాయి పాపారాయుడు ఒక విప్లవ వీరుడు. క్రీస్తు శకము 18వ శతాబ్ది ప్రారంభ, సంవత్సరాల్లో ఒక్క వెలుగు వెలిగిన సాహసికుడైన గండర గండడు.

శ్రీశైన-చెగిడి-యాత

# గంగవంశ శ్రీ శయనుల సంగ్రహ చరిత్ర

సంగ్రహకర్త : శ్రీ బంటుపల్లి జగ్గారావు, ఎం.ఎ., బి.యి.డి.,

కళింగరాజ్యము ఉత్తరమున బ్రాహ్మణి, మహానది నుండి, దక్షిణమున నాగావళి నది వరకు వ్యాపించి యుండెను. ఇది 1) ఉత్కళ, 2) ఉత్తరతోసల, 3) దక్షిణతోసల, 4) కాంగోడా, 5) కళింగ అను ఐదు భాగములుగా విభజింపబడెను. ఇది ఛోళరాజు రాజేంద్ర చోళుని ఆధిపత్యము క్రిందకు క్రీ. శ. 1020 సరికి వచ్చెను. పిమ్మట విజయనగర రాజ్య సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1515 సం॥ ప్రాంతమున కళింగ గంగ వంశపు రాజులను జయించిన తరువాత, ఈ గంగ వంశ రాజులకు విజయనగర రాజులతో సంబంధ బాంధవ్యములు వెలిసినవి. కాన యీ గంగ వంశ రాజుల ప్రతిభ ఉత్తరమున మహానది మొదలు పశ్చిమమున తుంగభద్రానది, దక్షిణమున కన్యాకుమారి అగ్రము వరకు వ్యాపించి యుండెను.

---

మౌర్యచక్రవర్తి అశోకుడు క్రీ.పూ. 261లో కళింగదేశముపైకి దండయాత్ర నెరపు నప్పటికి కళింగ రాజ్యపాలకుడు భారవేళుడు. ఇతడు జైనమతావలంబి. ఇతడు లక్షలకొలది ఉన్న మౌర్య సైన్యమును వేల సంఖ్యలో ఉన్న కళింగసేనతోఎదుర్కొని, చాలా సాహసోపేతముగా ఎదిరించి, చివరకు విధిలేక ప్రజాక్షయమునకు యిష్టపడక లొంగవలసి వచ్చెను. అశోకచక్రవర్తి అప్పటి బౌద్ధపీఠాధిపతి అయిన ఉపగుప్తుని బోధనల వలన రక్తపాతంతో కూడిన యుద్ధములపై విరక్తి కలిగి బౌద్ధ సన్యాసము స్వీకరించెను. తాను బుద్ధ దేవుని ప్రతినిధిగా భావించి రాజ్యపాలన గావించెను.

---

సూక్తులన్ని చదివి / భక్తి భావముతోడ ; సేవ చేయుడింక / సేమమరసి
భోగలాలసతలు / భోగింపగారాదు ; గలిత గర్వులార / గాడులార ॥

అశోకచక్రవర్తి యుద్ధములపై విరక్తి పొందినప్పటి నుండి బౌద్ధ సన్యాసిగా మారిపోయెను. తాను వేట, మాంసభోజనము విసర్జించెను. బౌద్ధమత ప్రచారానికి తన రాజ్యములో ఒక ప్రత్యేక శాఖను ఏర్పాటు చేసెను. అదే ధర్మమహామంత్రి శాఖ. ఈ ధర్మ మహామంత్రి ఆదిపత్యము క్రింద అనేక సహాయ మంత్రులుంటారు. ఒక్కొక్కరు ఒక్కొక్క రాష్ట్రములో మత ప్రచారక కార్యక్రమమును నిర్వర్తిస్తారు. వీరి ప్రత్యేక మత ప్రచారక ఉద్యోగులు గ్రామముల లోను, పట్టణములలోను సంచారము చేసి, బౌద్ధమత సూత్రాలు ప్రచారం చేయడమే కాకుండా ప్రజల యిబ్బందులు తెలుసుకొని, వాటిని ప్రభుత్వంకు తెలుపుచు వారి అక్కరలను తీరుస్తూ ఉంటారు. అశోకచక్రవర్తి తన కుమారుడు మహేంద్రుని కుమార్తె సంఘమిత్రను సింహళానికి పంపి బౌద్ధం ప్రచారం చేయించిన విషయం చరిత్ర ప్రసిద్ధమే.

అశోకుడు బౌద్ధం అవలంభించిన తరువాత తన సైన్యాన్ని యుద్ధ కాంక్ష నుండి, మత వ్యాప్తిలోనికి దింపేడు. అప్పటి నుండి సైన్యానికి "శ్రీసేన" అని పేరు వచ్చెను. ఈ శ్రీసేనులు కాషాయంబర ధారులై, శస్త్రాస్త్రములు ధరించి వంతుల ప్రకారము రేయింబవళ్లు రాజ్యములో సంచారము చేయుచు, ప్రజలకు దొంగల వలన, వంచకుల వలన, వన్య మృగముల బారినుండి కాపాడుచుందురు. అనాధులకు ధర్మసత్రములను నిర్మించుచుందురు. ప్రజల యిబ్బందులను తెలుసుకొని, వానిని ప్రభుత్వానికి ఎరిగించుచు వారి కోరికలను తీర్చుటకు ప్రజలకు ప్రభుత్వానికి మధ్య సంధాన కర్తలుగా వ్యవహరించుచుందురు. ఈ శ్రీసేనలోని వారే మన శ్రీశయన కులస్థులు. ఈ సత్యము నెరిగిన సెగిడి జాతి ప్రతినిధులు క్రీ. శ. 1938లో సెగిడి, చెవర, చెట్టు గీత మొదలగు జాతులను అప్పటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం శ్రీశయన జాతిగా నమోదు చేయించిరి.

భారవేలుని మరణానంతరము కళింగములో సుస్థిరమైన ప్రభుత్వ మున్నట్లు చరిత్రాధారములు లేవు. క్రీ. శ. 78లో వాయువ్య భారతమును పాలించిన కనిష్కుని నాణెములు కళింగదేశంలో అక్కడక్కడ కనిపించుటచే

మేలు చేయగోరి / మీరు ముందుకు వచ్చి ; మేలు కొలిపి వారి / జాలి దలచి
చేయ గలుగు దాని / చేసి చూపింపుడీ ; గౌడులార కీర్తి కలితులార //

అశోకుని తరువాత బౌద్ధమతాన్ని ఆదరించిన రాజైన కనిష్కుని ఆధిపత్యములో కొన్నాళ్ళు కళింగ దేశమున్నట్లు కనిపిస్తుంది.

అశోకుని పాలనలో సేనానాయకులుగ ఉన్న ఈ శ్రీసేనులు గుప్త వంశరాజులు, బలహీనమైన పిమ్మట కళింగ రాజ్య ప్రాంతాలలో స్వతంత్రించి, స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి. వీరి రాజధాని మహానది ఒడ్డున గల కటకమగుట చేత, గంగ అతి పవిత్రమగుట చేత వీరు తమ వంశమునకు గంగ వంశమని, తమ రాజ్యమునకు గంగ రాజ్యమని నామకరణము చేసిరి. క్రీ. శ. 230 నాటికి కళింగ దేశ దక్షిణ భాగాన్ని గంగ వంశపు రాజులు పరిపాలించెనని కొందరు చరిత్రకారులు తెలుపగా, క్రీ. శ. 351లో ప్రారంభమైనదని మరి కొందరి వాదము. ఏది ఏమైనను క్రీ. శ. 351 నాటికి గంగ వంశములో అనంతవర్మన్ కుమారుడు దేవేంద్ర వర్మన్ పరిపాలనలో కళింగ దేశముండెను. క్రీ. శ. 526 సం॥ సరికి మధుకమర్ నవ అను రాజు పాలించెను. అంటే అంతకు ముందు కాలంలో మధుకమర్ రాజులు పాలించగా క్రీ. శ. 526 అతని వంశమునకు చెందిన 'మధు కమర్ నవ' నవ =క్రొత్త రాజు పాలించెనని అర్థమగుచున్నది. యీ వంశపు రాజులు క్రీ. శ. 351 నుండి క్రీ. శ. 960 సం॥వరకు సుమారు 6వందల ఏండ్లు నిరాటంకముగా రాజ్యపాలన గావించిరి. వీరు ఉదయపురి, దంతపురి, సింహపురి,కటకము, కళింగపట్నము, జయపురములు రాజధానులుగా చేసుకొని రాజ్యపాలన గావించిరి.

ఈ రాజ్యముపై విజయనగర రాజుల ఆధిపత్యము తొలగిన పిమ్మట ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క రాజు బలపడి తమ తమ ప్రత్యేక రాజ్యములను ఏర్పరచుకొనిరి. ఈ విధంగా వీరు ఐదు శాఖలుగా విభజింపబడి భంజరాజులని నామమును పొందిరి. వీరిలో ఒక శాఖ వారు మహేంద్ర తనయ నదీ ప్రాంతంలో రాజ్యస్థాపన గావించిరి. వీరు పర్లాకిమిడిని కేంద్రముగా తీసుకొని పరిపాలన గావించిరి. కిశోరి, చంద్రదేవు, సింగ్‌దేవు ఈ శాఖకు చెందిన రాజులు.......మరియొక శాఖ వారు జయపురమును రాజధానిగా

కలిసి కట్టుగానె / కదలి రండయ్యలు ; కార్యరంగమునకు / క్రమము గాను
వట్ట మాటలన్ని / కట్టి పెట్టుడు వేగ ; భవ్యులార గౌడ / వంశ్యులార ॥

చేసుకొని పాలింపదొడగిరి. ఈ వంశములో చివరి రాజు విక్రమదేవవర్మ. అట్లే మిగిలిన భంజ రాజులు కలింగములో ఐదు ప్రాంతములందు రాజధానులను స్థాపించి పరిపాలించిరి. వీరిలో మరి కొన్ని శాఖల వారు సిరి పురము, వినిత పురములను రాజధానులుగా చేసుకొనిరి. భంజరాజులలో రణభంజుడు, అతని తండ్రి చతుర భంజుడు లేక గంధ హతకుడు ముఖ్యులు. వీరి రాజధాని ఖిజ్జంగ కోట.

గంగవంశపు రాజులు పరిపాలనా దక్షులే కాకుండా, శిల్పకళకు విశేష సేవ చేసిరి. శైవమతమును ఆదరించి అనేక శివాలయములను నిర్మింపజేసిరి. శైవమతముతో పాటు వైష్ణవ మతమును, శాక్తేయమును గూడా ఆదరించి మత సహనమును పాటించిరి. క్రీ. శ. 6వ శతాబ్దము నాటికి కళింగములో శైవాలయములు, వైష్ణవాలయములు, శక్త్యాలయములతోపాటు బౌద్ధ జైన మతములు ప్రక్క ప్రక్కన సామరస్యముతో వర్ధిల్లెను. ఈ దేవాలయ నిర్మాణము ఆరవశతాబ్దంనుండి 10వ శతాబ్దము వరకు అవిచ్ఛిన్నముగా జరిగెను. మహానది ఒడ్డున గల గాంధారి పురంలో నీల మాధవ దేవాలయము (విష్ణాలయము)గణేశ్వరపురములో గల పంచాయతన దేవాలయములు వైష్ణవాలయములు, దంతపురి బౌద్ధారామము, బుద్ధుని దంతముంచి నిర్మింపబడి, కాలక్రమమున శిథిలమై మన దేశమునకు హ్యూన్‌త్సాంగ్ వచ్చునాటికి క్రీ.శ. 7వ శతాబ్దములో దానిపై పుష్పగిరి ఆరామము వెలిసియున్నదని హూన్‌త్సాంగ్ చైనా యాత్రికుని రచనలు బట్టి తెలియుచున్నది. జైన మత స్థాపకుడు వర్థమాన మహావీరుడు క్రీ. పూ. నాల్గవ శతాబ్దమున జైన మత ప్రచారము చేయుచు కళింగ దేశములో పర్యటించినట్లు చరిత్రాధారములు కలవు. అటు పిమ్మట నందవంశపు రాజులు మహావీరుని జైన మతాన్ని మగధ రాజ్యములో వ్యాపింపజేసిరి. గంగ వంశపు రాజులలో ఒక శాఖ వారగు శైలోద్భవ వంశమునకు చెందిన ధర్మరాజు వాజపేయము, అశ్వమేధము, రాజసూయయాగములు చేసి ఎనలేని కీర్తి గాంచెను. ఈ వంశమునకు చెందిన శుభకర అను రాజు క్రీ.శ. 8వ శతాబ్దము ప్రాంతములో ప్రజన అను

---

భావి తరము వారు / బాధలు పడకుండ ; వెలుగుబాట మనము / వెతికి పెట్టి
దారి చూపవలయు / తలవంచకుండంగ ; కలిత సుగుణులార / గౌడులార //

బౌద్ధ సన్యాసిని చైనా దేశమునకు పంపి అక్కడ బౌద్ధమతమును ప్రచారము చేసి నట్లు చరిత్రాధారము కలదు. హ్యూన్‌త్సాంగు క్రీ. శ. 638లో ఓఢ్ర దేశమును దర్శించి దాని రాజధాని 5 మైళ్ల పొడవు వున్న దనియు, దానిలో 50 హిందూ దేవాలయములు, 10 బౌద్ధ విద్యాపీఠములలో 10 వేల బౌద్ధ సన్యాసులు నివసించు చున్నారనియు అది రేవు పట్టణముగా వర్ధిల్లు చున్నట్లు తన డైరీలో వ్రాసెను. అది పూరీ అయిఉండవచ్చునని కొందరు చరిత్రకారులు ఊహించిరి. కాని దాని చుట్టు ప్రక్కల బౌద్ధ జైన మత చిహ్నములు, కాన్పించలేదు. కానీ హ్యూన్‌త్సాంగ్ దర్శించిన రాజధాని కటకమై యుండుననియు, అక్కడ నుండి పడవలు బయలుదేరి మహానది శాఖలగుండా పోయి బంగాళా ఖాతములో ప్రవేశించి విదేశములతో వర్తక వ్యాపారములు నెరపెనని పలువురు చరిత్రకారులు ఊహించుచున్నారు.

గంగవంశపు రాజులు మొదట బౌద్ధ, జైనములను ఆదరించినను ( దీనికి నిదర్శనముగ ఉదయగిరి, ఖండగిరి, రత్నగిరిపై మూడు గుహాలయములు గలవు). కాల క్రమేపి శైవమును పోషించి, శైవాలయములను నెలకొల్పి అటుపిమ్మట మత సహనము అవలంభించి వైష్ణవాలయములు, శక్త్యాలయములను కూడా నిర్మింపజేసిరి. దీనికి తార్కాణముగా మహేంద్రగిరిపై భీమేశ్వరాలయము, భువనేశ్వరంలో లింగరాజు దేవాలయము, నీల మాధవ దేవాలయము, చాముండేశ్వరాలయము, ముక్తేశ్వరాలయము, మార్కండేశ్వ రాలయము, స్వర్ణజలేశ్వరాలయము, శత్రుఘ్నేశ్వరాలయము, పరశురామేశ్వ రాలయము, పశ్చమేశ్వరాలయము, మోహినీ, దుర్గాలయములు కలవు. ముఖలింగములో మధుకరేశ్వరాలయము, వంశధార నాగావళీ నదుల మధ్య గల కోటీశ్వరాలయము, సూర్యనాధాలయము, కూర్మనాధాలయములు వెలసినవి. ఈ కూర్మనాధ దేవాలయము మొదట శైవాలయముగ ఉండి, అటు పిమ్మట వచ్చిన వైష్ణవ మత ప్రబలము వలన వైష్ణవాలయముగ మార్చినట్టు దేవాలయ నిర్మాణమే చెప్పగలదు. దేవాలయ పోషణార్థము రాజులు కొన్ని గ్రామములను ధారాదత్తం చేసి పూజారులకు వంశపారంపర్య

---

మానవతుల కిలను / మాసిక ధర్మంబు ; సుందరతను గూర్చి / శోభనిచ్చు
ఆయురాదు లిచ్చి / ఆరోగ్యమిచ్చును ; నేటి నవ్య యువతి ; నిజము కనుమ!

హక్కులను ప్రసాదించిరి. కళింగదేశమున బౌద్ధుల కాలములో పాళీ భాష గుప్తులకాలంలో సంస్కృతముతో పాటు మాతృభాషయైన ఓఢ్రము కూడా వాడుకలో నుండెను. మొదట రాజ శాసనములు తామ్ర ఫలకములపై రచింపబడి పిమ్మట తాళ పత్రములపై వ్రాయబడినవి. గంగ వంశమునకు చెందిన భంజ రాజులు ఆంధ్రమును మాతృభాషగా వాడినను సంస్కృత భాషలో పరిచయము కలిగి యుండిరి. రాజులు భాషా పోషకులే కాకుండా, భాషా కారులుగా కూడా వర్ధిల్లిరి. ఉదాహరణకు పర్లాకిమిడిని ఏలిన దేవ్ రాజులు, జయపురమును ఏలిన విక్రమ వర్మాది రాజులు తమ ఆస్థానములలో పెక్కు కవులను ఆదరించుటయే కాక, తాము కూడా పెక్కు గ్రంథములను రచించిరి.

గంగ వంశపు రాజులు మిగుల పరాక్రమ వంతులై శత్రుభయం కరులైనను, తమ ప్రజలను మాత్రము కన్నబిడ్డలుగా చూచుకొనెడివారు. బీదవారికి పెండ్లిండ్లు చేయించుట, దిక్కులేని వృద్ధులకు భోజన వసతి, సౌకర్యములు కల్పించుట, దేవాలయములకు మాన్యాలిచ్చి దేవునకు నిత్యభోగ ప్రసాదములు కల్పించుట, పురోహిత కుటుంబముల వారి పోషణ బాధ్యతలు స్వీకరించుట, మొదలగు పనుల వలన ప్రజలు మిక్కిలి సంతృప్తి చెంది రాజులను దేవునిగ భావించుట మొదలిడిరి. భంజ రాజునకు భంజదేవుడని, అర్కరాజును అర్క దేవుడని ప్రజలు వాడుటచే కాలానుగుణముగ అటుపిమ్మట పాలించిన రాజులకు 'దేవు' అనుపదము వంశపారంపర్యముగా వాడుకలోనికి వచ్చెను. పర్లాకిమిడి రాజకుటుంబీకుల, పేర్ల చివర "దేవు"అని చేర్చుట మనందరికి తెలిసిన విషయమే. ఐదవ భంజ వంశరాజులు కళింగదేశ దక్షిణ భాగాన్ని పర్లాకిమిడిని రాజధానిగాను, కళింగపట్టణమును ఓడరేవుగను చేసుకొని పరిపాలించిరి.

రాజేంద్ర చోళదేవుడు క్రీ. శ. 1020 సం॥లో కళింగముపై దండెత్తి గంగరాజులను ఓడించినను వారి ప్రతాపమునకు మెచ్చుకొని వారి రాజ్యమును తన రాజ్యములో కలుపక పరిపాలనా భారమును వారిపై ఉంచి వారి నుండి

దీప్తి చెందు సంతు / దీర్ఘజీవులగును ; బలము పుష్టి గలిగి / ఫలము దక్కు
అవసరంబె గాక / అనివార్యమును గూడ ; నేటి నవ్య యువతి / నిజముగనుమ

కప్పములను మాత్రము వసూలు చేసిరి. చోళరాజులు గ్రామ పాలనకు ప్రాధాన్యత నిచ్చిరి. గ్రామ పాలనా భారమును అనుభవజ్ఞుడైన ఒక రాజకుటుంబీకునిపై మోపిరి. ఈతడు గ్రామమంతటిని అజమాయిషీ చేసి గ్రామములో నీటిపారుదల, వ్యవసాయాభివృద్ధి, పశుపోషణ గ్రామపారిశుధ్యము ప్రజల రక్షణ, తగవుల పరిష్కారము, పన్నులు వసూలు, దేవాలయ నిర్మాణ పోషణ మొదలగు వ్యవహారములను పరిశీలించును. వీరినే బెవర (గ్రామ పెద్ద) అను నామముతో పిలువ దొడగిరి. శ్రీ శయనులను కొన్ని ప్రాంతములలో "బెవరులు" అని పిలుచుటకు యిదియే కారణము.

ప్రాచీన కాలములో రాజులకు సైన్యములో చతురంగ బలము లుండెడివి. అవి రథ, గజ, తురగ, పదాతులు, రథములపై పోయి యుద్ధం చేయువారు రథికులు, రథానికి రెండుగాని, నాలుగు గాని గుఱ్ఱములు పూన్చి వానిపై పోయి యుద్ధం చేయుట కాకతీయ గణపతి దేవునికాలము నాటి వరకు ఉండెను. రథానికి ఇంకొకపేరు శకటము శకటము నడుపువాడు శకటి. ఈ శకటి అనుపదము కాలక్రమేపి రూపాంతరముచెంది "శగడి"గా మారినది. జట అనుపదము జడగస్తు, అటవి అనుమాట అడవి గను వాడుక లోనికి వచ్చునట్లు, శకటి అను పదము శగడిగా మారి-శగడీలు, సెగడీలు, చెగిడీలు అను పేర్లు ప్రాంతీయతను బట్టి, కాలానుగుణముగా వాడుకలోనికి వచ్చినవి.

విజయనగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1520వ ప్రాంతములో కటకముపై దండెత్తి దాని రాజధాని ఉదయగిరిని ఆక్రమించెను. దాని పాలకుడగు గజపతిరాజు నోడించి అతని కుమార్తె చిన్నాదేవిని బలవంతంగా తీసుకొని పోయి వివాహమాడెను. శ్రీకృష్ణదేవరాయల మరణానంతరము అతని అల్లుడగు అలియ రామరాయల పాలనలో అతడు ఖురానును అవమానించుటచే బహమనీ రాజులగు బీజాపూర్, బీదరు, బీరారు, అహమ్మదునగరు, గోల్కొండ నవాబులు తమలో తమకు గల వైషమ్యాలను మరచి ఏకమై విజయనగర రాజ్యము పై దండెత్తి దానిని

గుహ్యభాగమందు / గూడు దోషములను ; సిగ్గు విడిచి పతికి / చెప్పవలయు
చెప్పుకున్న నవియె / చీకాకు గలిగించి ; భావి జీవితమును / భంగపరచు //

సర్వనాశనము చేసిరి. భూతల స్వర్గమై దేదీప్యమానముగా శోభావంతమైన రాజధాని విజయనగరముపై పెక్కుసార్లు దండెత్తి దానిని నేలమట్టము గావించిరి. ఈ యుద్ధసందర్భములో విజయనగర రాజులకు సామంతులైన గంగ వంశరాజులు మహమ్మదీయులతో హోరాహోరిగ పోరాడి కడుధైర్య సాహసములను ప్రదర్శించిరి. దానికి మహమ్మదీయ పాలకులు మండిపడి గొప్ప పౌరుషవంతులైన వారిని లేకుండా చేయుటకు సంకల్పించి దొరికిన వారిని దొరికినట్లే నరకడం మొదలుపెట్టిరి. వారికి గ్రామప్రజలు రక్షణ యివ్వగా తురక సిపాయిలు గ్రామములలో చొరబడి ఇండ్లను శోధించి, ఆశ్రయమిచ్చిన గృహస్తులను గుఱ్ఱములకు కట్టి కమ్చాలతో కొట్టి మరణించేంత వరకు మారణహోమము గావించిరి. మిగిలిన రాజ వంశీయులు తమ వలన తమకు రక్షణ యిచ్చిన గ్రామ ప్రజలను బాధలకు గురి చేయుటకు యిచ్చగింపక వీరు అరణ్యములకు పోయి తమ జీవనమును సాగించిరి. పండ్లు దుంపలు తింటూ అవి లేని సమయములో వీరు తమ వద్ద గల పదును కత్తులతో ఈత, తాటి మొదలగు చెట్ల మోవులను కోసి దానిలోని తీపి చెక్కలను తిన మొదలుపెట్టిరి. ఈ మోవులు కోయుటలో దానినుండి తీపి గల ద్రవపదార్థము కారుటచే దానిని వారు సేకరించి మద్యముగా మార్చుకొని త్రాగుట మొదలుపెట్టిరి. కాన అప్పటినుండి వీరికి రాజ్యపదవులు పోయి కల్లు గీత ముఖ్యవృత్తిగా తయారైనది. కనుక సెగిడి, ఏత, సెట్టి బలిజ, ఈడిగ, గవళ, గౌడ, తమిళ నాడులో నాడరు అని ప్రాంతీయ భేదాలను బట్టి పిలువబడు చున్నారు.

దీనికి తార్కాణముగా శ్రీశయనులు, మనదేశంలో ఏ ప్రాంతంలో నివసించుచున్నప్పటికిని పాత సాంప్రదాయము బట్టి యుద్ధ విన్యాసములు ప్రదర్శించుచు సాము గరిడీలను నెలకొల్పుతూ పండుగ పబ్బములందు వారు తమ తమ యుద్ధ ప్రక్రియలను ప్రదర్శించు చుందురు. కర్రసాము, కత్తి యుద్ధము, ద్వంద్వయుద్ధము, (కుస్తీ) మొదలగు యుద్ధ విద్యలలో శ్రీ శయనులు విన్యాసములు చేయుచు, తాము అశోకుని,పాలన నుండి

తేలికైన వాని / తినుచుండవలయును ; గాలిలోన తిరిగి / గంతు లిడుచు
దుమికి వడిగి నడువ / దోషంబు వాటిల్లు ; నేటి నవ్య యువతి నిజము గనుమ॥

ఓం శ్రీ లక్ష్మీ గణేశ్వరాయ నమః
సద్గురు కౌండిన్య ఋషయే నమః

# సమగ్ర గౌడుల చరిత్ర

## పంచమాధ్యాయము

### శాసనాదులు

పురాతన చారిత్రాత్మక శాసనాదులను గూర్చి చాలా వరకు తృతీయ చతుర్థాధ్యాయములలో వివరించాను. మిగిలినవి ఈ అధ్యాయంలో పొందు పరచుచున్నాను. పాఠకులు గమనింతురుగాక !

పూర్వము 9,10 శతాబ్దములలో యీ గౌడ జాతీయులు మహారాజుల రాజ్యకాలములో యుద్ధ రంగమునకు పోయే పదాతాది చతురంగ దళములకు, అశ్వగజాది వారి వాహనములకు పనికి వచ్చు వివిధ రకములైన మద్యములను తయారుచేయించి, మహారాజులకు ప్రత్యేక మద్యములను తయారుచేసి యిచ్చుట వలన వీరు "మద్య కృతాది వర్గము"గా పరిగణింపబడి వారి వారి ఆస్థానములందు గౌరవింపబడేవారు. ఈ వర్గమువారికి రాజ్యాధిపతులు పారితోషికముగా వారి రాజ్యములందలి కొంత రాజ్యమిచ్చుట గాని, కొన్ని గ్రామములిచ్చుట గాని చేయుచుండెడివారు. ఇది పురాతన కాలము నుండి వస్తున్న సదాచారము. ఆ రాజ్యములను రాష్ట్రాదులను పాలించు వారిని రాష్ట్ర గౌడులని, గ్రామాలను పాలించువారిని ఊర్ గౌడులని పిలిచేవారు. వీరుకూడా యుద్ధ సమయాల్లో స్వదేశ రక్షణకు చతురంగ బలాల్లో వారి వారి హెూదాల ననుసరించి ఉద్యోగులుగా వుండేవారు. యుద్ధ రంగములందు వీరికి ప్రత్యేక ప్రాతినిధ్యముండేది. అట్టి వారికి గురుతుగా మహారాజావారి అధికార చిహ్నాలతో వుండేయెఱ్ఱని పచ్చని రంగులు గల చాందినీ తొడుగులు బాహువుల వలె నుండే చామరములు బిరుదులుగా వుండేవి. అట్టి బిరుదులు గల వారిని శత్రువులు తాకేవారు కాదని

---

సతులు నిద్రముందు / శ్రమయన కుండంగ; పతుల కాళ్ళనొత్తి / ఫలము కొఱకు
కండ్ల కద్దు కొనిన / కలుగును దయయెంతో / సుగుణ రాశివైన / సుదతి వినుమ॥

ఆదిగౌడ దీపికలో వ్రాయబడింది. అందువలన యీ రాష్ట్ర గౌడులు రాష్ట్రపాలకులుగా వుండే వారని పై ప్రమాణము వలన తెలియుచున్నది. అట్టి పాలకుల పేర్లు లభ్యము కాలేదు. కాని రాష్ట్రములను పాలించినట్లు మాత్రము శాసనముల వలన తెలుస్తుంది. మన ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించినంత వరకు అట్టి రాష్ట్ర గౌడులు యెక్కువగా నిజాం రాష్ట్రంలో వుండేవారు. వారి రాజధానీ నగరాలు కట్టలూరు, మాల్యఖేటాదులు. ఉస్మానాబాదు ప్రాంతంలో వున్నాయి. ఈ మాల్యఖేటము, ప్రపంచంలో నాల్గవ సార్వభౌముడని ప్రశంసింపబడిన గోవింద రాజు రాజధాని. అశోకుని రాజప్రతినిధి నివశించిన సువర్ణగిరి, అమూల్యమైన అశోకుని శిలాశాసనం దొరికిన "మాస్కి" అనునది రాయచూర్ ప్రాంతములో నున్నది. విక్రమాంక దేవచరిత్రలో బిల్హణ కవిచే వర్ణింపబడిన ఆరవ విక్రమాదిత్యుని రాజధానియైన "కళ్యాణపురము" గుల్బర్గా మండలములో వుంది. ఈ రాష్ట్రంలో యింకా చరిత్ర ప్రసిద్ధికెక్కిన గంగాపురము, నేలకొండపల్లి, పానుగల్లు, ధర్మపురి, నందగిరి ఆమనగల్లు, ఏలేశ్వరము, ఓరుగల్లు మొదలగు గ్రామాలున్నాయి.

రాష్ట్ర గౌడుల గూర్చి, పశ్చిమ చాళుక్యులు, చోళులు, కాకతీయులు మొదలగు ఆంధ్రరాజుల చరిత్రలలో యింకా యెన్నో నిగూఢ చరిత్రాంశాలున్నాయి. మహమ్మదీయుల ఎడతెగని దండయాత్రల ఫలితంగా నిజాం రాష్ట్ర రాజులు సర్వస్వాన్ని గోల్పోయారు. ఛిన్నాభిన్నముగాని హిందూ దేవాలయము గాని, రూపు మాయనీ దేవీ దేవతల విగ్రహాలు గాని లేనే లేవు. శాసనాలన్నీ విరగ గొట్టబడి చల్లా చదురుగా పడవేయ బడ్డాయి.

హనుమకొండలోని ఒక శాసనములో కాకతీయులు మొదట జైనులని వుంది. మరొక శాసనంలో రుద్రమరాజగౌడు, గుండరాజు, జగద్దేవుడు, మేడరాజు, గోవిందరాజు, మెళగిరి దేవుడు మొదలగు వారి పేర్లు వ్రాయబడ్డాయి.

కొలవి, గూడురు గ్రామములలోని శాసనములు నన్నయ్య భట్టుకు పూర్వమున్న చరిత్రను తెలుపుతున్నాయి.

రంగశాయి గుట్ట వద్ద నున్న గుహలోని శాసనములు, సిద్ధేశ్వరాలయ

---

ధనము తెచ్చి భర్త / తాకోరు కొన్నట్టి; వస్త్ర భూషణములు / వలసి నన్ని
తెచ్చి యీయకున్న / తిట్ట కూడదువాని ; సుగుణ రాశివైన / సుదతి వినుమ ॥

గుహాశాసనాలు ఆంధ్ర సామ్రాజ్య వైభవాన్ని చాటుచున్నవి.

అయ్యవోలు శాసనము వలన అనపోత నాయకుడనే వెలమ వీరుడు సోమకుల పరశురామ బిరుదము పొంది నట్లుంది.

ఉమామహేశ్వర శాసనం వలన ద్విపద, పద్య రచనాధౌరేయుడైన, గౌరన వంశము వాని కాలము, విష్ణు పురాణ రచయిత నాగనాథుని కాలము తెలుస్తుంది.

ఓకు మాలు శాసనంలో ప్రతాప రుద్రుని మంత్రి పురపరి మహాదేవ నాయకులని వుంది.

సామంత శూరుని శాసనము, పానగల్లు శాసనము, ఇనుగుర్తి శాసనము, కొలను పాక శాసనములలో రుద్రమదేవి గణపతి దేవుని పుత్రిక యని వుంది. మరియు ద్విసింహ గౌడుని కుమారుడు రుద్రమ గౌడని తెలుస్తుంది.

హైద్రాబాదు సమీపంలో కొలను పాక క్షేత్రం వుంది. ఇందులో వీరనారాయణాలయం వుంది. 1700 సంవత్సరంలో మల్లిఖార్జున సిద్ధయోగి అను ఒక సిద్ధుడు కొలనుపాకలో గౌడ మత స్థాపనను గురించిన వృత్తాంతాన్ని "గౌడపురాణ"మనే పేరుతో ద్విపదకావ్యంగా గ్రంథస్థం చేశాడు. దీని కొరకు యిప్పుడు నేను పరిశోధిస్తున్నాను.

మహమ్మదీయుల దండయాత్రలో సుసంపన్నమైన గౌడులు నిర్మించిన చిత్ర విచిత్ర శిల్పములు గల ఆలయాలన్నీ నేలమట్టమై రూపుమాసిపోయాయి. వృత్తులు నశించాయి. పూజాపునస్కారాలు శూన్యమయ్యాయి.ఎందరెన్ని విధాల నాశనం చేసినా యిప్పటికి కొన్ని చోట్ల ప్రాచీన శిల్పకళ మాత్రం అప్రతిహతంగానే నిలువబడి వుంది. ఓరుగల్లు లోని శంభుని గుడి వారి మతోన్మాదం, అత్యాచారాల వలన రూపుమాసింది. ఇప్పుడున్న ఆలయం ఈ మధ్య కాలంలో కట్టింది. వీరి దండయాత్రల వల్ల బాగా నష్టపోయింది, వరంగల్లు కోట, పరిసర ప్రాంత దుర్గములు, తటాకములు నాశనం చేయబడ్డాయి.

---

పెద్దలైనవారు / పెరటి లోనికి రాగ ; యెత్తుపీట కుర్చి / లెక్కరాదు
అట్లు కూరుచున్న / అపనిందలు పుటెట్లు ; సుగుణరాశి వైన / సుదతి వినుమ॥

ప్రస్తుతం కొలను పాకలో నున్న వీరనారాయణాలయము, అల్లాదుర్గం లోని వీరభద్రాలయం నగునూరులోని శివాలయం, వేములవాడలోని రాజేశ్వరీ ఆలయం మొదలైనవి. పంట చెరువు లోని మూడు వందల జైనుల ఆలయాలను శైవులు శివాలయాలుగా మార్చివేశారు.

హనుమకొండలోని పద్మాక్షి అమ్మవారు జైన దేవత ఇప్పుడీమె కాళీ అపరావతారమైనది. ఇవన్నీ కూడా మత కలహాలతో పొందిన రూపాంతరములని గమనింపవలసి వుంది.

1914లో ప్రభుత్వం శాసన పరిశోధన శాఖను నెలకొల్పింది. కాని అది సరిగా పని యేమి చేయలేదు. నైజాము రాష్ట్రంలో అమూల్యములైన శాసనాలెన్నో వున్నాయి. వాటి విలువ తెలియని ప్రజలు వాటిని యిండ్ల అరుగులకు, బావులకు, చెరువులకు, ఆలయ ప్రాకారాలకు బిగించి వాటి ప్రయోజనం రూపు మాపి వేశారు.

రాయన భాస్కరుడనే మంత్రి తెలుగు దేశమంతటి లోను గొప్ప పేరుపొందిన వాడు. దానిక్కారణం యితడు చేసిన ప్రజోప యోగకార్యములే, దాన్నే మంత్రి మహానాటికట్టు బాట్లు అని అంటారు. మొదట యీ కట్టుబాటు కొందరికి బాధించినట్లు కనిపించినా తరువాత అన్ని వర్ణముల వారికి అంగీకారయోగ్య మయ్యింది. అందు వలన దీనిని సాధించి తెచ్చిన యీ రాయన భాస్కరుడు అన్ని వర్ణాల వారి వలన విశేష గౌరవాన్ని పొందాడు. ఆశాసనములు వాని కాలమున యీ క్రింది విధంగా వుంది.

1వ శాసనం – శాలివాహన సం. 1428 సం. సమమగు క్రోధన సంవత్సరము.

2వ శాసనం – శాలివాహన సంవత్సరం తెలియలేదు.

3వ శాసనం – శాలివాహన సం. 1429 సం॥ సమమగు అక్షయ సంవత్సరము

ఈ పై మూడు శాసనములలోని విషయం ఒక్కటియే అందులోని మొదటి రెండు శాసనములు అశ్వపతి, గజపతి, నరపతి అనే ముగ్గురు

మాట గట్టిగాను / మాట్లాడతగదెపుడు ; అణగి మణిగియున్న / యన్ని యమరు
కోపగింపరాదు / కొట్టినా తిట్టినా ; సుగుణ రాశివయిన / సుదతి వినుమ ॥

మహారాజుల వలన విధింపబడిన పన్నులను మాన్పించుటకు గాను యీ రాయన భాస్కరుడు వారు కోరినంత ధనము వారికిచ్చి అందుమూలంగా చేయించిన కట్టుబాట్ల వృత్తాంతాన్ని తెలిపే శాసనాలు.

మూడవ శాసనం పై ముగ్గురు రాజులకు ఆ కాలంలో హిందూ దేశానికంతకు ప్రభువగు ఢిల్లీలో నున్న అలంఘీరు పాదుషా వద్దకు వెళ్లి పై రాజులిచ్చిన మర్యాదలకు పాదుషాను సమ్మతింపచేసి వాని వలన పొందిన ఫర్మానా (ఆజ్ఞాపత్రము) అయివుంది.

మొదటి రెండు శాసనముల కథ మనకనవసరమని విడిచి పెట్టాను. 3వశాసనం దీన్నే ఫర్మానా అంటారు. దాని తెలుగు తర్జుమా చూడండి. మహారాజ శ్రీ అలంఘీరు పాదుషా వారు మంత్రి మహానాటి వారికి దయచేయించిన ఫర్మానా.

స్వస్తి సమస్త త్రిభువన విపుల విజ్ఞాన వీర వీరావతారులును, గరుడధ్వజ, సింహధ్వజ, బిరుదాంకిత మాలికా ప్రశస్త దారులును, దేశింగు రాయ రాజ్య స్థాపనాచార్యులును, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజాది ఛప్పన్న దేశాధీశులును, వజ్రవైఢూర్య గోమేధిక, పుష్యరాగాది నవరత్నాధి కారులును, హరి హర గురుభక్తి పరాయణులును, పరనారీ సహోదరులును, మౌళి పట్టభద్రులును, అయిన స్వస్తి, సమస్త కలనామాంక మాకాదప్రశస్త దారులును, విప్రముఖ్యులు నైన రాయన మంత్రి భాస్కరులైన మంత్రి మహానాటి వారికి దయచేయించిన పట్టా (పాదుషా ఫర్మానా).

ఈ శాసనము నందు అలంఘీరు పాదుషా వారికి అడిగినంత ధనమిచ్చి ఈ ఫర్మానా వ్రాయించుకొన్నారు.; మహానాటి వారు ఇందు సౌరాష్ట్ర దేశ దుర్గాల వారును, ఛప్పన్న దేశాల వారును, ముప్పది యిద్దరు సర్దారులున్ను యేబది యారు దేశాల వారును, వర్ణాశ్రమ పన్నులు యిచ్చు కోలేక చాలా యిబ్బంది పడుచుండగా పాదుషా వార్కి ధనమిచ్చి వ్రాయించుకొన్న ఫర్మానా.

---

ఎదురు తిట్టరాదు / యెన్నియిడుములున్న ; ఓర్పు తోడనన్ని / గూర్పవలయు
ఓర్పులేని యెడల / పూరడింపగరాదు ; సుగుణరాశివైన సుదతి వినుమ //

తరువాత పాదుషాగారు సమస్తమైన వర్ణాశ్రమాల వారి వివాహాది శుభకార్యల్లో బెజ్జినీడు, నల్లా పాత్రుడు మొదలైన మహానాటి వారికి తాంబూలము కట్నములు యివ్వవలసి నందుకు నిర్ణయించిన పద్ధతుల వైనము వాహనాలు పల్లకీలు యెక్కి వెళ్ళే సమస్త వర్ణాల వారు మహానాటి వారికి కట్న-కానుకలు చెల్లించి పెండ్లిండ్లు మొదలైన శుభకార్యాలు చేసికొనేవారు.

ఈ ఫర్మానాలో గౌడ జాతీయుల గురించి యీ విధంగా వ్రాయబడింది.

"గమలా, కాలాల్, గమండ్ల వాళ్ళ పెండ్లిండ్ల సమయాల్లో మాలవాళ్ళు వచ్చి గమళ్ళ వాళ్ళ మందిరాలపై బడి తోరణములను త్రెంపి పందిళ్ళకు గొడ్డు దుమ్ములు కట్టి, పందిరి పాకలు విరుగగొట్టించి, వీధులలో వేసి తగుల బెట్టించి, వాహనాదులను విరుగగొట్టించి సంఘ వ్యతిరేకంగా నడిచి, దౌర్జన్యంగా ప్రవర్తించినందుకు గాను, మహానాటి వారి సెలవు ప్రకారం మాలవాళ్ళు వాహనములు, పల్లకీలు మొదలగునవి ఉపయోగించరాదు."

ఈ పర్మానా క్రింద పార్శీ మొహరు వున్నది. పాదుషా సంతకం కూడా పార్శీ భాషలోనే వుంది. దానికి సరియైన తెలుగు సంవత్సరం అక్షయ సంవత్సర చైత్రశుద్ధ దశమి యిందు వాసరం.

ఇందుకు తార్కాణము యీ జాతీయులలోని సామంతరాజులు చాలా కాలము వరకు పారసీకులపై దండ యాత్రలు సాగించి వారి రాజ్యానికి ప్రజలకు ఉపద్రవాలు కలుగజేస్తూ వచ్చినందున ముసల్మానులే పరోక్షంగా మాలవారిని ప్రోత్సహించి శుభకార్యాల్లో వీరికి కీడు తలపెట్టి పగదీర్చుకొనేవారు. ఎందుకనగా శుభకర్యాల్లో యుద్ధసన్నాహాలుండవు. అందువలన యీ గౌడ జాతీయులను గూర్చి రాయన భాస్కర మంత్రి చరిత్రము నందు లిఖించిన శాసనము పరిశోధిస్తే మహమ్మదీయులకును యీ గౌడులకును నిరంతరము శత్రుత్వంతో బద్ధవైర మున్నట్లు విశదమౌతుంది. ఈ వైరానికి కారణం గౌడులు మహాధనవంతులై ప్రభువులను లెక్కచేయక స్వతంత్రంగా జీవించేవారు.

---

*అత్త వారియింట / అడుగు పెట్టిన నాడె ; అన్నదమ్ములాప్త / లందరకును*
*దూరమైతి ననుచు / దూరకు నీ వారి ; సుగుణ రాశివైన సుదతి వినుమ //*

# కల్లుగీయు కాటమ గౌడుని శిష్యుని వలన ఆదిశంకరాచార్యులు గౌడ మంత్రోపదేశం పొందుట.

శంకరా చార్యుల వారు శివాంశతో క్రీ. శ. 785 సం॥లో శివశర్మ శ్రీ మహాదేవి అనే దంపతులకు కేరళ దేశంలోని శృంగేరీ మోరువను గ్రామంలో విళంబి నామ సంవత్సర చైత్రశుద్ధ దశమినాడు జన్మించాడు. ఈయనకు ఎనిమిదవ యేటనే ఉపనయనం 12వ యేట పితృవియోగం కలిగింది. చిన్న తనం నుండి పరవిషయములందాసక్తి గలవాడై తండ్రి మరణానంతరము సన్యసింపవలెనని తలంచాడు. కాని తల్లి అనుమతించలేదు. ఆమెకు తన మహిమలనెన్నో చూపి చివరకు ఒప్పించి ఆమె అనుమతిని సన్యసించి పాదచారియై దేశమంతా పర్యటిస్తూ మతబోధ చేస్తూ తన బోధామృతం వలన అనేక వేల మంది శిష్యులను తయారుచేసి, ఆస్తికత్వం-దైవచింతన - సదాచారములు ప్రతివారికి అలవడే టట్టు చేయడానికి ధర్మవిప్లవం తీసికొని వచ్చిన దేవతామూర్తి.

కాంచీపురం (నేటి కంచి)లో కామాక్షి అమ్మవార్ని ప్రతిష్టించి శ్రీ చక్రాన్ని ప్రతిష్టించి అ దేవిని స్తుతిస్తూ ఎనిమిది శ్లోకాలు వ్రాశాడు. ఇక్కడనే ఏకాంబరేశ్వర మహాలింగాన్ని కూడా ప్రతిష్టించాడు. శివ కేశవులకు భేదం లేదని ప్రచారం చేసేవాడు. తరువాత ఆయన దేశాటన చేస్తూ కాశీ పట్టణం చేరుకొని అక్కడ కొంత శాస్త్రాధ్యయనం చేసి అక్కడ న్యాయశాస్త్ర కోవిదుడు, తర్కవేత్త, మండనమిశ్రుడనే మహాపండితుడున్నాడని విని, ఆయనను దర్శించి మాట్లాడ వలననే కోరికతో నర్మదానదీ తీరమందున్న విద్యానిలయమనే పేరు గల మండనమిశ్రుని వూరికి వెళ్ళాడు. శంకరుడు వాని యింటికి వెళ్ళి ద్వారము వద్ద నిలువబడగా అక్కడున్న ఎనిమిది చిలుక లాయనతో శాస్త్ర చర్చ కారంభించెనట! వాటి పాండిత్య పటిమ కాశ్చార్యపడిన శంకరుడు - ఆహా! పక్షులే యింత పాండిత్యము కలవియై యుండగా శిష్య బృందము,వారి గురువు యెట్టి వాడై యుండునోయని తలంచి తత్కాలంలో వానితో వాదించుటకు మనస్సంగీకరింపక

వస్త్ర భూషణములు / బాధించినను గూడ ; యెరువు నీయరాదు / యేరికైన
యాయ దలచు కొన్న / యిచ్చి గై కొనరాదు; సుగుణ రాశివైన / సుదతి వినుమ"

యేమియు తోచక యాలోచింముచుండగా మండన మిశ్రుని దొడ్డిలో నున్న తాటి కొబ్బరి మొక్కల నుండి ఒక గౌడుడు ఆ చెట్లు యెక్క నక్కర లేకుండగనే తన మంత్ర ప్రభావంతో ఆ చెట్లను క్రింది వరకు వంచి కల్లు గీస్తుండడం చూచి యింకా ఆశ్చర్యపడి వాడు బయటకు వచ్చే వరకు వేచివుండి వాని వద్దకు వెళ్ళి తనకా విద్య నుపదేశింపుమని కోరాడు. దానికా గౌడుడు -

"ఆచార్య వర్యా! కౌండిన్యోద్భవ సంజాతులగు పూజ్యపాదులు కాటమ మహేశ్వరుల వారు నాకు గురువులు. వారి కృపాకటాక్షములతో యీ విద్యను నేర్చుకొని పొట్ట పోసుకొను చున్నాను. మా గురువర్యులు నాకీ విద్య నుపదేశించే టప్పుడు తన అనుమతి లేకుండా యీ విద్య యితరుల కుపదేశిస్తే అది ఫలింపకపోవడమే కాక దరిద్రుడ నగుదునని చెప్పి యున్నారు. అందువలన మీకీ విద్యనుపదేశిస్తే నాజీవనోపాధి పోతుంది. గుర్వాజ్ఞను ధిక్కరించి నట్లవుతుంది. గనుక మీకు నేనీ విద్య నివ్వజాలను" అని ఖండితముగా చెప్పాడు.

అది వినిన శంకరాచార్యుడు - "ఓయీ! నీకు గురుధిక్కార పాపం కలుగకుండా చేస్తాను. నేను కూడా మహామహి మాన్వితుడనే - ఇక నీ జీవనోపాధికి వేరొక ఉపాయమాలోచించాను. నీవు ప్రతి రోజూ ప్రతి చెట్టు నుండి సురను తీసి దాన్ని విక్రయించి ఉదర పోషణ చేసుకొనే శ్రమలేకుండా నీవు నిశ్చింతగా నీ యింటి వద్ద కూర్చుండి యే ధనం సంపాదించే మరొక విద్యను నీకిస్తాను. దాని ప్రభావంతో నీ యిల్లంతా బంగారురాశులతో నిండిపోతుంది. మహారాజైనా నీ వద్దకు రావలసినదే అని అతనికి నచ్చ చెప్పి వానికి -"సువర్ణ ముఖి" యనే బంగారు చేసే విద్యను ఉపదేశించి దానికి ప్రతిగా గౌడుని వద్దనుండి గౌడ మంత్రాని పొందాడు. ఆనందించిన గౌడుడు వెళ్ళి పోయాడు.

మండన మిశ్రుడు ద్వారములను బంధించి లోపల పితరులకు శ్రాద్ధ కర్మ చేయించి భోక్తలగు వారికి భోజనాలు పెడుతున్నాడు. ఆ తలుపులు యెప్పుడు

---

*చిడుము గుజ్జి దురద / చెడు రోగములు యెన్నో; అంటు వ్యాధులగుచు / అనుసరించు యెరువు నీయకూడ / దెరవు గైకొనరాదు ; సుగుణ రాశివైన / సుదతి వినుమ"*

తీస్తారో తెలియదు. కాలహరణ సహింపలేని శంకరుడు మండన మిశ్రుని దొడ్డిలోని కొబ్బరిచెట్టును గౌడమంత్ర ప్రభావం వలన క్రిందికి వంచి దాని నెక్కి గోడ దాటి మండన మిశ్రుని వద్దకు వెళ్ళాడట! వాని రాకను గమనించి అతడు ఆశ్చర్యచకితుడయ్యాడట! తరువాత శ్రీ శంకరభగవత్పాదులు మండన మిశ్రుని వాదంలో ఓడించి విజయంతో వెళ్ళిపోయాడు.

చెట్లను వంగునట్లు చేసే విద్య కాశ్మీర దేశములోని గౌడులకు మాత్రమే తెలియునని, వారు తమ అసంఖ్యాక శిష్యులకా విద్య నుపదేశించారని దాని ప్రభావం వలన వారు తాళ వృక్షములును క్రిందికి వంచి సురను గ్రహించి రాజాంతఃపురములకు పంపే వారని తెలుస్తుంది.

సువర్ణ ముఖి విద్యను గ్రహించిన గౌడుడు ఆ విద్యా ప్రభావంతో అపరిమిత స్వర్ణరాసులను తయారుచేసి తన పేరను నాణెములను పోయించాడని, అందువలననే కొంత కాలం క్రితం వరకు అట్టి నాణెములను "ఈడిగకాసు"లని పిలిచే వారని పెద్దలు చెప్పుచుందురు. ఈ యితి హాసము వలన గౌడ వంశీయుల మంత్రోపాసన గౌరవ ప్రపత్తులు విశద మగుచున్నవి. శంకరాచార్యుడు అంతటి గొప్ప వ్యక్తి గౌడుని వద్ద మంత్రోపదేశం పొందడం ప్రతి గౌడుడు గర్వింపవలసిన విషయం.

**యేనాట్లు – జట్టీలు :** వీరు శ్రీ గోపాల గౌడు మహారాజా వారు రాజ్యపాలన చేసే సమయంలో వారి వంశావళిని, తత్ప్రతాప ప్రజ్ఞా సంపన్నతను, వారి సత్య ధర్మా చరణాదులను నిత్యము పారాయణము చేయు వంది మాగధులై రాజాంతఃపురములందు నిత్యము కైవారము చేయుచు మహారాజు మన్ననలను పొందుచుండిరి. వీరు రాజమందిరము లందే నివశించుచు వేకువ జాముననేలేచి మహారాజు గారి బిరుదావళులను గానం చేస్తూ, గసర సంకీర్తన చేస్తూ వారిని మేల్కొల్పి, రాజును, రాణి వాసపు స్త్రీలను, అంతఃపురములనుండి శివార్చనకు ప్రేరేపించి వారి కన్న ముందుగా శివాలయములకు పోవుచు మహారాజు రాకను ప్రజలకు యెరుకపర్చేవారు.

***

---

ఎరువు వస్తు వనిన / బరువుకు మూలంబు ; తెలియకుండ నీకు / తొలగవచ్చు
చోరులైన వారు / చూచిదొంగిల వచ్చు ; అట్లు పోయెనేని / తిట్లు వచ్చు //

# గౌడస్తుతి పాఠకులు

గోపాల గౌడు అస్తమించిన తరువాత వారి ఆస్థానములోని వందిమాగధుల లో ఒక తెగకు చెందిన సుప్రసిద్ధ గుణ సంపన్నులు, ప్రభు భక్తి పరాయణులు, విశ్వాసపాత్రులైన "వంది" అనే ఒక తెగవారు వారికి గల సర్వస్వమును విడిచిపెట్టి సంసారాది సమస్త సుఖములను పరిత్యజించి, కాటమ మహేశ్వరుడు యోగ సమాధిలో నుండు కాలమున వారికి సేవలు చేయుటకై వారి యందు గల భక్తి శ్రద్ధలతో శ్రీ వారి పాద పద్మముల నాశ్రయించి మోక్షాపేక్షులై వారి సన్నిధిని ఎల్లప్పుడు శుశ్రూషలు చేస్తూ వారి వద్ద వుండేవారు.

ఈ విధంగా కొంతకాలం గడిచింది. ఒకప్పుడు కాటమ మహేశ్వరుల వారు యోగ సమాధిలో నుండి కన్నులు విప్పి చూశారు. వారి చరణ కమలము లందు పడి యున్నకొందరు సేవకులు వారికి కనిపించేరు. వారప్పుడు దయార్ద్ర హృదయులై వారితో " అయ్యలార! మీరీ విధంగా నిద్రాహారాలు లేకుండా నేనేదో చేస్తానని వేచి యుండడం మంచిది కాదు మీ కోరిక మోక్షాపేక్ష అని నాకుతెలియును. అది సామాన్యులెవరికి సాధ్యం కాదు. దానికి శమదమాది సంపన్న జనకమైన మనః పరిపక్వము కావలెను. మీరింకా ఆస్థితికి రాలేదు. భూలోకంలో మీరింకా చేయవలసిన పనులు, అనుభవింప వలసిన సుఖ సంపద లున్నాయి గనుక మీరు మీ యిండ్లకు తిరిగి వెళ్ళినిత్యము గౌడమంత్ర రాజాన్ని పారాయణ చేస్తూ, కౌండిన్య ఋషి పుంగవుని యంశమున జన్మించిన గౌడుల నాశ్రయించి, వారి వంశావళులను స్తుతింపు చుండిన ఆ గృహస్తులు మిమ్ములను ఎల్లప్పుడు పోషించి రక్షింపగలరు. నాఆశీః ప్రభావము వలన మీ యందు మన కులస్తులందరకు ఆదరణ దయకల్గి మిమ్ములను గౌరవ మర్యాదలతో ఆదరిస్తారు" అని వారికి బోధించాడు.

అప్పుడు వారంతా కాటమ మహేశ్వరుని గురునిగా భావించి వారి ఆజ్ఞను శిరసావహించి వారికి సాష్టాంగ దండ ప్రణామములాచరించి –"ప్రభూ! తమ యాజ్ఞానుసారం మేము నడుచుకుంటాము గౌడ మంత్ర పునశ్చరణ వలన

---

ఎరువు వస్తువనిన / బరువుకు మూలంబు ; తెలియకుండ నీకు / తొలగవచ్చు
చోరులైన వారు / చూచి దొంగిల వచ్చు ; అట్లు పోయెనేని / తిట్లు వచ్చు॥

మాకు ముక్తి కల్గునట్లు అనుగ్రహింపుడు" అని ప్రార్థించారు.

దానికి సంతసించిన కాటమ మహేశ్వరుడు - "మీరుకోరిన ప్రకారము పరమేశ్వరుడు మిమ్ముల ననుగ్రహించుగాక" అని చెప్పి తిరిగి సమాధిస్థితి యందు లీనమయ్యాడు.

అప్పుడా గౌడస్తుతి పాఠకులు తమ తమ నివాసముల కరగి కాటమ మహేశ్వరుని ఆనతి ప్రకారం నడుచుకోజొచ్చారు. మరియు వీరు"అమృత సిద్ధరస స్రావక" మనే మహామంత్రాన్ని తోటి వారికుపదేశించి వారిని తమ శిష్యులుగా చేసికొని, వారామంత్ర సిద్ధిని పొందిన వారై తత్త్వభావము వలన అనాయాసంగా అమృత సిద్ధ రసమును కల్పించి బ్రాహ్మణాది సమస్త జాతుల కిచ్చుచు వచ్చిరి - వారలా అమృతసిద్ధ రసమును త్రాగి సత్వ గుణ సంపన్నులై ఈశ్వరు నారాధింపుచు అనంతరము శాశ్వత కైవల్యమును పొందిరి.

ఇట్టి మహా తపస్సంపన్నులగు మన వారా కాలము నందుండి యుండి రనుటకు వేరే తార్కాణ మవసరం లేదు. అందులో కలియుగములో మొదటి వాడు కాటమ మహేశ్వరుడు.ఇప్పటికి మన వారాపుణ్యపురుషుని పూజిస్తున్నట్లు ప్రత్యక్ష ప్రమాణాలున్నాయి. తెలంగాణాలో ప్రతి ఉత్సవంలోను మనవారు కాటమయ్యను విధిగా పూజిస్తారు. అట్టి స్తుతి పాఠకుల మిప్పుడు యేనాట్లు, జట్టీలని గౌరవ నామములతో పిలచుచు మనవారు వారిలో కొందరిని "గౌడవందు"లని కూడా పిలుస్తారు. సామాన్యంగా వీరు వైష్ణవ మత సాంప్రదాయకులైన వైష్ణవులు . వీరే మనకు గురువులని వస్తూ వుండడం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. శివారాధకులు, శివపూజా దురంధరులైన గౌడులకు వైష్ణవులే విధంగా గురువులయ్యారో తెలియలేదు. ఒక వేళ కాటమ గౌడుకు ఉపదేశమిచ్చిన జ్ఞాన బ్రహ్మ ఋషి వైష్ణవుడై యుండవచ్చును. ఆయన ఉపదేశములలో విష్ణువును గురించియే చెప్పి యున్నాడు. గౌడులకు శివ-కేశవ భేదం లేదని యిరువురు సమాన ఆరాధ్య దైవములని మనకీ యితిహాసము వలన తెలియుచున్నది.

---

పాచి ముఖము తోడ / పనులు చేయగ రాదు ; స్నాన మాచ రించి / చక్కగాను
అగ్ని వెలుగ జేయ / ఐశ్వర్యమబ్బును; సుగుణరాశివైన సుదతి వినుమ ///

# కౌండిన్య గోత్రముల వారి ఇంటి పేర్లు

## 1. కవుండిన్య, కమండల – కౌండిల్య

| | | | |
|---|---|---|---|
| అంకెం | చల్లపల్లి | పూరిళ్ళ | రాజులపూడి |
| అంగర | జనగాం | బయగాని | రాజులపాటి |
| అయ్యవరపు | (చ) శనగన (ని) | బాలిన | రావమళ్ళ |
| అయినాల | చిటికెన | బెజవాడ | వంకా |
| అడ్డాల | చిట్టి బొమ్మ | బెల్లంకొండ | వంగా |
| అత్తిలి | చిటిమీద | బొడ్డు | ఉయ్యూరు |
| అల్లూరి | చింతా | బొమ్మా | వెలగని (న) |
| ఆకుల | తపా(తడపా) | మాడెం | విన్నకోట |
| ఆత్మమూరి (కూ) | తాడూరి | మదనాల | శిడళ్ళ (డా) |
| ఇర్రంకి | దామెర్ల | మట్టా | సువర్ణకంటి |
| కట్టా | తొంటా | మాడుగుల | సురభి |
| కోసూరి | నిర్మల | యరకల | సుర్వి |
| కుమ్మరి | నెరపల్లి | యేకుల | సూదగా (న) |
| గాలి | పడమటి (ట) | యేమినేని | సోంపల్లి |
| గంగాధర | పులిచలన | రంగ | సోమన |

## 2. కారుణ్య గోత్రం

| | | | |
|---|---|---|---|
| అనంత | అడ్డాడ | ఊడా | చలమాల |
| అనగాల (ని) | ఆడము | కామన | చల్లాడ |
| అనుమోల | ఆనెం | కొత్తు | జయారాపు (న) |
| అనిపెద్ది | ఉప్పల | కేదాసుల | జయదేవుని |
| అయినవిల్లి | ఉప్పాల | గరిసికూటి | గుట్టం |
| అయినవెల్లి | ఉర్రింకి | చలపతి | చెలపాటి |

---

*సాధు చిత్తలగుచు / సతులుండ గావలె ; బీద బిక్కి జనుల / ప్రేమ తోడ*
*చూచుచుండవలయు / శుభము గోరుచు నెప్డు ; సుగుణ రాశివైన సుదతి వినుమ॥*

గంటికూటి
గాజులపాటి
గాలా
గుల్ల(గూళ్ళ)
గొట్టెల
గొట్టెపోతుల
గొప్పు
దావు
దాసరి
నంగెడ్డ
జెర్రిపోతుల
నక్కా
నాయుడు
నాగుల
నిమ్మని (ల)
నాసుల
నాతిపల్లి
నిచ్చెనకోల(ళ్ళ)
నూతుల
నేరెళ్ళ
పసిపల్లి
పంది
పాదం
పెద్ది
పొన్నూరు
పుల్లూరి
పోలగాని
బడుగు
భూపతిన
మల్లోలు
మన్నే
మడతల
మంద
మారేడు
మాన్యం (నెం)
మాదు
మార్గని
మానెం
మన్యం
మాటోరి
మాచగాని
మిడతా
ముక్కు
మురాల
ముప్పిడి
మెడవంపుల
మేడూరి
మేడి శెట్టి
మోదుగమూరి
మోతుకూరి
రాచమళ్ళ
రామాని
రాముగాని
రుద్రపాక
రేలంగి
వనం
వాకా
వడిబోయన
వంగల
వంగా
వడ్లమూడి (రి)
వీరంకి
వీరాని
విన్నపోటు(కోట)
వుడతా
వుప్పల
వేమూరి
వేముల
వేములకొండ
వెలివెల
శెట్టి
శొంఠి

## 3. వాత్స్యల్య గోత్రం వారి యింటి పేర్లు

అద్దంకి
అనమాల
అమరేశం
అధికారప్పు
అరివల్లి
అనుమోలు
అర్యపల్లి
ఆరేపల్లి
ఈడి
ఈరిన
ఈపూరి (రు)
ఉడతల
ఉంద్రకొండ
కంటే
క్రి
కస్తాని
కాసగాని
కాగిత
కాసాని
కాసాబత్తుల
కేశని
కేశనబోయిన
కుంటా
కుడిపూడి

ముసలి తనము నందు / ముడుతలు పడుమోము ; జుట్టు తెల్ల నగును / పట్టు వదలి
జవసత్వములుడిగి / జాలిగా చూపట్టు ; పల్లు నూడిపోవు / పట్టు దప్పి ॥

| | | | |
|---|---|---|---|
| కోమలి | చెరుక్కు | పాలం | భూబత్తుల |
| కొండేటి | చేబ్రోలు | పెనుగోడ(గొండ) | మరీదు |
| గూడూరి | చెల్లాడ | పిల్లి | మండపాక |
| గోడె | చోడవరపు | పులిపాటి | ముంతా |
| గోదా | జన్ను | పెనుమళ్ళ | ముంజాలూరి(రు) |
| గోళ్ళ | జోగి | పెరుమళ్ళ | మైనం |
| చల్లారి | డేగల | పెరుమాళ్ళ | మోర్ల |
| చిమటా | తమిటి | పాశిన | మోరా |
| చిలపెల్లి (ప) | తమిడి | పుట్టా | యాయన |
| చిల్ల పల్లి | దాసరి | పెండేల | యడవల్లి |
| చిరుతాళ్ళ | దామెర్ల | పెదశాంత | యద్దనపూడి |
| చిరులేళ్ళ | దేదిన | పొట్టన | యరగాని |
| చినపాటి | దొమ్మేటి | పోతరాజు | యామినేని |
| చింతగని | నారగని (గం) | పోతిన | యెనుముల |
| చిట్టూరి | పనసా | పోలగాల(ని) | యెలిగంట |
| చిటుకుబత్తిన | పరసా | బొర్రా | వాడరి |
| చీర్న (ర్ని) | పళ్ళెం | బొల్లికొండ | వీరమల్లు |
| చీకటిముంతల | పచ్చిపుల్సు | బుర్రా | వీరిన |
| చూర్నకంటి | వలివెల | బొలగం | వుండవల్లి |
| చింతలపాటి | పట్టిసేను | బొల్లా | సత్తూరు |
| చిట్టి వలస | పట్టిశీమ | బోట్ల | సాగారపు |

## 4. సురాభాండేశ్వర గోత్రం వారి ఇంటి పేర్లు

| | | | |
|---|---|---|---|
| అయితిగాని | కంచర్ల | కందుల | కందుకూరి |
| అయిలేని | కంది | క్రరి | కంభం(పాటి) |
| ఆర్తుగెళ్ళ | కందిమళ్ళ | కర్పూరపు | కాకుల |

---

*శీలము చెడినంత / జీవించుటయె వృధ ; దాన మివ్వలేని / ధనమది వృధ*
*పరుల కుపకరించు / పనులు చేయవలెను ; సుగుణ రాశివైన / సుదతి వినుమ //*

కారుపోతుల
కారింక (కి)
కాటూరి
కారాల
కాయల
కుక్కల
కుంచె
కుంటా
కోమటి
కొనకళ్ళ
కొలకండ్ల
కోడూరి
కొండవీటి
కేరం
కేశన (ని)
కోయిల
కొప్పుల
కొవ్విల
కోదాటి
గుడిపల్లి
గుడివాడ
గున్నం

గూడవల్లి
గూడెల్లి
చలపాటి
చలమాల
చామన
చిల్లిముంతల
చిన్న మెల్లి
చింతలబత్తిన
జలతాని
జల్లెల (డ)
జంపన
జంపాని
జనిపల్లి
జాన (ను)
జూకూటి
జూపల్లి
జామన
జొన్నా
తాళం
తల్లాడి
తాతా
తుళ్ళ

తుళ్ళూరి (రు)
తీగిరెడ్డి
తెలకోడు
ద్రాక్షారపు
దొంతెగని
డొంకెన
పరసా
పంపన
పరింకాయల
పలగాని
పరిసిబోయన(యి)
పామర్తి
పాకా
పొన్నమండ
పోసూరి
బండి
బత్తిన
బింగి
బుడ్డిగ
బుర్రే
భీమన (పల్లి)
మట్టపల్లి

మద్దెల (ద్ది)
మారిశెట్టి
మిద్దే
మూల (లా)
మేకా
మేకపోతుల
మోతుకూరి
యార్లగడ్డ
యాడే
యూరి
రేఖా
లంకెన (ల)
లింగాల
లుక్కా
వడ్డెంగుంట
వనమాల
వెలిగట్ల
వేములకొండ
సింహాద్రి
సిద్దిగన
సూరగన (గాని)

---

మధుర వాక్కులనగ / మానవతికి జెల్లు ; మాట మంచి తనము / మంచిగూర్చు
మధుర వాక్కు గాదె / మహిలోన జయమిచ్చు ; సుగుణరాశి వైన / సుదతి వినుమ ॥

శ్రీ లక్ష్మీగణపతయే నమః। సద్గురు కౌండిన్యాయ నమః।

# సమగ్ర గౌడుల చరిత్ర

# షష్ఠాధ్యాయము

## కాటమగౌడు

తృతీయాధ్యాయంలో శ్రీ గోపాల గౌడు మహారాజావారి చరిత్ర వ్రాశాను. అందులో కాటమగౌడు (ఈయనకు కాటమామహేశ్వరుడని, కాటమ ఋషీశ్వరుడని నామాంతరములు గలవు) ఈ మహారాజుకు ధర్మపత్ని యైన వీరమాంబ గర్భంలో శంకరవరప్రసాదం వలన జన్మించిన వాడని తెలిసికున్నారు. ఈయన ఆ పుణ్యదంపతులకు కనిష్ఠకుమారుడు. గోపాల గౌడు చిరకాలము ఏకచ్ఛత్రాధిపత్యంగా తన రాజ్యమును పాలించి చివరకు సంసారమును, రాజ్య సుఖములను పరిత్యజించి, రాజ్యభారాన్ని కుమారుడైన కాటమగౌడుకు వప్పగించి హిమవత్పర్వతమునకు పోయి ఈశ్వరుని గూర్చి ఘోరతప మాచరించి, పరమేశ్వర సాక్షాత్కారం పొంది శివసాయుద్యం చేరుకొన్నాడు.

తరువాత కాటమగౌడు రాజై తండ్రి వలెనే మోక్షకాముడై బ్రహ్మచర్య వ్రతాన్నవలంభించి వివాహం చేసికొనకుండా ప్రజాశ్రేయస్సును కోరి ప్రజలను కన్న బిడ్డల వలె పాలించి యేయీతిబాధలు లేకుండా సుభిక్షంగా రాజ్యపాలన చేశాడు. అతడు తన తపః ప్రభావంతో భూలోకమందలి కల్పవృక్షముల నుండి అమృత సిద్ధ రసమును తీసికొనుటకు ఆ వృక్షములను భూమికి వంగులాగున చేసి రసమును తీయుచుండెడివాడు. అతడామంత్ర రాజమును తన శిష్యుల కుపదేశింపగా వారు కూడా అనాయాసంగా కల్పవృక్షములనుండి అమృత సిద్ధ రసమును కల్పించి భూలోకవాసులగు మహారాజులకు, దేవలోకవాసులైన సిద్ధ-సాధ్య, విద్యాధరులాదిగా గల సమస్త దేవతల కిచ్చి వారి వలన గొప్ప గౌరవమును

చదువు సంధ్యలందు / సరి సమానము మేము ; ఆలుమగల మధ్య / హక్కులనుచు
క్లబ్బులందు తిరుగు / కాంతల గతి చూడు; పతి దొరంగు భార్య / పాట్లు గనుమ //

ఆశీసులను పొందెడివారు. అనంతరము వీరు ఈశ్వరారాధనాతత్పరులై శాశ్వత సౌఖ్యమును ఆనందమును పొందిరని తెలియుచున్నది.

అనేక దివ్య సంవత్సరాలు కాటమగౌడు రాజ్య పాలన చేసి, రాచ వ్యవహారము లందు విరక్తిని చెంది తనరాజ్యాన్నంతటిని తన జ్ఞాతియైన "వీరభోజు" డనువానికి దత్తతపరచి , తన గురువగు జ్ఞాన బ్రహ్మఋషి వలన యోగాభ్యాస క్రమమునంతా ఉపదేశింపబడిన వాడై చిరకాలము యోగ సమాధి యందున్నట్లు విశదమగు చున్నది. జ్ఞానబ్రహ్మ ఋషి ఉపదేసించిన యోగాభ్యాస క్రమం యీ క్రింద పొందుపర్చుచున్నాను. (అగ్ని పురాణాంతర్గతము)

## సమగ్ర

# గౌడుల చరిత్ర

(గౌడ-సెట్టిబలిజ-ఈడిగ-శ్రీశైన-యాత-చెగిడీలు)









1993



గ్రంథకర్త
డా॥ బుడ్డిగ ఆదినారాయణ మూర్తి గౌడ్